324 వ సంచిక

# చతుర

జనవరి 2005 రూ.7/-





సమస్యల జడిని అడ్డుకుంటుందీ ఛత్రం!
అన్నిటినీ అధిగమిస్తానులే నేను మాత్రం!!

ఫొటో:
వి. నిత్యానందరావు

వైవిధ్య నవలావేదిక

చతుర

సంపుటి: 27 సంచిక: 12

జనవరి 2005 324వ సంచిక

## ఈ నెల 'చతుర'లో...



ఇంకా కుష్వంత్‌సింగ్ జోకులు, ముద్దంశెట్టి అండమ్మ సేకరించిన మంచి మాటలు..

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : మధు మోడల్: ప్రభ

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు

కథక్కావలసింది ముగ్గురు. ఒకరు పాత్ర. మిగతా ఇద్దరూ మూడ్‌నిబట్టి మీరే... రచయితా, పాఠకుడూ. రాయడానికి కాగితం, కలం తీసుకొనే ముందు ఈ ప్రశ్నలు వేసుకుందాం.



1. ఎవరి గురించి 2. ఎవరు ఏ పనులు చేస్తారు 3. దేన్ని గురించిన కథ 4. ఎక్కడ జరుగుతున్నది 5. ఎప్పుడు (కథాకాలం).

వీటి సమాధానాలే!

1. పాత్రలు 2. పనికి కారణం 3. ఇదే కథావస్తువు 4. కథాస్థలం, దృశ్యం సెట్టింగ్

కొందరు రచయితకూ, మెజీషియన్‌కూ పోలికలున్నాయన్నారు. కథ కల్పన అంటే భ్రమ. అయినా ప్రదర్శనను పాఠకులు/ప్రేక్షకులు ముగ్ధులై చూస్తారు.

మెజీషియన్‌కేం కావాలంటారు?

తన ట్రిక్కును తాత్కాలికంగా నమ్మగలిగే ప్రేక్షకులు. మెజీషియన్ ప్రేక్షకుల్లో ఒకడుకాదు. అతడు ప్రేక్షకుల దృష్టిని తన మీదే కేంద్రీకరించుకోగలగాలి. (అతడి మాటల్లో, చేతల్లో, హావభావ ప్రదర్శనలో, కదలికల్లో ఓ నాటకీయత వుంటుంది)

"ప్రేరణకోసం నిరీక్షించేవాళ్లూ, స్వశక్తి మీద నమ్మకంలేని వాళ్లూ, జీవితంలో నాటకీయతను చూపలేని వాళ్లూ కథలు రాయటానికి అనర్హులు"

"నువ్వు వంద చెత్తకథలు రాస్తే అది ఓటమి కాదు. రాయటం మానేసినప్పుడే నిజమైన ఓటమి" అంటాడు రే బ్రాడ్‌బరీ

"రాయాలనుకున్నప్పుడు రాని ప్రేరణ దొంగ లుపడ్డప్పుడు మొరగని కుక్క లాంటిది"

"ప్రతిభ ఒక్కటే సరిపోదు. శ్రమించ గలిగే స్వభావం లేకపోతే ఎంత ప్రతిభ వున్నా వృథా. పైగా ప్రతిభ జన్మసిద్ధం. అందులో నీ ప్రమేయం ఏముంది? " అంటాడు చెహోవ్.

పాఠకులు ఎవరు?

నువ్వూ, నేనూ

రాసేది

నువ్వూ నేనూ

పాత్రలు - నువ్వూ నేనూ

కేవలం మనస్తత్వ చిత్రణ పాత్రల్ని ఆసక్తికరంగా మలచలేదు. మనం ఎప్పుడూ ఆలోచిస్తూనే కూర్చుంటామా? ఏదో ఒకటి చేస్తుంటాం. ఆలోచనలవల్ల 'తాత్వికత'

4 జనవరి 2005 [signature]

వస్తే వస్తుందేమోగాని పనులు చేయటం వల్ల కథ ముందుకు సాగుతుంది.

★ ★ ★

చాలా మంది ప్రారంభ రచయితలకు వ్యక్తుల్ని గురించిగాక సమస్యల్ని గురించి రాయాలని తహతహ. ప్రత్యేకమైన సంఘటనల్ని, సన్నివేశాల్నిగాక ఆదర్శవాదాన్ని గురించి చర్చించటం వాళ్లకిష్టం. వాళ్లకో ఊహ తట్టొచ్చు ఓ భావం కలగొచ్చు లేదా కొన్నిసార్లు అహం దేన్నో ప్రేరేపించవచ్చు అంతే. వాళ్లు వెంటనే కథ రాసెయ్యాలనుకుంటారు. లేదా తాము తెలుసుకున్న లౌకిక జ్ఞానసారాన్నంతా పామరపాఠకులకు తెలియజెయ్యాలనుకుంటారు. అసలు విషయమేమంటే వాళ్ల దగ్గర జ్ఞానం వుంటే వున్నదేమోగాని కథ మాత్రం లేదు. ఉన్నా రాసే ఓపిక లేదు. కథ లేదు కనుక దానికి మారుగా ఓ థియరీయో, ఓ శిల్పమో వుంటే సరిపోతుందనుకుంటారు.

ఇంద్రియాల క్రీడాంగణమీ లోకం. వసంత కాలంలో పిల్లతెమ్మరతో కలిసి మనల్ని కౌగిలించుకునే పుష్పసుగంధం, తొలి వేకువలో వెచ్చని సూర్యకిరణాల దోబూచులాట, చలికాలం రొద పెట్టే ఈదురుగాలీ, పక్షుల కిచకిచలూ, గుక్కెడు వేడి కాఫీ గొంతులో పడితే అదే స్వర్గమనుకుని వంటింటివైపు కదిలే మనం...

ఇంద్రియజ్ఞానాన్ని తాత్కాలికంగా సుప్తావస్థలో వుంచటం సాధ్యమే- ఉదా॥ శరీర ఉష్ణోగ్రత వున్న, నీళ్లతో స్నానం చేసినప్పుడు. కానీ ఆ దశలో మిగతా ఇంద్రియాల చైతన్య స్థాయి పెరుగుతుంది. ఇంద్రియాల ద్వారా తప్ప ఈ లోకాన్ని అర్థం చేసుకోవటం మనకు సాధ్యపడదు. మైక్రోస్కోప్, స్టెతోస్కోపు, రోబో, సేట్‌లైట్, శ్రవణ యంత్రం, కళ్లద్దాలు లాంటివి ఉపయోగించి ఇంద్రియ గ్రహణ శక్తిని పెంచుకోవచ్చు కాని ఇంద్రియ జ్ఞానానికి అతీతమైనది మనకు తెలిసే అవకాశం లేదు. అయినా ప్రయత్నం, పరిశోధన మాత్రం మానం. కొత్త రుచులు, కొత్త వాసనల కోసం అన్వేషణ కొనసాగుతూనే ఉంటుంది. జపాన్‌లో ఒక చేప- 'పఫర్‌ఫిష్ కారిక పూగూ'ను పాకశాస్త్ర ప్రవీణులు వండి వడ్డిస్తారు. ఈ చేప విషజీవి. ప్రాణాంతకం కానంత విషం మాత్రం చేపలో మిగిలిపోతుంది. అనేక మంది పూగూప్రియులు ఆ విందారగించి మరణించినట్టు గణాంకాలు చెబుతున్నాయి. అయినా ఆ రుచి ఎలా వుంటుందో తెలుసుకోవాలనే కొత్త వాళ్లకు కొదవ లేదు.

సంస్కృతీ భేదాల్ని బట్టి కొన్ని రుచులు, వాసనలు, దృశ్యాలు ప్రత్యేకతల్ని సంతరించుకొన్నాయి. వేల సంవత్సరాల నాటి ప్రేమికుల కథలు ఇప్పటికీ మనకు ప్రేరణ కలిగిస్తాయి. గ్రహణ శక్తులు మారనంతవరకూ కాలప్రవాహం మనల్ని కలుపుతూనే ఉంటుంది.

ఇంద్రియాలు మన మెదడుకు పంపించే సంకేతాల వలన 'ఊహ' ఏర్పడుతున్నది. జ్ఞాన పరిధుల్ని పెంచేవీ, పరిమితులు విధించేవీ ఇంద్రియాలే.

ఇంద్రియ శక్తుల్ని అత్యద్భుతంగా ఉపయోగించిన వ్యక్తి- ప్రపంచ సుందరులూ, కళాకారులూ, శాస్త్రజ్ఞులూ కారు - హెలెన్ కెల్లర్ అంధ, చెవిటి, మూగ స్త్రీ. మిగతా మూడు గ్రహణ యింద్రియాలతో మనకు లోకాన్ని గురించిన కొత్త జ్ఞానం నేర్పించింది. రేడియో మీద చేతులానించి, ఆ ప్రకంపనలతో ఆమె రాగాలు చెప్పగలిగేది. తన మిత్రుడు మార్క్‌ట్వేన్ కథలకు స్పందించింది. రంగుల గురించీ, వాసనల గురించీ, స్పర్శానుభవాన్ని గురించీ ఆమె విస్తారంగా రాసింది. మనందరికన్నా జీవితాన్ని ఎక్కువగా అనుభవించింది హెలెన్ కెల్లర్.

– ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★

జ్ఞానతరంగిణి

## మహర్షి దాతాదయాల్‌గారి సందేశం

# పనిలో నిమగ్నం కావాలి

ప్రాతఃకాలంలో నిద్రలేచి స్నానాదులు ముగించి భగవంతుని ధ్యానించి, ఖాళీస్థలంలో కాసేపు విహరించు. ఆ తరువాత నీ దినకృత్యాలలో నిమగ్నం కావటం మంచి అలవాటు. చల్లని గాలి శరీరానికి తగిలినప్పుడు రక్తం, నరాలు శుద్ధవుతాయి. జీర్ణశక్తి సరిగ్గా ఉంటుంది. శరీరం ఆరోగ్యవంతమవుతుంది.

**ధ్యానం, యోగం వంటి అన్ని రకాల సాధనలకూ, అభ్యాసాలకూ ఈ సమయం ఉత్తమంగా ఉంటుంది. చదవటం, రాయటం, సంగీతం... ఇలా ఏ కళను ఈ సమయంలో ఉపాసించినా మనిషి జీవన పర్యంతం మర్చిపోలేడు.** అతని పని అసంపూర్ణంగా మిగిలిపోదు.

ప్రాతఃసమయం దేవతల సమయం. కమలాలు, గులాబీలు, మల్లెలు తదితర పుష్పాలు విరియగానే తుమ్మెదలు ఝుంకరిస్తూ సుగంధాల ఆనందాలు అనుభవిస్తుంటాయి. తేనెటీగలు మధువుల్ని పీల్చి విహరిస్తాయి. ప్రకృతి అందాల్ని ఆస్వాదించే స్వర్ణావకాశాన్ని వినియోగించుకోక, ఆహ్లాదం అనుభవించని మనిషిని చూసి జాలిపడాలి.

చల్లని గాలి మనసుకు, మెదడుకు తాజాదనాన్నిస్తుంది. పక్షుల కిలకిలారావాల వేళలో సోమరి కాళ్లు చేతులు ముడుచుకుని పడుకుంటాడు. అతని శరీరంలోకి స్ఫూర్తి, చైతన్యం రావటం కష్టం. శారీరక స్థితి సవ్యంగా ఉండదు. నిజానికి అలాంటి వారికి నిద్రాసుఖం కూడా పరిపూర్ణంగా ఉండదనే చెప్పవచ్చు

**పనిలో నిమగ్నమైన మనిషి భగవంతుడికి ప్రీతిపాత్రమవుతాడు.** ఇది ప్రతివారూ గుర్తుంచుకోవలసిన సత్యం. బద్ధకస్తుడి మెదడు భూతాల కర్మాగారంలా భయంకరమైన ఆలోచనతో నిండి ఉంటుంది.

దురాలోచనలు, దుష్ట భావనలు, భావ దారిద్ర్యం ఎలా వస్తాయి? ఎక్కడి నుండి వస్తాయి? ఎప్పుడైనా ఆలోచించావా? కనీసం ఇప్పుడైనా ఆలోచించు.

పని లేదనే భావమే అన్ని దుష్టగుణాలకు జనని. సోమరితనం తండ్రి. నిర్లక్ష్యం అన్న.

పనిలేక సోమరిగా ఉన్న వ్యక్తుల ఇళ్లల్లో అనునిత్యం ఘర్షణలు, పోట్లాటలు జరుగుతుంటాయి. అతనికి హృదయం భారంగా, లోకం చీకటిగా అనిపిస్తుంటుంది. సభ్యత, మానవత, జ్ఞానం అతనిలో లోపిస్తాయి.

ఉషోదయ వేళల్లో ఏ పనైనా త్వరగా పూర్తవుతుంది. మనసు ఉత్సాహంగా ఉంటుంది. ఇది మిగతా సమయంలో ఉండదు. పొద్దున్నే చేసిన గంటసేపటి పని మిగతా సమయాల్లో చేసే రెండు మూడు గంటల పనికి సమానం.

సోమరి నేటి పని రేపటికి వాయిదా వేస్తాడు. ఏ పనినీ సంపూర్ణంగా సాధించజాలడు.

తాళం కప్పను, తాళం చెవితో రోజూ వాడుతుంటేనే అది సక్రమంగా పనిచేస్తుంది. లేకుంటే అది చిలుమెక్కుతుంది. శరీరం కూడా ఇంతే. సక్రమంగా వినియోగించుకోకుంటే అది సోమరిగా తయారవుతుంది.

**పనిమంతునికి ఇతరుల అవగుణాలు చూసే సమయమే ఉండదు. ఎవరి నిందలూ, దోషాలూ వినడానికి కుతూహలం చూపించడానికి సమయం మిగలదు.** ఇలాంటి మనిషే సత్యమైన ధార్మికుడు.

చిన్నతనంలో బడికి వెళ్ళటానికి ఇష్టపడని సోమరి పిల్లలు పెరిగి పెద్దయ్యాక విద్వాంసులు కావటం కష్టం. **ఆఫీసులో గడి**

6 జనవరి 2005 సాక్షి

యారం ముళ్ళవైపే చూసే మనిషి ఉన్న తిని పొందజాలడు.

ఏదైనా పనిచేస్తున్నప్పుడు ఆ పనిలో చిత్తం ఏకాగ్రం చెందాలి. కుడి ఎడమ వైపుల ధ్యాస కూడా రాకూడదు. పనిలో నిన్ను నీవు మరచిపోవాలి. ఇలా నిరంతరం పనిలో లీనమయితే గడియారం ముళ్ళ చప్పుళ్ళు కూడా వినిపించవు. ఇతరుల మాటలు చెవుల్లో దూరవు. ఆపైన నీ బుద్ధి, వివేకం, అనుభవం, యోగ్యత దిన దినాభివృద్ధి చెందుతాయి.

పనిలో నిమగ్నమైనప్పుడు లభించే ఆనందం మరొకరకంగా దొరకదు.

శ్రమజీవి నీచస్థితిలో ఉండడు. అతని దశమారుతూ ఉంటుంది. చూస్తుండగానే ఉన్నత స్థితికి చేరుకుంటాడు.

పనిచేయని వారికి సమయం గడవదు. రాత్రింబవళ్ళు పనిలో నిమగ్నమైన వారికి సమయం ఎలా వచ్చిందీ ఎలా వెళ్ళిందీ తెలియదు. వాళ్లు సదా ప్రసన్నచిత్తులుగా ఉంటారు.

శ్రమించే మనిషిని దారిద్ర్యం వేధించదు. శ్రమే రోగాలకు మందు. బలహీనతలకు ఔషధం. సోమరికి సుఖశాంతులుండవు. జీవితం దుఃఖభాజనము అవుతుంది. అతనికి పగలు శాంతి ఉండదు. రాత్రికి నిద్ర పట్టదు.

శ్రమించే వ్యక్తి రోజంతా పనిలో మన స్ఫూర్తిగా నిమగ్నమై తననుతాను మర్చిపోతాడు. రాత్రి గాఢనిద్రలోని సుఖం అనుభవిస్తాడు. జీవితం ఇతనికి సంతోషమయమై పోతుంది.

జీవితం కేవలం శ్రమించేందుకేనని మరవొద్దు. శ్రమించని వాళ్ళకు జీవనంలోని నిజమైన ఆనందాలు లభించవు. జీవన కాలాన్ని సంవత్సరాలతో లెక్కించేబదులు చేసిన, చేస్తున్న పనితో లెక్కించాలి. ఎక్కువ పని చేసిన వారి జన్మమే సఫలం అవుతుంది. పదిమందికి ఉపయోగపడే పనులు చేయటం మంచిది. పనిచెయ్యని వారి జన్మ వృధాగా గడిచిపోతుంది.

పనిలో నిమగ్నమైతే చిత్తం ప్రశాంతంగా ఉంటుంది.

రోజూ కొంచెం కొంచెమే పనిచేయి. కొన్ని రోజుల్లో అదే పెద్ద పనిగా తయారవుతుంది. ఒక్కొక్క నీటిబొట్టు కూడితేనే చెరువు నిండుతుంది. సముద్రం కూడా నీటి బిందువుల సముదాయమే కదా!

ప్రకృతిలో ఏ వస్తువూ స్తబ్దంగా, సోమరిగా లేదు. నీవు మాత్రం భ్రమలో పడి, సోమరితనంతో జీవనాన్ని ఎందుకు నష్టపరుచుకుంటావు? నదిలో నీరు ఒక్కచోటనే నిలబడదు. నిలవవున్న నీటిలో మురుగు పుడుతుంది. ఇదే విధంగా పనిపాటలు లేక ఉండేవారి మనసులో లక్ష చెడు ఊహలు పుడతాయి.

శాంతి నెలకొని వున్న ఇంట్లోని సభ్యులందరూ శ్రమజీవులని అర్థం చేసుకోవచ్చు

శ్రమించే వ్యక్తులు తమ పిల్లల్ని కూడా ఏదో ఒక పనిలో నియమిస్తారు. అందుకే వాళ్ళంతా సుఖశాంతులతో ప్రసన్నచిత్తులై వుంటారు. ఉదాసీనులుగా విచారగ్రస్తులుగా ఉండరు. సోమరుల పిల్లలు వ్యర్థులూ, గయ్యాళులూ అవుతారు. పిల్లలు ఏ పనిచేసినా మనస్సు పెట్టి చేస్తారు కనుక వారిని వ్యర్థంగా ఉండనీయరాదు. లేకుంటే దుఃఖమూ, సమస్యలే మిగులుతాయి.

పనిలో నిమగ్నమైతే ఉన్నతి దానంతటదే లభిస్తుంది. రారాజులు, చక్రవర్తుల పిల్లలు భిక్షమెత్తే స్థాయికి దిగజారటం, బిచ్చగాళ్ళ పిల్లలు రాజసింహాసనం ఆక్రమించుకోవడం లాంటి సందర్భాలున్నాయి. ప్రకృతిలోని ప్రతివస్తువూ ఏదో పనిలో నిమగ్నమై ఉండగా మనిషి చేతులు ముడుచుకు కూర్చోవటం ఎంతవరకు సమంజసం?

మరో పదినిమిషాల్లో నన్ను మృత్యువు కబళించ బోతున్నదని నాకు ముందుగా నే తెలిస్తే చివరి మూడు నిమిషాల వరకు పని చేస్తూనే ఉంటాను.

సేకరణ, అనువాదం: జ్యోతిరాణి

★

# చతుర ప్రపంచం

## బైబిల్ భారతీయ భాషల్లోకి ఎలా వచ్చింది?

భారతదేశంలో క్రిస్టియానిటీ రావడానికి పాశ్చాత్య మిషనరీలు కొంత కారణమైతే, అది నలు మూలలా వ్యాప్తి చెందడానికి జాషువా మర్ష్‌మేన్ అనే ఇంగ్లండ్ దేశస్థుడు కారణం.

ఇంగ్లండ్‌లోని విల్‌షైవ్ అనే ఊరిలో, జాషువా 1768, ఏప్రిల్ 28న జన్మించాడు. 26వ ఏడు వచ్చేదాకా అతను సాలెవాడుగా పని చేసే వాడు. తర్వాత బ్రిస్టల్ అనే ఊళ్లో ఓ బాప్టిస్ట్ చర్చ్‌లో ఉద్యోగం చేశాడు. అయిదేళ్ల పాటు అక్కడ బైబిల్‌కి చెందిన ముఖ్య భాషలయిన హెబ్రూ, సిరియన్ అనే భాషలు అభ్యసించాడు. బైబిల్ శిక్షణలో ఔపోసన పట్టాడు.

1799లో తన 31వ ఏట అతను ఇండియాకి వచ్చాడు. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లెస్లీ క్రిస్టియానిటీ ప్రచారానికి ఎంతో సహకరించాడు. భాషలని తేలిగ్గా త్వరలో నేర్చుకునే నైపుణ్యంగల జాషువా అనేక భారతీయ భాషలని నేర్చుకున్నాడు. దాంతో పాటు చైనీస్ భాష కూడా నేర్చుకున్నాడు. బైబిల్‌ని తొలిసారిగా భారతీయ భాషల్లోకి, చైనీస్ భాషలోకి జాషువా అనువదించాడు.

కలకత్తాలో వుంటూ ఇతను, తన భార్య సహకారంతో ఓ బోర్డింగ్ స్కూల్‌ని స్థాపించాడు. దాని మీద ఆదాయం బావుండేది. ఆదాయాన్ని బైబిల్ ప్రచారానికి వినియోగించసాగాడు. బెంగాల్‌లో సెదాంపూర్ చర్చిని ఇతనే స్థాపించాడు.

భారతీయ భాషల్లోంచి హిందూ మతగ్రంథాలని ఇంగ్లీషులోకి అనువదించాడు. ఇంగ్లీష్ - చైనీస్ భాష డిక్షనరీని రూపొందించాడు. దీని నిమిత్తం అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం జాషువాకి 1000 పౌండ్లు బహుమతి నిచ్చింది. కలకత్తా నుంచి బెంగాల్ భాషలో తొలి దినపత్రికను వెలువరించాడు.




విలియం వార్డ్ 'విలియం కేర్' జాషువా మార్ష్‌మేన్‌లు ముగ్గురు ఇండియాలో స్థిరపడ్డ ముగ్గురు బాప్టిస్ట్ మిషనరీలు. వారు బెంగాల్‌లో క్రిస్టియానిటీ ప్రచారానికి తమ జీవితాలను వెచ్చించారు. ఈ ముగ్గురిలో ఆఖరిగా మరణించిన జాషువా, 1837లో తన 69వ ఏట మరణిస్తూ బెంగాలీ భాషలో దేవుడిని ప్రార్థిస్తూ మరణించాడు.

★

# మీరూ చతురులే!

హాస్యప్రియులైన 'చతుర' పాఠకులకు ఓ శుభవార్త. ఫిబ్రవరి 2005 నుండి 'చతుర'లో మీ ప్రశ్నలకు హాస్యబ్రహ్మ, చతుర చతురానన శంకరనారాయణ సరదా సమాధానాలు ఇవ్వబోతున్నారు. ఏ అంశానికి సంబంధించినవైనా అడగవచ్చు. ఇకనేం! ప్రశ్నాస్త్రాలు సంధించండి మరి. మీదే ఆలస్యం!

**గతంలో శంకరనారాయణను అడిగిన ప్రశ్నలూ, ఆయన ఇచ్చిన సమాధానాలు ఉదాహరణకు ఇక్కడ ఇస్తున్నాం.**

కె. వెంకటేశ్వరరావు, నారాయణపేట

ప్ర: మీరు వెజిటేరియనా? నాన్ వెజిటేరియనా?

**జ: భోజనం ముందు వెజిటేరియన్‌ను. జనం ముందు నాన్ వెజిటేరియన్‌ను**

వి. జయప్రకాశ్, ఒంగోలు.

ప్ర: గుడ్డికంటే మెల్లమేలు అంటారు. నిజమేనా?

**జ: 'మెల్ల'గా చెబితే ఫర్వాలేదు.**

కె. శ్యాంప్రసాద్, విజయవాడ.

ప్ర: వచ్చే జన్మంటూ ఉంటే మీ కోరిక ఏమిటి?

**జ: సెన్సార్ బోర్డు మెంబర్‌గా ఉండాలన్నదే నా కోరిక. ఏవి చూసినా ఎవరూ అభ్యంతరపెట్టరు!**

ఎం. రమేష్, కొత్తగూడెం.

ప్ర: కొన్ని సినిమాలు హాస్యచిత్రాలని ప్రచారం చేసుకుంటారు. దీనిని అరికట్టాలంటే...

**జ: ఎ సర్టిఫికెట్, యు సర్టిఫికేట్‌లాగా హెచ్ (హ్యూమర్) సర్టిఫికెట్ ఇస్తే తప్ప విడుదల చేయకూడదు.**

ఎ. శారద, బెంగుళూరు.

ప్ర: కొంతమంది నటీమణులు దుస్తుల విషయంలో ఎందుకు దిగజారిపోతున్నారు?

**జ: ఎంత దిగజారితే అంతగా ఎగబాకగలమన్న తాపత్రయం... డ్రస్సు ముఖ్యం కాదు అడ్రసు ముఖ్యమన్నది అందులోని ఫిలాసఫీ.**

ఎం. వి. రామారావు, కోరుట్ల.

ప్ర: ప్రతి పురుషుడి విజయం వెనక ఒక స్త్రీ ఉంటుందంటారు. కామెంట్ ప్లీజ్.

**జ: ఒక స్త్రీ ఉన్నంతవరకు ఇబ్బందేమీ లేదు... ఇద్దరు ముగ్గురు ఉంటేనే కామెంట్స్ వస్తాయి.**

మీ ప్రశ్నలను **మీరూ చతురులే!** **'చతుర'** మాస పత్రిక, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైద్రాబాద్ - 500 082 చిరునామాకు పంపగలరు.

# చేపల చెరువుల మోజును ఛిన్నాభిన్నం చేసిన 'గట్టుమీదచేప'




సాధారణ వస్తువును తీసుకుని అద్భుత శిల్పంతో అందరినీ చదివించే నవలగా మలచడం అందరికీ సాధ్యంకాదు. అలాంటి ప్రయోగాలలో సిద్ధహస్తుడు పి. చంద్రశేఖర్ ఆజాద్. అచిరకాలంలోనే మంచి కథకుడిగా పేరుతెచ్చుకున్న ఆయన ఎన్నో కథలు రాశారు.. నవలలు రాశారు. కేవలం 'చతుర' మాసపత్రికలోనే 'భయం', 'ది రోడ్', 'భువికి దిగిన తార', 'మనీషి', 'భూషణంగారి భోషాణం', 'గట్టు మీద చేప' పేర్లతో ఆయనవి ఆరు నవలలు అచ్చయ్యాయి. ఇవన్నీ ఆయనకు మంచి గుర్తింపు తెచ్చిపెట్టాయి. వీటిలో 'గట్టుమీద చేప' ఆ రోజుల్లో సంచలనమే సృష్టించింది. 'చతుర' నవలల పోటీల్లో ద్వితీయ బహుమతిని అందుకున్న ఈ రచన వెనుక చాలా కథ ఉంది. అదే ఈనెల మన 'కథవెనుక కథ'. దానిగురించి ఆజాద్ ఏమంటున్నారో చూడండి..




'గట్టుమీద చేప' నవల రాసే సమయానికి 'చేపల చెరువుల' కల్చర్ మంచి ఊపుమీద వుంది. దాని తాలూకు కొన్ని దుష్పరిణామాలూ అక్కడక్కడా కళ్లకు కడుతున్నాయి. ఆ నవల రాస్తున్న కాలంలో ఏలూరులో ఉద్యోగం చేస్తున్నాను. ఏలూరు దాటిన దగ్గర్నుంచీ అన్నీ చేపల చెరువులే.. అంతకు ముందు 'ది రోడ్' నవలలో కూడా చేపల చెరువుల గురించి కొద్దిగా ప్రస్తావించాను. ఓ రకంగా చెప్పాలంటే- వ్యవసాయ రంగంపై 'చతుర' లో వచ్చిన 'ఆక్రందన' నవలే దీనికి ప్రేరణ. మొలకలపల్లి కోటేశ్వరరావు రచన అది. దాన్ని దృష్టిలో పెట్టుకుని 'చతుర' నవలల పోటీకి చేపల చెరువులమీద రాస్తేనో అన్న ఆలోచన వచ్చింది. ఉద్యోగరీత్యా ఉండే పనిఒత్తిడివల్ల పోటీలకు పంపే నవలలను సాధారణంగా చివరి నిముషంలోనే రాస్తుంటాను. ఇప్పటికీ నాది అదే తీరు. సరే.. సబ్జెక్టు అనుకున్నాను కానీ దాని గురించి నిజానికి నాకేమీ తెలియదు. తెలియని విషయం మీద ఏదో ఒకటి రాస్తే అపహాస్యానికి గురవడం ఖాయం. అన్నీ తెలుసుకుని రాయాలనుకోవడంవల్ల కూడా కొన్ని చిక్కులు లేకపోలేదు. ముఖ్యంగా 'అన్నీ తెలుసుకోవడం'

అనేది అసాధ్యం. ఎందుకంటే ఎప్పటికప్పుడు ఏ రంగంలోనైనా ఏవో మార్పులు వస్తూనే ఉంటాయి. అలాగని ప్రాథమిక అవగాహన లేకుండా రాయడమూ దుస్సాహసమే.

**మిత్రుడితో మంతనాలు**

అంతలో నాకు కె. హెచ్. కుమార్ గుర్తొచ్చాడు. అతను మిత్రుడే కాదు. చేపలచెరువల విషయంలో మంచి అనుభవం ఉన్నవాడు.. మీదుమిక్కిలి అందులో దిగి తీవ్రంగా నష్టపోయినవాడు. ఇంకా చెప్పాలంటే అతను ప్రజానాట్యమండలిలో పనిచేసేవాడు. కేవలం పైపై విషయాలను మాత్రమే చెప్పకుండా లోతైన విశ్లేషణ చేయగలవ్యక్తి. నేను అతనే నా కథానాయకుడు అనుకున్నాను. 'గట్టుమీద చేప' నవలలో హీరో ఇంజనీర్. చేపలచెరువుల 'బూమ్' చూసి, చేస్తున్న ఉద్యోగం మానేసి ఈ రంగంలోకి వస్తాడు. ఇకనేం? అనుకున్నట్లే కుమార్‌ను కలిసి కొన్ని ప్రశ్నలు అడుగుతా.. జవాబులు చెప్పమన్నాను. ఓకే అన్నాడు. అలా ఈ నవలకి అంకురార్పణ జరిగింది.

**అవసరమే పురికొల్పుతుంది**

సమాజంలోకి ఏ మార్పయినా, ఉద్యమమైనా, పద్ధతయినా ఆకాశం నుంచి వూడిపడదు. దానికో భౌతిక వాస్తవికత వుంటుంది. 'అవసరం' అనేది ఎప్పటికప్పుడు నూతన సృష్టికి మానవుల్ని పురికొల్పుతుంది. ముఖ్యంగా చేపలచెరువులు ఆవిర్భవించటానికి కొల్లేరు సరస్సు కారణం. దాని చుట్టుపక్కల పొలాలన్నీ ముంపునకు గురవుతుంటాయి. అక్కడ వరి పండించటమనేది జూదమే. అలాంటి పరిస్థితులలో 'చేపల చెరువులు' అవతరించాయి. అంతకు ముందు కాలవలు, నదుల్లో 'సీడ్' ఉత్పత్తి జరిగేది. అది సహజంగా జరిగే పరిణామం. జనాభా పెరిగాక నదుల్లో ఉత్పత్తి అవుతున్న చేపలు సరిపోకపోవడంతో కృత్రిమంగా 'సీడ్' తయారుచేసే ప్రక్రియను



మనిషి కనుక్కున్నాడు. ఆ రకంగా 'నీలివిప్లవం' మొదలయింది.

**మూడు ప్రధాన భాగాలు**

నేను నవలను మూడు ప్రధాన భాగాలుగా విభజించుకున్నాను. మొదటిది చెరువుల తవ్వకం. అందులో చేప పిల్లల్ని ప్రవేశపెట్టటం, వాటిని పెంచటం- పెరిగాక వాటిని ఎగుమతి చేయటం- ఆ చేపలు విని యోగదారుల చెంతకు చేరటం. ఇదొక విభాగం. రెండో విభాగంలో చేపల పెంపకంవల్ల వచ్చే ఆదాయం ఎలా డిస్ట్రిబ్యూట్ అవుతోంది, దాని పరిణామాలు ఏమిటనేది.. ఇక మూడో భాగంలో చేపల చెరువులవల్ల పర్యావరణంలో కుటుంబ జీవితంలో, సామాజిక జీవితంలో వస్తున్న మార్పులు. ఇవన్నీ తొంభైఆరు పేజీల్లో చెప్పాలి. ముఖ్యంగా ఇలాంటి నవలను రాయటం కన్నా మధ్యతరగతి పాఠకుడితో చదివించడం మరీ కష్టం. ఎంత గొప్ప రచనయినా తను ఉద్దేశించే పాఠకులకు చేరనప్పుడు వృథా ప్రయాసే. అసలు 'డ్రై' సబ్జెక్టులు ఎంచుకుంటావేమిటి? ' అని నన్ను చాలా మంది అడుగుతుంటారు. 'సీరియస్' సబ్జె

ష్టులు వారి దృష్టిలో 'డ్రై'గా అనిపిస్తాయి. గురుతుల్యులు చలసాని ప్రసాదరావు 'చదివించే చెత్త'ని విమర్శిస్తూనే- మనం ఎంత గంభీరమైన సమస్యను ఎన్నుకున్నా 'చదివించే గుణం' లేకపోతే రచయితగా మనం విఫలమైనట్లే అంటూ హెచ్చరించేవారు. అందుకే ఈ రచనలో 'చదివించే గుణం' కూడా వుండాలి. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకుని నవల రాయటానికి పూనుకున్నాను.

కుమార్ చేపలకు చెందిన ఒక్కో విషయం చెబుతున్నప్పుడు నేను ఆశ్చర్యానికి లోనయ్యాను. మానవుడు సాధించిన అద్భుత సాంకేతిక ప్రగతికి అచ్చెరువొందుతూనే, మరోపక్క భయపడిన సందర్భాలున్నాయి. ఉదాహరణకు ఒక చేప సామర్థ్యం లక్ష పిల్లల్ని ఉత్పత్తి చేయగలదనుకుంటే 'ఓవోప్రిమ్' ఇంజక్షన్ చేస్తే లక్షపిల్లల్ని అది పెడుతుంది. చేపల చెరువు మధ్యలో కర్రలు పాతి వాటికి గోతాలు కడతారు. వాటిలో మేత వుంటుంది. చేపలు వచ్చి ఆ మేత తింటాయి. పంటపొలంలో కలుపుమొక్కల్లా చేపల చెరువులో 'వీడ్‌ఫిష్' కూడా వుంటుంది. దానికి ముళ్లు వుంటాయి. దాన్ని 'గొరస' చేప అంటారు. నెలకోసారి అది గుడ్లు పెడుతుంది. వాటిని నోట్లోనే పొదిగి పిల్లలయ్యాక నీటిలోకి వదులుతుంది మగగొరస. ఈ చేపలకు విలువ లేదు. అయినా ఇవి ఆహారంకోసం గోతాల వద్దకు చేరుకుంటాయి. ధర వుండే చేపలు ఆహారం కోసం వచ్చినప్పుడు వీటి ముళ్లు గుచ్చుకుంటాయి. అంచేత మంచి చేపలు ఆవైపు రావు. రైతు ఇది గమనించకపోతే రోజూ ఆహారం ఖర్చవుతుంది. చేప పెరగదు. అంచే 'వీడ్ ఫిష్' ఆహారంతోపాటు రైతునూ తినేస్తుందన్నమాట. అందుకోసం ఇంకోమందు వచ్చింది. అది వాడితే ఏ చేపా గుడ్లు పెట్టదు. అంటే మనిషి కృత్రిమ సంపర్కంతో లక్షలాది గుడ్లు పెట్టించగలడు. అవసరం లేదనుకుంటే గొడ్రాళ్లను చేయగలడు. ఇది తెలుసుకున్నాక నా శరీరం జలదరించింది. ఈ చేపలన్నీ హౌరా వెళ్తాయి. ప్రధాన మార్కెట్ కేంద్రం అదే. అక్కడ చేపలు బాగా తింటారు. అది వారి సంప్రదాయంలో భాగం. మొదట్లో విపరీతమైన లాభాలు వుండేవి. దాంతో వరి పండించే భూముల్ని సైతం చేపల చెరువులుగా మార్చారు. దళారీ వ్యవస్థ మొదలయింది. ట్రాన్స్‌పోర్ట్‌లోనూ మార్పులు వచ్చాయి. చేప ఆంధ్రలో రవాణా అయ్యాక హౌరా మార్కెట్‌లో ఆ రోజున్న పరిస్థితిలో ఏ రేటు పలుకుతుందో తెలియదు. 'దాణా' రేట్లు పెరిగాయి. రవాణా పెరిగింది. ఉత్పత్తి పెరిగింది. ధర తగ్గిపోయింది. దానికితోడు పరిసరాలు కలుషితం అయ్యాయి. మంచినీరు కొనాల్సి వచ్చింది. మొదట్లో ఇబ్బడిముబ్బడిగా వచ్చిన డబ్బును ఏం చేయాలో అర్థంకాని స్థితి. విలాసాలు పెరిగాయి. అవి చూసిన ప్రజల్లో ద్వేషం రగిలింది.



కథానాయకుడు చేపలచెరువుల మోజులో కొట్టుకుపోతుంటే కథానాయిక 'షేర్‌మార్కెట్' ప్రభావంలో పడింది. కొడుకును రెసిడెన్షియల్ కాలేజ్‌లో చేర్చారు. వాడు ప్రేమకోసం తపిస్తున్నాడు. ఇంటికి వచ్చిన అమ్మానాన్నల్ని పట్టించుకునే స్థితిలేదు. ఈ పరిణామాలకు తోడు కథానాయకుడు నైతిక విలువలు కోల్పోతాడు. ఈ డబ్బు అన్ని రంగాలకూ పాకుతుంది. ముఖ్యంగా సినిమా, వ్యభిచారం, మద్యపానం ఈ విధంగా నీలివిప్లవం సమాజంలోని అన్నివర్గాలనూ ఏదో ఒక మేరకు కలుషితం చేయటం మొదలుపెట్టింది. చివరకు భార్యాభర్తల మధ్య వైరుధ్యాలు పెరిగిపోయాయి. అలాంటి స్థితిలో ఈడ్చికొట్టిన నష్టాల వెల్లువ తిరిగి మనుషుల్ని భూమ్మీదకి దించింది. అప్పటికే చేతులు కాలాయి. వెనక్కి తిరిగి చూసుకుంటే గత జీవితమే హాయిగా వుందనిపించింది. ఈ పరిణామాలన్నింటినీ ఈ నవల

రేఖామాత్రంగా చిత్రిస్తుంది. నిజానికి రెండు వందల నుండి మూడు వందల పేజీలు రాయవలసిన నవల స్థలాభావం వల్ల కుదించుకు చెప్పాలి. కొంత డాక్యుమెంటేషన్ వుంటుంది. ఈ నవల రాశాక ఇంకా చాలా మార్పులు వచ్చాయి. తర్వాత కొందరు చేపల చెరువుల్ని మామూలు పొలాలుగా మార్చుకున్నారు. అప్పటికే 'రొయ్యలు' పెంచటం మొదలయింది. 'ప్రాన్' కల్చర్ వేరు. అవి ఉప్పునీటి కయ్యల్లో పెంచాలి. ఆ తర్వాత అదో ప్రభంజనం. అందరూ మళ్లీ అటు పరుగులు తీశారు. దృశ్యం మారింది. ఫలితాలు అవే. మొదట్లో విపరీతమైన లాభాలు. పోటీ పెరిగినకొద్దీ దళారులు పెరిగిన కొద్దీ రైతు నాశనం అయ్యాడు.



ఈ నవల చదివి చాలామంది నన్ను మీరు రైతులా అని అడిగారు. కొంతమందికి చేపలకూ- రొయ్యలకూ తేడా తెలియకుండా మాట్లాడారు. ఈ నవల చదివాక మరికొన్ని నవలలు వచ్చాయి. 'ఆక్రందన' లాంటి నవల నాకు ప్రేరణయితే 'గట్టుమీద చేప' నవల ఇంకొందరికి ప్రేరణ అయింది. ఈ నవల ఎంత పేరు తెచ్చుకుందో అంత వివాదానికి గురయింది. దానికి కారణం ముగింపు.

ఈ నవలలో నాయకుడు తన చేపల చెరువులు అమ్మేసి ఓ పదెకరాల కొబ్బరి తోట కొనుక్కుంటాడు. అందులో చిన్న పర్ణ శాల లాంటి ఇల్లు నిర్మించుకుంటాడు. ప్రపంచంలో వున్న మంచి సినిమాలు చూస్తూ సంగీతం వింటూ ప్రశాంతంగా కాలం గడుపుతుంటాడు.

'ఈ జీవితం ఇలావుంటే చాలు. ఇంకే గాలికీ నేను కొట్టుకుపోకూడదు' అనుకుంటాడు.

'తనయితే అలా అనుకుంటాడు గానీ అది ఎంతవరకో అని అనుమానం వసుంధరకి!' అనే వాక్యంతో నవల ముగుస్తుంది. కూన పరాజు కుమార్ ఇప్పుడు అమెరికాలో ఉన్నాడు. ఇంకా చేపల చెరువులున్నాయి. చిన్నచిన్న వాళ్లందరూ దెబ్బతిన్నారు. పెద్ద రైతులు ఇంకా స్ట్రగుల్ అవుతున్నారు. ముగింపుని కొంతమంది వామపక్షవాదులు అంగీకరించలేదు. ఇంకొందరు ఈ నవలని తమ ఉపన్యాసాల్లో విశ్లేషించారు. తుపాన్ వచ్చేముందు సముద్రం ప్రశాంతంగా వుంటుంది. ఒకానొక విధ్వంసం తర్వాత కూడా ఓ శూన్యం గోచరిస్తుంది. చాలా తక్కువ కాలమే. మళ్లీ ఇంకేదో ఉద్యమమో, విప్లవమో- విధానమో వెలుగుచూస్తుంది. మనుషులు మళ్లీ అటు పరుగులు తీసుకుంటూ వెళ్తారు కొందరు శలభాలవుతారు. ఈనాటి రైతుల ఆత్మహత్యలు చూసినప్పుడు నాకు ఒకటే అనిపిస్తుంది. వీళ్లు ఎందుకిలా చేస్తున్నారు? ఉద్యమాలు చేసి అందులో చనిపోవచ్చుగా అని. అలాగే లొంగిపోయే తీవ్రవాదుల్లో 'ప్రశాంత' జీవితాన్ని కోరుకుంటున్నామని చెప్పేవారున్నారు.

ఏదేమైనా కొండంత జీవితాన్ని చిన్నఅద్దంలో చూపే ప్రయత్నం 'గట్టుమీద చేప'. ఈ ప్రయత్నంలో నేను విజయం సాధించాననే అనుకుంటున్నాను.

సేకరణ: – సి.పి.

★

# నవలా పరిచయం

గాలి మార్పుకోసం ఆ ఊరికి వచ్చిన ఆమెకు చిన్ననాటి ప్రియనేస్తం కనిపించి ఆహ్వానించాడు. ఆతిథ్యమిచ్చాడు. తన ప్రేమకోసం అతడు అవివాహితుడుగా మిగిలిపోయాడని విని ఉద్వేగానికి లోనవుతుందామె.

ప్రేమాభిమానాలకు, ఆనందాలకు నెలవైన కుటుంబంలో పుట్టి పెరిగిన తనకు, తన మేనబావకు, డాక్టరు గారబ్బాయిల మధ్య పెనవేసుకున్న ప్రగాఢ స్నేహానురాగాలు, బడిలో చేసిన అల్లరులు, ఆటలు మొదలైన బాల్యస్మృతుల నేపథ్యంతో మనసు గతంలోకి వెళ్ళిపోగా...

"ఎటో వెళ్ళిపోతోంది... మనసు"

శీర్షికతో ఓ నవల రాసి అతడికి అంకితమిస్తుంది.

ఆ తరువాతే ఓ సంఘటన జరుగుతుంది!

అచ్చమైన తెలుగుదనం తొణికిసలాడే పాత్రలు, సంభాషణలు, సన్నివేశాలతో ఒకప్పటి బాంధవ్యాలు, ఊహల్లో రెక్కలు తొడిగిన ప్రేమ, మౌనత్యాగం ముప్పేటగా అల్లిన

**రావినూతల సువర్నాకన్నన్** నవల **"ఎటో వెళ్ళిపోతోంది... మనసు'**' ఈ నెల 'చతుర' సమర్పణ.



సాయంత్రం నాలుగు గంటలైంది. డిసెంబర్ నెల. అదీ సాగర తీరం! చలి వణికించేస్తోంది. విశాలమైన ఆ బీచ్ సందడిగా ఉంది. అంత చలిలోనూ, శీతాకాలపు నీరెండ ఒంటిమీద పడి రవంత వెచ్చదనాన్ని అందిస్తోంది.

నీళ్ళకి కాస్త దూరంగా, ఓ కార్పెట్ మీద, ఎగసి పడుతున్న సముద్ర తరంగాలనీ, తీక్ష ణత కోల్పోయిన ఎర్రని సూర్యబింబాన్ని చూస్తూ కూర్చున్నాను.

ఆ తీరం అన్ని సముద్రతీరాల్లాలేదు. అక్కడక్కడ చిన్న చిన్న కొండలు, వాటి పక్కన రకరకాల చెట్లు, ఆ చెట్ల నిండా పూలు అదీ చూస్తుంటే ఎవరో ఓ మహాశిల్పి ఆ తీరాన్ని సుందర నందనంలా తీర్చి దిద్దాడనిపిస్తుంది.

తరంగాలు పోట్లగిత్తల్లా దూసుకొచ్చి, చెలి యలికట్టని తాకి వెనక్కి వెళ్ళి, తిరిగి రెట్టిం చిన వేగంతో తీరం దాటాలని ప్రయత్నిస్తు న్నాయి. ఓ పక్కగా కొందరు చిన్నపిల్లలు పరుగులు పెడుతూ ఆడుకుంటున్నారు. మరోవైపు ఎవరో స్కూల్ పిల్లలు ఎక్స్‌కర్ష న్‌కొచ్చినట్టున్నారు. 'ఆనందమంతా మాదే' అన్నట్టు కేరింతలు కొడుతూ నీళ్ళవైపు దూసుకెళ్తుంటే, టీచర్లు వాళ్ళని అదుపులో పెట్టాలని ప్రయత్నించి ఫలించక, వాళ్ళతో పాటు తామూ పరిగెడుతున్నారు.

కాస్త పక్కగా వున్న ఓ రాయిమీద నలు గురైదుగురు కాలేజీకుర్రాళ్ళనుకుంటాను. ఓరగా నాకేసి చూస్తూ, నేను చూడగానే చూపులు మరల్చుకుంటున్నారు.

నాకు నవ్వొచ్చింది. అయినా నవ్వలేదు. ఆ పరిసరాలని చూడడమే నా ధ్యేయం అన్నట్టు చూస్తూ తన్మయావస్థలో పడిపో యాను.

హఠాత్తుగా ఓ దృశ్యం నన్ను మరింత ఆకర్షించింది. నీళ్ళకి కాస్త చేరువగా నలుగు రైదుగురు పిల్లలు తడి ఇసుకతో ఉత్సా హంగా రకరకాల గూళ్ళు కడుతున్నారు. తరంగాలు వాటిని కూల్చేస్తుంటే, కోపంగా తన్నేసి, మళ్ళీ కట్టే ప్రయత్నాలు చేస్తు న్నారు.

పర్వదినాల్లో సముద్ర స్నానాలకెళ్ళిన ప్పుడు నేనూ, నా ఫ్రెండూ ఇలాగే రకరకాల గూళ్ళు కట్టడం, అదిచూసి మురిసిపోతుంటే సముద్రుడు వాటిని కూల్చేయడం, మేం కోపంతో చిందులు వెయ్యడం గుర్తొచ్చి మన సంతా ఆనందంతో నిండిపోయింది.

అసలు నాకు చిన్నతనం నించీ నీళ్ళన్నా, నదులన్నా, అడవులన్నా చాలా ఇష్టం. పూలమొక్కలంటే ప్రాణం. అందుకే ఇప్పుడీ పరిసరాలు చూడగానే వాళ్ళలా నేనూ ఓ చిన్నపిల్లనైపోయి తడి ఇసుకతో రకరకాల కట్టడాలు కట్టాలనీ, తీరంవెంట పరుగులు తీస్తూ గవ్వలు, శంఖాలూ అవీ ఏరుకోవా లనీ ఎంతగానో అనిపించింది. అయినా ఆ ప్రయత్నం చెయ్యలేదు. గూళ్ళు కట్టాలని ప్రయత్నించే వాళ్ళకేసే చూస్తూ కూర్చు న్నాను. కాస్సేపటికి వాళ్ళలో వాళ్ళకి ఏదో గొడవొచ్చినట్టుంది. ఓ పిల్ల గూళ్ళన్నీ కాళ్ళతో తన్నేసింది. మిగతా పిల్లలు ఏడుపు మొదలుపెట్టారు. నేను కంగారుగా పరిస రాలు చూశాను. వాళ్ళ వాళ్ళ పేరెంట్స్ వస్తారేమో అని. అయితే ఎవరూ రాలేదు. వాళ్ళు కొట్టుకునే స్థితికొచ్చేసరికి, కప్పుకున్న షాల్ పక్కనపడేసి వాళ్ళదగ్గరికి నడిచాను.

నన్ను చూసి క్షణం బిత్తరపోయి, మళ్ళీ తగవుకి దిగారు. నేనే చనువుగా వాళ్ళకి నచ్చచెప్పి-

"మీకు గూళ్ళు కావాలి. అంతేగా! నేను కట్టిస్తాను చూడండి" అన్నాను నవ్వుతూ.

"మీరా!" అప్రయత్నంగా అంది ఓ పాప.

నేను నవ్వాను.

"ఏం! నేను మీలా చిన్నపిల్లని కాదనా! కానీ మీ వయసులో నేనూ ఎన్నోరకాల గూళ్ళు, ఇళ్ళు కట్టాను. చూడండి." అని కింద చతికిలబడి రెండు పాదాలనూ ఇసు కలో దూర్చి తడి ఇసుకతో చక్కని గుడి,

దానిప్రహరీ, ముందు ధ్వజస్థంభం లాంటి వన్నీ కట్టాను. దాని పక్కగా చర్చ్ మసీదు లాంటివి నిర్మించాను.

పిల్లల కళ్ళలో ఆనందమే కాదు. విస్మయంకూడా చోటుచేసుకుంది. ఆనందంగా చప్పట్లు కొట్టారు.

మా చర్య గమనిస్తున్న కాలేజీ కుర్రాళ్ళు ముందు బిత్తరపోయి తర్వాత కుతూహలంగా వచ్చి కళాత్మకంగా వున్న ఆ ఇసుక కట్టడాలని చూసి నన్ను అభినందించారు. వాళ్ళే అనేమిటి అక్కడ చాలామంది నన్ను ఆకాశానికెత్తేశారు.

నేను రవంత సిగ్గుపడుతూ..

"ఇవేం గొప్పకట్టడాలు? జస్ట్ ఇసుక గూళ్ళు. ఇవి ప్రతిపిల్లలూ చేసేవే" అని కాళ్ళు చేతులూ కడుక్కుని మళ్ళీ నా స్థానంలో కొచ్చి కూర్చున్నాను. చాలామంది నాకేసి చూస్తూ ఏదో గుసగుసలాడుకుంటున్నారని నాకు తెలుసు. అయినా నేను పట్టించుకోలేదు. నాకు ఆరు, ఏడేళ్ళప్పుడు ఈ ఇసుకగూళ్ళ విషయంలోనే నేనూ, కిరీటి పెద్ద గొడవపడటం గుర్తొచ్చి నవ్వుకున్నాను.

నిజంగా ఆరోజులు ఎంత మధురమైనవి! కల్లాకపటం, ఈర్ష్య ద్వేషం, తన పర లాంటి భేదాలేమీ తెలియవు!. కొట్టుకున్నా, తిట్టుకున్నా క్షణాల్లో అన్నీ మర్చిపోయి చక్కగా కలిసిపోయే వాళ్ళం.

గతాన్ని తల్చుకుంటే మనసంతా భారంగా అయిపోయింది. ఓ సారి కిరీటి వస్తున్నాడేమో అని చూసి, ఓ చెట్టుకి చేరగిలబడి కళ్ళుమూసుకున్నాను.

మనసులో ఎన్నో ఆలోచనలు, మరెన్నో అనుమానాలు, ఇంకెన్నో సంఘర్షణలు!

నేనీ ఆలోచనల్లో వుండగానే వెనకనించి వచ్చి రెండు చేతులు నాకళ్ళని సున్నితంగా మూశాయి.

నేను తుళ్ళిపడి కళ్ళుమూసిన చేతుల్ని తియ్యబోయాను. సాధ్యంకాలేదు.

"ఈ ప్రదేశంలో నా కళ్ళు మూసేంత చనువు ఎవరికుంటుందబ్బా!" అనుకుంటూ చేతుల్ని తడిమాను.

ఊహూ! కిరీటి చేతులు కాదు. మరి?

"ఎవరు? " అన్నాను మెల్లగా

"చెప్పుకో చూద్దాం!" గుసగుసగా అంది ఓ మగగొంతు.

నేను తుళ్ళిపడ్డాను.

"ఎవరు? " అన్నాను కాస్త బిగ్గరగా.

"మున్నీ!" మృదువుగా అందాగొంతు నా చెవిలో

అంతే! నా ఒళ్ళు ఝల్లుమంది.

"మున్నీ! మున్నీ! ఎక్కువగా నన్నా పేరుతో పిల్చేది ఒకేఒక వ్యక్తి... అతను... మృత్యుంజయ!

"జయా!" అన్నాను ఆనందంగా

అతను కళ్ళమీంచి చేతులు తీసేసి, నా పక్కగా చతికిల పడుతూ...

"హమ్మయ్య! ఇప్పటికైనా గుర్తుపట్టావ్! థ్యాంక్స్!" అన్నాడు.

"అవును! మృత్యుంజయే! ఇక్కడ! ఈ సమయంలో జయ! ... వాట్ ఎ సర్ప్రైజ్!" అతని కళ్ళలోకి చూస్తూ కలలో అన్నట్టు అన్నాను.

అతను ఎప్పటిలా మధురంగా నవ్వాడు.

"ఏమిటలా చూస్తున్నావ్!" అన్నాడు నాక్కాస్త మరింత దగ్గరికి జరుగుతూ.

"జయా!... ఇక్కడ! నువ్వు... అసలు నేనిక్కడున్నానని నీకెలా తెలిసింది? " అన్నాను ఉత్సాహంగా.

అతన్ని చూడగానే నాలో ఉత్సాహం కట్టలు తెంచుకుంది.

"కిరీటి చెప్పాడు!"

"వాట్! కిరీటి కనిపించాడా? తన్ని నువ్వు గుర్తుపట్టావా!"

"ఏమిటా పిచ్చిప్రశ్న? ... కిరీటిని నేను గుర్తుపట్టకపోవడమా, అవునూ... ఇప్పుడు అయిస్క్రీమేమిటి? ఇంకా నీకీ అయిస్క్రీమ్ పిచ్చిపోలేదా!" నవ్వుతూనే అన్నాడు జయ.

"ఎందుకుపోవాలి! పసిపిల్ల దగ్గర్నించీ

నాకు అయిస్క్రీమ్ అంటే ఇష్టం. ఇప్పుడూ ఇష్టమే. ఇంక ముందూ తింటాను..." దబాయింపుగా అన్నాను.

"నువ్వేం మారలేదుమున్నీ!" ప్రేమగా నాకళ్ళల్లోకి చూస్తూ అన్నాడతను.

"నువ్వు మాత్రం మారావేంటి? అదే నవ్వు, అదే సరళమైన మాటలు. ఎన్నాళ్ళయింది జయా! నిన్ను చూసి!" అతని చేతుల్ని నా చేతుల్లోకి తీసుకుంటూ అన్నాను.

"ఎన్నాళ్ళుకాదు. ఎన్నేళ్ళు! అను!" భారంగా అన్నాడు మృత్యుంజయ.

"నిజమే జయా! ఈ జీవనపోరాటంలో గతం ఓ మధురస్మృతిగా మిగిలిపోతుందే తప్ప మళ్ళీ దగ్గరకి చేరదు!" అన్నాను బాధగా.

జయ మొహం గంభీరంగా అయిపోయింది.

"నువ్వు మారలేదనుకున్నాను. నీలో చాలా మార్పొచ్చింది" అన్నాడు గంభీరంగా.

"నాలో మార్పొచ్చిందా? " విస్మయంగా అన్నాను.

"అవును. నువ్వు నాచిన్ననాటి నేస్తానివి కాదుగా ఇప్పుడో మహారచయిత్రివి! అందుకే నేన్నీకు పరాయివాడిగా కనిపిస్తున్నాను!" నిష్ఠూరంగా అన్నాడతను.

నేను దెబ్బతిన్నట్టు చూశాను.

"నేను రచయిత్రినన్నమాట ఒకోసారి నేనే మర్చిపోతుంటాను. అలాంటిది నా ప్రియ నేస్తం దగ్గర నేను దర్పం చూపిస్తానా!" అన్నాను బాధగా.

"అయితే ఒకటి చెప్పు! నన్నేమని పిల్చేదానివి? "

"ఏమని... అంటే... ఆc 'మృత్యూ' అని పిల్చేదాన్ని!"

"మరిప్పుడు జయా, మృత్యుంజయా అంటూ అతి మర్యాదగా పిలుస్తున్నావ్..." పసివాడిలా అన్నాడు జయ.

నేను పకపక నవ్వేశాను.

"అదా నీ అలక? ... చూడు జయా! నువ్వో పెద్ద కార్డియాలజిస్టవని నాకు తెలుసు. హృదయాలతో అవలీలగా ఆడుకుంటున్నావనీ తెలుసు. మరి అలాంటి వాణ్ని 'మృత్యూ!' అని పిలిస్తే బావుంటుందా? " అన్నాను నవ్వుతూనే.

"నువ్వు స్వదేశంలోనే కాక విదేశాల్లో కూడా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న మహా రచయిత్రివి. మరి నేనూ నిన్ను యమునా అని పిలవనా? "

"ఒద్దు మహాప్రభో! నిన్ను నేను ఎప్పటిలా మృత్యూ అనే పిలుస్తాను. నువ్వూ నన్ను మున్నీ అనే పిలు!..." అన్నాను ఆనందంగా.

జయ తల్లిదండ్రులకి పుట్టిన పిల్లలు బతక్కపోవడంతో అతనికి మృత్యుంజయుడు అని పేరుపెట్టారట. అందరూ అతన్ని జయా అనో, బాబూ అనో పిలుస్తారు. నేను మాత్రం మృత్యూ అనే పిల్చేదాన్ని. మొదట్లో ఉడుక్కునేవాడు. తర్వాత తర్వాత అలవాటు పడిపోయాడు. నా పేరు యమున. అయితే తను మాత్రమే నన్ను మున్నీ అని పిలుస్తాడు. అఫ్‌కోర్స్! తర్వాత ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం కిరీటి కోసం ఎదురుచూస్తూ.

"ఈ ప్రదేశం నీకు నచ్చిందా మున్నీ? " అన్నాడు జయ ఆప్యాయంగా.

"చాలా నచ్చింది. అసలీ ప్రదేశం ఇంత సుందరంగా ఉంటుందని నేను ఊహించనే లేదు. నిజంగా ఇలాంటి చోటికి తీసుకొచ్చి నందుకు కిరీటికి థ్యాంక్స్ చెప్పాలి!" అన్నాను మనస్ఫూర్తిగా.

"నిజంగా అంతబాగుందా? "

"నిజం! అసలు జీవితాంతం ఇక్కడే ఉండిపోవాలనుంది!" తన్మయత్వంగా అన్నాను.

"ఆ అవకాశాన్ని నువ్వే జారవిడుచుకున్నావ్"

"నేనా? "

"అవును. ఆనాడు నేనడిగిన వెంటనే నన్ను పెళ్ళిచేసుకున్నావనుకో. అప్పుడు ఎంచక్కా ఇక్కడే వుండేదానివిగా" అల్లరిగా అన్నాడు జయ.

నేను మళ్ళీ గల గల నవ్వేశాను.

"నిజమే! నేను పొరపాటే చేశాను. అవునూ... నిన్ను పెళ్ళి చేసుకోడానికీ, ఇక్కడుండడానికీ సంబంధం ఏమిటి? " అన్నాను కుతూహలంగా.

"అదిగో అలా దూరంగా చూడు!" అంటూ ఓ వైపుకి చూపించాడు జయ. అక్కడ కొన్ని భవంతులు కనిపించాయి.

"ఏమిటి? "అన్నట్టు చూశాను.

"వాటిల్లో... అదిగో ఆ గ్రీన్ కలర్ బంగళా నా గెస్ట్‌హౌస్, దానికి కాస్త అవతలగా వుంది చూశావా అది హాస్పిటల్ ప్లస్ ఇల్లు!" నవ్వుతూ అన్నాడు జయ.

నేను విస్మయంగా చూశాను.

"రియల్లీ? నువ్వు డాక్టర్‌గా ఎక్కడో వున్నావని తెలుసు. కానీ ఇంత సుందర ప్రదేశంలో వున్నావని తెలియదు. తెలిస్తేనా? " ఆనందంగా అన్నాను.

"తెలిస్తే ఏం చేసేదానివి? " కవ్వింపుగా అన్నాడు జయ.

"ఏంచేసేదాన్నా! సరాసరి వచ్చి నీ ఇంట్లో తిష్టవేసేదాన్ని!"

"ఇప్పుడదే చెయ్యబోయేది!"

"అంటే? "

"అంటే నువ్వు, కిరీటి హోటల్‌రూమ్ ఖాళీచేసి మా గెస్ట్‌హౌస్‌కి రావాలి!"

"అలాగే!" నవ్వాను.

"నేను సీరియస్‌గా చెబుతున్నాను అయినా నీకు చెప్పేదేమిటి. నేనే లాక్కెళ్తాను!" దబాయింపుగా అన్నాడు జయ.

అతని ఆప్యాయతకి నామనసు పొంగిపోయింది. అయితే వెంటనే వాడిపోయినట్టయింది.

"ఏమిటి , ఎన్నీ అలా అయిపోయావ్? " అన్నాడు జయ నా భుజం తడుతూ. నాతల మరింత వంగిపోయింది.

"సారీ జయా!"

"సారీనా? అంటే నా ఇంటికి రావా? "

"అదికాదు"

"మరి? "

"అదే... అత్తయ్య, మామయ్యా, యాక్సిడెంట్‌లో..." గొణిగినట్టు అన్నాను జయ మొహంలో నీలినీడలు చోటుచేసుకున్నాయి.

"అవునుమున్నీ! భగవంతుడు నామీద ఆ రూపంలో పెద్దపిడుగేవేశాడు. అల్లారుముద్దుగా పెంచిన నన్ను కన్న నావాళ్ళు ఇద్దరూ ఒకేసారి నెత్తురుమడుగులో శవాలుగా మారేసరికి తట్టుకోలేకపోయాను. పిచ్చాడిలా అయిపోయాను. నువ్వూ, కిరీటీ దగ్గరుంటే ఎంత బావుండు అనుకునేవాణ్ని. కానీ మన పల్లెకొచ్చి నేను, అమ్మా నాన్నలు మెసలిన ఆ ఇంటిని చూడాలంటేనే వెన్నులోంచి ఒణుకొచ్చేది. అసలు పిచ్చివాడినై మెంటల్ హాస్పిటల్‌కెళ్తానేమో అనుకున్నారంతా. నేను మనిషినౌతానన్న నమ్మకం నాకే వుండేదికాదు!" అన్నాడు బాధగా.

"నిజమే! నీకు తగిలిన దెబ్బ చిన్నదేం కాదు. యాక్సిడెంట్ విషయం విని ఎంత ఏడ్చానో, కిరీటి తను ఏడుస్తూనే నన్ను ఓదార్చేవాడు. అయినా ఓ మాటంటాను కోపం తెచ్చుకోవుగా? " అన్నాను అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"నాకు కోపమా? అదీ నీమీదా? నెవ్వర్!" బలవంతంగా నవ్వాడు జయ.

"అడ్రస్ లేక నిన్ను కాంటాక్ట్ చెయ్యలేకపోయాం సరే. అమ్మా వాళ్ళ ఎడ్రస్ నీకు తెలుసుగా. నువ్వెందుకు లెటర్ రాసి పడెయ్యలేదు? "

"ఆ బాధలో మీరు గుర్తొచ్చారేగానీ లెటర్ రాయాలని తోచలేదు!"

"మరి నీ పెళ్ళికి ఇన్విటేషన్ ఎందుకు పంపలేదు? "

"... "

"అదీ మర్చిపోయావా? మునసబుగారికి,

మరి కొందరికి నీ పెళ్ళి శుభలేఖలు వచ్చాయట. మాకే రాలేదు. ఎవరో చెప్తేగానీ నీకు వైదేహితో పెళ్ళయిందన్న సంగతి గానీ, నువ్వు విదేశాలకెళ్ళావనిగానీ తెలియదు. నేనైతే మునసబుగారు వాళ్ళు గొప్ప కోసం అలా చెప్పారనీ, అసలు వాళ్ళకీ ఇన్విటేషన్ వచ్చుండదనీ అన్నాను! కానీ నాకు మాత్రం బాధగానే వుంది. చెప్పు! మాకెందుకు పెళ్ళిగురించి చెప్పలేదు? " అన్నాను నిలదీసినట్టు.

కిరీటి జవాబు చెప్పలేనట్టు బుర్రగోక్కున్నాడు.

"సారీ! నువ్వేదో బాధగా చెప్పుకోవాలని చూస్తే నేనింకా బాధపెడుతున్నాను! చెప్పు!..." అన్నాను అనునయంగా.

"చెప్పడానికేంమిగిలింది మున్నీ!" శూన్యంలోకి చూస్తూ అన్నాడతను. అతనలా వుండడం నాకు చాలా బాధ కలిగించింది. అసలు జయకి నవ్వడం తప్ప మొహం మాడ్చుకోవడం నాకు తెలియదు.

"అలా మాట్లాడకు మృత్యూ! అనవసరంగా అత్తయ్యావాళ్ళ సంగతి ఎత్తి మానిపోతున్న నీ గాయాన్ని నేనే రేపాను. ఏమైనా ఇప్పుడు తేరుకున్నావ్! మంచి డాక్టర్‌గా పేరు, డబ్బు సంపాదించావ్. ఇక దిగులెందుకు? " అన్నాను అతని చేతుల్ని నాచేతుల్లోకి తీసుకుంటూ

"ఛ!ఛ! ఇందులో నీ తప్పేంవుంది మున్నీ, అమ్మావాళ్ళ గురించి అడక్కపోతేనే బాధపడేవాణ్ని. కానీ మున్నీ! ఆ టైమ్‌లో నేనో బైరాగిని అయిపోతానేమో అన్న అనుమానం కూడా కలిగింది. కానీ పాపం మా మామయ్య, మావైదేహి నన్ను కంటికి రెప్పలా చూసుకుంటూ మళ్ళీ మనిషిని చేశారు!" అన్నాడు కంపిస్తున్న గొంతుతో.

"నిజమే మృత్యూ! ప్రాణస్నేహితులమై వుండి కూడా నీకు నాలుగు ఓదార్పు మాటలు చెప్పలేకపోయాం. అందుకు సిగ్గుపడుతున్నాను కూడా!" నా కళ్ళలోనీళ్ళు తిరిగాయి.

"ఏయ్! ఏవిటిది? నేనేదో అమ్మావాళ్ళు గుర్తొచ్చి కాస్త అప్‌సెట్ అయితే నువ్వు పూర్తిగా అప్‌సెట్ అయిపోయావే" అంటూ తన కర్‌చీఫ్‌తో నాకళ్ళు వత్తాడు. అతని నవ్వు చూశాక నా మనసు కాస్త కుదటపడింది.

"నీ అడ్రస్ కోసం చాలా ప్రయత్నించాం మృత్యూ! కానీ దొరకలేదు. దొరికితే కనీసం మనమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలైనా నడిచేవి" అన్నాను బాధగా.

"ఇప్పుడింక ఆ గొడవలు వదిలెయ్యి!" అన్నాడు జయ. నాకు మళ్ళీ ఎక్కళ్ళేని ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఆ ఉత్సాహాన్ని కిరీటితో కలిసి పంచుకోవాలని మహా ఆరాటంగా వుంది. ఇంకా రాని కిరీటిమీద చిరాక్కలిగింది కూడా.

"అయినా ఐస్‌క్రీమ్ తెస్తానని వెళ్ళినవాడు దేశం వదిలిపోయినట్టు ఇంతసేపు చేశాడేమిటి" అన్నాను విసుగ్గా.

"లేదు మున్నీ! అక్కడెవరో తెలిసినవాళ్ళు కనిపిస్తే, వాళ్ళతో మాట్లాడి వస్తాననీ, ఈలోగా నీక్కంపెనీ ఇమ్మనీ చెప్పాడు. నువ్వేం కంగారు పడకు!" నవ్వుతూ అన్నాడు జయ.

"అదీ! అలా చెప్పు. నన్నొదిలి ఇంతసేపు ఉండడు. అందుకే ఆశ్చర్యపోయాను!" రవంత గర్వంగా అన్నాను.

జయ నవ్వాడు. అసలు జయ నవ్వడమేమిటి, అతని పెదవులు ఎప్పుడే నవ్వినట్టే వుంటాయి. ఎప్పుడూ అనుకున్నట్టే మళ్ళీ అనుకున్నాను.

"ఏమిటి! నాకంపెనీ బాగాలేదా? " పసివాడు అలిగి అడిగినట్టు అన్నాడు జయ. ఈసారి నేను పకపక నవ్వేశాను. నా మొహంలోకి ఆనందంగా చూస్తుండిపోయాడు జయ.

**నేను మారితే ప్రపంచం మారుతుందా అనేది తప్పు. నిజంగా మారి చూడు నీకే తెలుస్తుంది - కన్ ఫ్యూసియస్**

చలిగాలి పెరుగుతోంది. పక్కనే వున్న షాల్ తీసి నాకు నిండుగా కప్పాడు.

మరి కాస్సేపటికి కిరీటి వచ్చాడు.

అతని చేతుల్లో మూడు అయిస్‌క్రీమ్స్!

నాకు చాకొబార్ అంటే ఇష్టం. అందుకే దానికోసం అంతదూరం వెళ్ళాడు కిరీటి.

"ఏంటి కిరీటీ! ఇంత సేపు చేశావ్, నీకోసం మున్నీ కలవరిస్తోంది" అన్నాడు జయ నవ్వుతూ. కిరీటి పధ్నాలుగు క్షమార్పణలు చెప్పుకుంటూ ఐస్‌క్రీమ్స్ మా కందించాడు.

నేనూ, జయ అది తింటూ చిన్ననాటి కబుర్లు చెప్పుకుంటుంటే చిరునవ్వుతో వింటున్నాడు కిరీటి. అప్పుడప్పుడూ మాట కలుపుతున్నాడు.

చలిగాలి రివ్వున తగిలి షాల్ అల్లంత దూరం వెళ్ళి పడింది. కిరీటి పరిగెత్తుకెళ్ళి దాన్ని తెచ్చి నాకు కప్పాడు.

"ఇక వెళ్దాం కిరీటీ, చాలా పొద్దుపోయింది!" అన్నాడు జయ వాచ్ చూసుకుంటూ.

"అవును! చలిగాలి కూడా ఎక్కువయింది" అంటూ పక్కగా పరిచిన జంపకానా, ఫ్లాస్క్ లాంటి వన్నీ పట్టుకుని కారుకేసి నడిచాడు కిరీటి. ఆ కారు మేం ఎంగేజ్ చేసుకున్న కారు.

కిరీటి ముందు నడుస్తుంటే నేను, జయ జతగా పక్కపక్కగా నడుస్తూ కారు దగ్గరికెళ్ళాం.

జయ టాక్సీ అతనితో ఏదోమాట్లాడి డబ్బిచ్చి పంపేశాడు.

"అదేమిటి? " అన్నాను విస్మయంగా చూస్తూ.

"చెప్పానుగా ఇప్పుడు మీరు గెస్ట్‌హౌస్‌కి రాబోతున్నారు. నేను ఆల్ రెడీ కిరీటికి చెప్పేశాను. నీ కిందాక చెప్పాను!" అన్నాడు జయ ఓ ఖరీదైన కారు డోర్‌తీసి పట్టుకుంటూ.

"అది సరే మృత్యూ! హోటల్లో..."

"మీ వస్తువులున్నాయి. అంతేగా. అదంతా నాకొదిలేసి ముందు కారెక్కు!" ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు జయ. నేను మౌనంగా ఎక్కి కూర్చున్నాను. తర్వాత కిరీటి, జయ కూడా ఎక్కారు. కారు సాగుతుంటే-

"ఏమిటి నువ్వే డ్రైవ్‌చేస్తున్నావ్! డ్రైవర్ లేడా? " అన్నాను.

"ఇష్టమైన చోటికి, ఇష్టమైన వాళ్ళతో వెళ్తే మధ్య డ్రైవరెందుకు? " నవ్వాడు జయ. నేనూ, కిరీటీ కూడా నవ్వాం. నాకెందుకో వెర్రి ఆనందంగా వుంది.

ఆ బీచ్‌రోడ్‌లో కారు మెల్లగా సాగిపోతుంటే ప్రియమైన నేస్తం తియ్యని కబుర్లు చెప్తుంటే, ప్రాణంలో ప్రాణం అయిన కిరీటి నా పక్కనుంటే ఇక ఆనందానికేంలోటు?

కానీ ఎంతో దూరం లేనందున ఎంత మెల్లగా వచ్చినా ఇట్టే వచ్చేసింది గెస్ట్‌హౌస్.

"మృత్యూ! నాకు కాస్సేపు అలా తిరగాలనుంది!" అన్నాను పసిపిల్లలా

"సరే! అలాగే వెళ్దాం." అంటూ కారు వేగం పెంచాడు జయ. నా మనసు గాల్లో తేలిపోతున్నట్టుంది. నా మొహంలోని ఆనందాన్ని చూసి ఆశ్చర్యపోయాడు కిరీటి.

"ఎలాగూ వచ్చాంకదా. రూమ్ ఖాళీచేసేద్దాం" అన్నాడు జయ. కిరీటి తలూపాడు.

అందరం కలిసి హోటల్ కెళ్ళాం.

"మున్నీ, నువ్విక్కడే కూర్చో మేం వెళ్ళొస్తాం" అంటూ కిరీటిని తీసుకుని హోటల్ లాంజ్ కేసి నడిచాడు జయ.

పది నిమిషాల్లో తిరిగొచ్చేశారు. సూట్‌కేసూ అవీ డిక్కీలో పెట్టిన బాయ్‌కి టిప్ ఇచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు జయ. నాలో ఉత్సాహం కట్టలు తెంచుకుంటోంది. అసలు నాలోని మార్పు నాకే విస్మయాన్ని కలిగించిందంటే అతిశయోక్తికాదు.

కావాలనే కారు మెల్లగా నడుపుతున్నాడు జయ.

"మున్నీ, చలిగావుందా? " రోడ్ కేసి చూస్తూనే అన్నాడు.

"లేదు. షాల్ కప్పుకున్నానుగా? " నవ్వాను.

మరి కాస్సేపటికి కారు గమ్యం చేరుకుంది. కారు వచ్చిన అలికిడి వినగానే, వాచ్‌మన్ కాబోలు పరిగెత్తుకొచ్చి డోర్ తీసి పట్టుకున్నాడు. దిగీ దిగ్గానే మా అందరికీ వినయంగా నమస్కరించాడు. ప్రతినమస్కారం చేసి-

"మృత్యూ! ఇతను..." అన్నాను జయకి మాత్రమే వినిపించేలా.

"ఆలిన్ఆల్!" నవ్వాడు జయ.

అర్థంకానట్టు చూశాను.

"చెప్తాను, ముందులోపలికి రండి" అంటూ లోపలికి దారితీశాడు జయ. తర్వాత సూట్‌కేస్ వగైరాలు తీసుకుని వచ్చిన వాచ్‌మన్ వాటిని ఓ పక్కగా పెట్టి చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

ఇతను రామయ్య. మన గెస్ట్‌హౌస్‌కి వాచ్‌మన్, ప్యూన్, కుక్ అన్నీ ఇతనే. అంతే కాదు. నాకు అత్యంత ఆత్మీయుడు. నన్ను కంటికిరెప్పలా చూసుకుంటాడు. అన్నాడు జయ అతన్ని పరిచయం చేస్తూ. రామయ్య సిగ్గుగా నవ్వాడు.

"లేదమ్మా! నన్నే ఆయన కంటికి రెప్పలా చూసుకుంటారు. మన డాక్టరుబాబుగారి లాంటి మనసున్నమనుషులు చాలా తక్కువమంది వుంటారమ్మా!" అన్నాడు కృతజ్ఞతా భావం నిండిన గొంతుతో. జయ నవ్వాడు.

"సరేలే: ఒకళ్ళని గురించి ఒకళ్ళం పొగుడుకున్నది చాలు. చూడు రామయ్యా! వీళ్ళిద్దరూ నాకు చాలా కావల్సిన వాళ్ళు. వీళ్ళు కొన్నాళ్ళపాటు ఇక్కడే వుంటారు. వీళ్ళిక్కడున్నంత కాలం ఎలాంటి లోపం రానీకుండా చూసే బాధ్యత నీదే!" అన్నాడు నవ్వుతూనే.

"మీరంతగా చెప్పాలాబాబూ! మీ మొహంలోని ఆనందాన్ని చూస్తుంటేనే అర్థమైపోయింది. వీళ్ళు మీకెంత ఆత్మీయులో? వీరి బాధ్యత నాకొదిలెయ్యండి!" అన్నాడు రామయ్య వినయంగా.

"మున్నీ ఓ సారి ఇల్లు, తోటా చూస్తావా" అన్నాడు జయ. నేను పరిసరాలు కుతూహలంగా పరికించడం గమనించి.

"చూద్దాం మృత్యూ!" అన్నాను ఉత్సాహంగా. జయ, రామయ్య కలిసి గెస్ట్‌హౌస్ అంతా తిప్పి చూపించారు.

ఆ గెస్ట్‌హౌస్‌ని, దానిచుట్టూ వున్న పూదోటని, లోపలి అలంకరణని చూస్తుంటే నాకు మతేపోయింది. దాని ముందు స్టార్‌హోటల్స్ ఎందుకూ పనికిరావనిపించింది. అంత రిచ్‌గానూ, కళాత్మకంగానూ వుంది. ముఖ్యంగా పై భాగం నన్ను మరింత ఆకర్షించింది.

వెనకవైపువున్న ఏ బాల్కనీలో నుంచి చూసినా నీలిసముద్రమూ, ఎగసిపడే సాగరకెరటాలూ స్పష్టంగా కనిపిస్తాయి. అది సముద్రహోరులా లేదు. మధురమైన సంగీతంలా అనిపించింది.

"అబ్బ! ఇది ఇండియానేనా! లేక విదేశాలకొచ్చామా లేక అదీగాక స్వర్గలోకమా?" అన్నాను తన్మయత్వంగా.

జయ హాయిగా నవ్వేశాడు.

"విదేశమూ కాదు. స్వర్గంకాదు. స్వర్గంలాంటి పొదరిల్లు!" అన్నాడు ఆనందంగా.

నిజంగా ఆ ఇల్లు, తోట చూశాక జయ మీద, అతని టేస్ట్‌మీదా మరింత గౌరవం పెరిగింది. అతని చేతులు పట్టుకుని వూపేస్తూ అభినందనలు చెప్పకుండా వుండలేకపోయాను. కిరీటి కూడా తెగ మెచ్చుకున్నాడు. "డబ్బు చాలా మందికుంటుంది. ఇంత మంచి అభిరుచి ఎంతమందికుంటుంది?" అంటూ జయని ఆకాశానికెత్తేశాడు. అతను ఇబ్బందిగా నవ్వి-

"సరే! రేపు తీరిగ్గా చెట్టు చెట్టునీ, పూలరెమ్మల్నీ పలకరించవచ్చు" అంటూ హాల్లోకి తీసికెళ్ళి కూర్చోపెట్టాడు. ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. అందమైన మా పల్లెనిగురించి, మధురమైన బాల్యాన్ని గురించి మాట్లాడుకున్నాం. చిన్ననాటి ఆటలు, తగవులు, చెట్లెక్కడాలు, చెరువులో ఈతలు కొట్టడాలూ లాంటి వెన్నో గుర్తుతెచ్చు

కున్నాం. కాదు. ఆ రోజుల్లోకెళ్ళి పోయాం.

"మున్నీ! నా కోరిక ఒకటుంది. తీరు స్తావా? " హఠాత్తుగా అన్నాడు జయ.

"నీకు కోరికా? " విస్మయంగానే అన్నాను.

"అవును. ఎన్నాళ్ళుగానో గుండెల్లో దాచుకున్న కోరిక. అది ఓ మంచి రచయిత్రివైన నీకే సాధ్యం!" అన్నాడు జయ. మెరుస్తున్న కళ్ళతో.

నా బాల్యస్నేహితుడు నా ప్రియ నేస్తం అంతలా నన్ను ఆకాశానికెత్తేస్తుంటే నేను పొంగిపోయాను. అయినా నా ఆనందాన్ని తొక్కి పెడుతూ-

"ఎంత మంచి రచయిత్రినైతేనేం, ఎంత గొప్ప రచయిత్రినైతేనేం... నా రచనలు గురించి ఓ ఉత్తరం ముక్కయినా రాశావా? ఏదో అందరూ చెప్తే మున్నీ ఓ గొప్ప రచయిత్రి అనుకుని మాట్లాడుతున్నావ్!" అన్నాను నిష్ఠూరంగా.

"అంటే నేను నీ రచనలేం చదవలేదం టావా? " దెబ్బతిన్నట్టు అన్నాడు జయ.

"ఏం చదివావో చెప్పు!" నిలదీసినట్టు అన్నాను.

"దాదాపు అన్నీ చదివాను. ఉత్తరం రాయకపోవడం నాతప్పే అని ఒప్పుకుంటున్నాను. కానీ మిమ్మల్ని మర్చిపోయానని గానీ, నీ రచనలు చదవడంలేదని గానీ అనుకోకు!" అన్నాడు జయ.

అతను అబద్ధం ఆడుతున్నాడనిపించలేదు. అబద్ధం ఆడాల్సినంత అవసరమూ తనకి లేదు.

నేను పొంగి పోయాను.

"అయితే నా రచనల్లో నీకు నచ్చిన రచనేంటో చెప్పు!" అన్నాను చిన్న పిల్లలా.

"నీ రచనలన్నీ నచ్చాయి. 'రాగద్వేషాలు, 'సుందర స్వప్నం', 'ప్రియనేస్తం'... ముఖ్యంగా 'అలల సవ్వడి, ఇలా ఎన్నో నచ్చాయి. అసలు నీ రచనలన్నీ నాకిష్టం!" అన్నాడు జయ.

నేను విస్మయంగా చూశాను.

"ఇంకా అనుమానంగా ఉందా, ఓసారి టురా!" అంటూ నా చెయ్యి పట్టుకుని ఓ పెద్ద గదిలోకి తీసుకెళ్ళాడు జయ. అక్కడున్న పెద్ద బీరువా నిండా పుస్తకాలే. ఎంతో మంది రాసిన మంచి మంచి నవలలు, పెద్దల చరిత్రలు పొందిగ్గా అమర్చి ఉన్నాయి. ఆ బీరువా పక్కన మరో చిన్న బీరువా అద్దాల్లోంచి కనిపించిన పుస్తకాలు నన్ను ప్రతిమను చేసేశాయి.

ఆ బీరువా నిండా నేను రాసిన రచనలే.

"ఇప్పటికైనా నమ్ముతావా? " అన్నట్టు చూశాడు జయ.

"సారీ మృత్యూ! ఇంత బిజీ డాక్టర్వై ఉండీ నా రచనలు చదువుతున్నావంటే నమ్మలేక పోయాను" అన్నాను అతని చెయ్యి పట్టుకుని సారీ చెప్తూ.

ఎప్పటిలా అతను నవ్వేశాడు.

"ఏం కిరీటీ! నిజం చెప్పు! నువ్వయినా చదివావా ఇన్ని పుస్తకాలూ? " అన్నాడు కిరీటికేసి చూస్తూ.

కిరీటి బుర్ర గోక్కుంటూ-

"అయ్యో బాబోయ్. నేనసలు ఇంగ్లీష్ నావెల్సు తప్ప చదవను." అనేశాడు.

"కిరీటికి ఇంగ్లీష్ నవలలు, ఇంగ్లీష్ మూవీలూ తప్ప ఇంకేం అక్కర్లేదు. అది సరే... ఇంతకీ నీ కోరికేమిటో చెప్పలేదు!" అన్నాను జయ మాటలు గుర్తొచ్చి. కిరీటి కుతూహలంగా చూశాడు.

"చెప్తాను కానీ ఇప్పుడు కాదు. రేపు తప్పకుండా చెప్తాను. చాలా అలసిపోయారు. భోంచేసి ఇవాల్టికి రెస్ట్ తీసుకోండి" అన్నాడు జయ లేస్తూ.

"ఏమిటి నాలా నువ్వూ సస్పెన్స్ మెయిన్టెయిన్ చేస్తున్నావా? " అన్నాను మూతి ముడుస్తూ.

"మరి సస్పెన్స్ నవలల రాణి ప్రియ నేస్తాన్ని కదా!" నవ్వేశాడు జయ. ఎప్పుడెళ్ళాడో రామయ్య భోజనం కేరియర్తో సహా వచ్చాడు. 'భోంచేసి పడుకోండి" అని మరో

సారి చెప్పి వెళ్ళిపోయాడు జయ.

★ ★ ★

ఉదయం ఆరు గంటలైంది.

చాలా రోజుల తర్వాత ఆ రాత్రి హాయిగా నిద్ర పట్టింది. నేను లేచేసరికే కిరీటి లేచి కాఫీ తాగుతున్నాడు. నన్ను చూడగానే సన్నగా నవ్వుతూ గుడ్‌మాణింగ్ చెప్పాడు. నేను బ్రష్ చేసుకుని వచ్చేసరికల్లా రామయ్య కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యాడు.

నాకా వాతావరణం చాలా నచ్చింది. కానీ ఎన్నాళ్ళుంటాం, పోనీ నేనుంటాను కానీ కిరీటి? నాలా తను ఖాళీగా ఎలా కూర్చోగలడు? అనుకున్నాను దిగులుగా.

పోనీ కిరీటిని పంపి నేను కొన్నాళ్ళపాటు ఇక్కడుంటే? అనుకున్నాను. కానీ కిరీటి అందుకు ఒప్పుకోడనిపించింది.

ఏడు గంటలు దాటుతుండగా జయ, మరో ఇద్దరూ కలిసి వచ్చారు. వాళ్ళు తమ హాస్పిటల్‌లో సాటి డాక్టర్లుగానూ, మమ్మల్ని ఆత్మీయులుగానూ పరిచయ వాక్యాలు పలికాడు. వాళ్లు కూడా సరదాగా మాట్లాడుతుంటే మళ్లీ చిన్న పిల్లనై పోయాను. దానికి తోడు జయ మా పసితనపు అల్లర్లు కథలు కథలు చెప్తున్నాడు. వాళ్ళు చిరునవ్వుతో వింటున్నారు. మధ్య మధ్య కిరీటి మాట కలుపుతున్నాడు.

"మున్నీ! పదింటికల్లా రెడీగా ఉండండి. పక్క గ్రామంలో గ్రామ దేవత ఉత్సవాలు జరుగుతున్నాయి. చాలా సరదాగా ఉంటుంది. వెళ్ళి ఈ రోజంతా గడిపొద్దాం" అన్నాడు జయ ఉత్సాహంగా.

"అంటే మన పల్లెలో నాంచారమ్మ సంబరాలు జరిగినట్టా? " అన్నాను.

"అవును. కానీ అంతకన్నా బాగా చేస్తారు. నువ్వే చూస్తావుగా!" అంటూ లేచాడు జయ. మిగతా ఇద్దరూ కూడా లేచారు. కిరీటికి పెద్ద ఇష్టం ఉన్నట్టు లేదు. మొహం అదోలా పెట్టాడు. అది గమనించిన జయ.

"ఏమిటి... తిరిగి తిరిగి మున్నీ అలిసిపోతుందని భయపడుతున్నావా? డోన్ట్ వర్రీ నువ్వే కాదు. నేనూ తనని జాగ్రత్తగానే చూసుకుంటాను" అంటూ నవ్వాడు.

కిరీటి మరి మాట్లాడలేదు.

మరోసారి చెప్పి జయవాళ్ళు వెళ్ళిపోయారు.

"కిరీటీ! తొందరగా రెడీ అవ్వు. టిఫిన్ తినేసేసరికి పది అవనే అయిపోతుంది" అన్నాను ఉత్సాహంగా. నా ఆనందాన్ని చూశాక కిరీటి క్కూడా ఉత్సాహం వచ్చింది. అంతే కాదు చాలా రోజుల తర్వాత హాయిగా నవ్వుతున్నందుకు మురిసిపోయాడు కూడా.

జయ చెప్పినట్టే పదింటికల్లా ఇద్దరం రెడీ అయి కూర్చున్నాం. పదింబావుకి సారీ చెప్తూ వచ్చాడు జయ.

"ఏమిటి వెళ్లడం లేదా? " అన్నాను దిగులుగా.

"అది కాదు. పావు గంట ఆలస్యంగా వచ్చినందుకు!"

"ఓ! పావు గంటకే అంతలా బాధ పడిపోతున్నావు. మన ఇండియన్ పంక్చ్యువాలిటీ నీకు తెలియదా? పెద్ద పెద్ద ఫంక్షన్స్ క్కూడా చీఫ్ గెస్టులు సైతం గంటల తరబడి ఆలస్యంగా వస్తారు. ఎంత లేట్‌గా వస్తే అంత గొప్ప కొందరికి!" అన్నాను నవ్వుతూ. జయ కూడా నవ్వి-

"రామయ్యా! అన్నీ సిద్ధమేగా? " అన్నాడు అతనికేసి చూస్తూ.

"ఓ! అన్నీ సిద్ధమే బాబూ!" ఉత్సాహంగా అన్నాడతను.

"ఏమిటి సిద్ధం? " అన్నాను అర్థం కాక.

"మనం వెళ్ళేది జాతర వేడుకలు చూడ్డానికి. అక్కడ తినడానికి అన్నీ దొరికినా ఆరోగ్యరీత్యా అంత మంచిది కాదు. అందుకే మనకి లంచ్ అదీ సిద్ధం చెయ్యమని పొద్దున్నే రామయ్యకి ఫోన్ చేసి చెప్పాను" అన్నాడు జయ.

"అయితే రామయ్య కూడా వస్తున్నాడన్న మాట" అన్నాను మరింత ఉత్సాహంగా.

"అవునమ్మా. మీ అందరికీ వడ్డించాలిగా!" అంటూ హాట్ పేక్సన్నీ కారు డిక్కీలో సర్దాడు రామయ్య. ఓ పెద్ద జంపకానా, రెండు దిళ్ళు కూడా పెట్టాడు.

అందరం కార్లో కూర్చున్నాం. ఈసారీ స్టీరింగ్ జయ చేతుల్లోనే ఉంది.

కారు సముద్ర తీరాన మెల్లగా సాగుతోంది. అప్పుడంతగా జనం లేరు బీచ్‌లో. జయ ఏవేవో కబుర్లు చెప్తున్నాడు. కిరీటి తన సందేహాలన్నీ అడిగి తెలుసుకుంటున్నాడు. సముద్ర తీరం పొడవునా చిన్న చిన్న కొండలూ, సరుగుడు చెట్లు బారులు తీరినట్టున్నాయి. ఆరాళ్ళ వెనకాల కూడా కొన్ని కథలున్నాయి అంటూ ఏవేవో కథలు చెప్పాడు జయ.

చిన్న చిన్న పల్లెలెన్నో దాటుకుంటూ, గంట తర్వాత జాతర జరిగే పల్లెని సమీపించాం.

మైక్‌లో ఏవో పాటలు వినిపిస్తున్నాయి. మరి కొంత దూరం వెళ్ళేసరికి కిటకిటలాడుతున్న జనం కనిపించారు. టెంపరరీనే అయినా చాలా షాపులు పెద్ద బజార్ని మార్చేశాయా ప్రాంతాన్ని.

కారు ఓ చోట పార్క్ చేశాక అందరం దిగాం. అమ్మవారి గుడి చిన్నదే అయినా అక్కడ జరిగే ఉత్సవాలు మాత్రం చాలా ఆడంబరంగా ఉన్నాయి.

ఓ వైపు పూనకాలతో ఊగి పోతున్న మహిళలు, మరోవైపు వీరంగం వేస్తున్న యువకులు, ఇంకోవైపు పిల్లల్ని అదుపులో పెట్టాలని చూస్తున్న తల్లిదండ్రులు. చాలా సందడిగా ఉంది.

నాకిలాంటి జాతరలేం కొత్తకాదు. మా పల్లెలో తరుచూ గ్రామదేవతల ఉత్సవాలు జరుగుతూనే ఉంటాయి. ఆ జాతర్లలో నేను, కిరీటి, జయలేకాక మిగతా ఫ్రెండ్సంతా వుత్సాహంగా తిరిగేవాళ్ళం. చెరుగ్గడలు నములుతూ, బెలూన్లు వూదుకుంటూ పదిసార్లు చక్కర్లు కొట్టేవాళ్ళం. ఆడపిల్లలం గాజులు, రిబ్బన్లు కొనుక్కునే వాళ్ళం. ఆ జాతరున్నన్నాళ్ళూ మాకు సందడే సందడి!

అయితే ఆ జాతరల్లో మాకు నచ్చనివీ కొన్ని ఉండేవి. అవే జంతుబలులు. చెవులు చిల్లులు పడేలా వినిపించే డప్పులు! ఇక్కడ అలాంటివి కనిపించకపోవటంతో తేలిగ్గా ఊపిరితీసుకున్నాను. అదే మాట జయతో అంటే అతను సన్నగా నవ్వి ఓ వైపు చూపించాడు.

అక్కడ రంగులు పూసి, మెళ్ళో పూలదండలు, వేపాకులు దండలూ వేసి బలికి సిద్ధంచేయబడ్డ వందలాది మేకలు, గొర్రెలు!

"అయితే ఇప్పుడు వాటిని బలిస్తారా? " అన్నాను బాధగా.

"ఇక్కడివ్వరు. ఇక్కడికి తీసుకొచ్చి ఏవో పూజలూ అవీ చేసి ఇళ్ళలోనో, ఏ దొడ్లలోనో చేసుకుంటారు. ఈ బలులు బహిరంగంగా జరగక్కూడదని నిబంధనుందిగా" నవ్వాడు జయ.

"అది నయం" అనిపించింది నాకు.

ఎందుకంటే మేం చూసిన జాతర్లలో బలులు గుడి ముందే జరిగేవి. అందుకే ఆ టైమ్‌లో ఆ ఛాయలకే వెళ్ళేవాళ్ళం కాదు.

ఓ సారైతే మా పల్లెలో స్మాల్‌పాక్స్, కలరా లాంటి జబ్బులొచ్చి చాలా మందే పోయారు. ఆనాటి వాళ్ళ దృష్టిలో స్మాల్ పాక్స్ కలరా లాంటివి కూడా అమ్మవార్లే. వ్యాధి సోకగానే డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళడం

గురించి ఆలోచించకుండా ముడుపులు, మొక్కులు, బలులు అంటూ హంగామా చేసేవాళ్ళు. ఆయువున్నవారు బతికితే, అమ్మవారి దయ. చస్తే- 'అమ్మ ఆగ్రహించింది' అనుకునేవారు. అలాగే ఆ రోగా లొస్తే మొక్కులు మొక్కి అవీ శాంతించగానే 'తల్లి శాంతిం చింది' అంటూ జాతర్లు మొద లుపెట్టారు. వేలాది జీవాలు బలైపోయి రక్తం మడుగులు కట్టింది. ఆ దృశ్యం చూసిన మేమంతా ఒణికి పోయాం. అందుకే అలా బలులు జరిగే ఛాయలకే వెళ్ళకుండా జాగ్ర త్తలు తీసుకున్నాం.

తర్వాత పరిసరాలన్నీ తిరిగాం. నా వుత్సాహం చూసి కిరీటే కాదు. జయ కూడా ఆశ్చ ర్యపోయాడు.

ఇంక కాస్త దూరం వెళ్ళేసరికి అక్కడ పెద్ద జెయింట్ వీల్ కని పించింది. నా కళ్ళు తళుక్కుమ న్నాయి. నాకు జెయింట్ వీల్ ఎక్కడం అంటే చాలా ఇష్టం. కానీ జయకి, కిరీటికి అంత ఇష్టం ఉండేది కాదు. నేను కిరీ టికేసి చూశాను. తను ఓ పక్కగా జరిగే పల్లెపడుచుల నృత్యం చూడ్డంలో పడిపో యాడు. కొందరు కన్నెపిల్లలు కిరీటికేసి ఓరచూపులు చూడ్డం నా దృష్టిని దాటిపోలేదు. ఎంతో ఇష్టంగా నృత్యాన్ని చూస్తున్న కిరీటిని డిస్టర్బ్ చెయ్యడం ఇష్టంలేక-

"జయా! మనం జెయింట్ వీల్ ఎక్కుదామా?" అన్నాను మరీ పసిపిల్లలా.

"జెయింట్ వీలా?" తుళ్ళిపడ్డాడు జయ.



## సలహాదారులు

ఓ మంత్రి విదేశీ పర్యటనకు బయలుదేరారు. తిరి గివచ్చే వరకూ తన డబ్బంతా ప్రధాని వద్ద దాచు కుంటే భద్రంగా ఉంటుందని భావించిఅదేమాట ఆయ నను అడిగారు. దానికాయన 'అలాగే చేయండి.. ఎందుకైనా మంచిది.. డబ్బు వ్యవహారాలు కదా? ఇద్దరు సాక్షులను కూడా పెట్టుకుందాం.. కావాలంటే నా సలహాదారులు ఉన్నారు' అన్నాడు. ప్రధాని నిక్క చ్చితనానికి మంత్రి ముగ్ధుడయ్యాడు. అనుకున్నట్లే సల హాదారుల సమక్షంలో డబ్బంతా ప్రధానికిచ్చేసి ఆయన పర్యటనకు వెళ్లిపోయారు. నెల తరవాత తిరిగివచ్చిన ఆయన తనడబ్బు విషయం ప్రధానిని అడిగారు. ప్రధాని ఆశ్చర్యంగా ముఖం పెట్టి 'ఏ డబ్బు? అన్నారు.

కంగుతిన్న మంత్రి 'అదేంటి సార్.. ఆరోజున ఇచ్చాను.. సాక్షాత్తు మీ సలహాదారుల సమక్షంలో.. వాళ్లను సాక్ష్యంగా కూడా పెట్టుకున్నాం కదా.. అన్నాడు బిక్కమొగం వేసుకుని.

వెంటనే ప్రధాని సలహాదారులను పిలిపించాడు. 'ఏమయ్యా.. ఈయన నాకు డబ్బిచ్చానంటున్నాడు.. మీరే సాక్ష్యమంటున్నాడు.. నిజంగా ఇచ్చాడా?' అని మంత్రిముందే అడిగాడు. 'మేం చూళ్లేదు సార్' అన్నారు వాళ్లు. తర్వాత ప్రధాని వాళ్లను పంపించేసి మంత్రికి అతను దాచుకున్న డబ్బిచ్చాడు.

మంత్రి అప్రతిభుడవుతూ 'ఏంటిసార్ ఇదంతా?' అన్నాడు.

'ఏంలేదు నా సలహాదారులెలా ఉన్నారో నీకు చూపిద్దామనే..' అన్నాడు ప్రధాని తాపీగా.

అతని మాటకి కిరీటికూడా తిరిగి చూశాడు.

"ఏం భయమా?" కవ్వింపుగా అన్నాను.

"అదికాదు మున్నీ! అంత పెద్దవీల్ ఎక్కితే..!" నసిగాడు జయ. కిరీటికూడా అభ్యంతరపెట్టాడు. అయినా నేను వినలేదు.

"మీర్రాకపోతే నేనే వెళ్ళి ఎక్కుతాను!" అని బెదిరించాను. కిరీటి జయకేసి చూశాడు నిస్సహాయంగా.

"పర్లేదు. నువ్వా డాన్స్ అదీ చూస్తుండు. నేను మున్నీని తీసుకెళ్తాను" అన్నాడు జయ. నేను ఉత్సాహంగా అతని చెయ్యి పట్టుకుని వీల్ కేసి నడిచాను. అయితే నేను వెళ్ళడం కిరీటికి అంతగా నచ్చలేదని తెలిసిపోయింది. మెల్లగా కిరీటికి నచ్చజెప్పి బయల్దేరాను.

జయవెళ్ళి టికెట్ తెచ్చాడు. మేమిద్దరం చేతులు పట్టుకుని సీట్లలో కూర్చుంటుంటే అందరూ వింతగా చూశారు. కొందరు ముసిముసిగా నవ్వుకున్నారు.

నా మొహం చిన్నబోయింది. "జయా! మనం జైంట్ వీల్ ఎక్కకూడదా?" అన్నాను దీనంగా. నా బాధను గమనించిన జయ తేలిగ్గా నవ్వేస్తూ- "ఎందుకెక్కకూడదూ? మనిష్టం. మనల్ని కాదనడానికి వాళ్ళెవరు" అన్నాడు నన్ను పొదివి పట్టుకుంటూ. ఎవరి కివారు సేఫ్టీరాడ్ సెట్ చేసుకున్నారు. వీల్ కి సంబంధించిన ఒకతను మమ్మల్ని ప్రత్యేకంగా చూస్తూ తనే సేఫ్టీరాడ్ సెట్ చేశాడు.

వీల్ కదిలింది. కాస్తపైకెళ్ళేదాకా బానే ఉందికానీ మరీపైకెళ్ళేసరికి కళ్ళు తిరిగినట్ట యింది. గభాల్న జయ గుండెల్లో తల దాచుకున్నాను. జయకూడా 'భయంలేదు' అన్నట్టు నన్ను పొదివిపట్టుకున్నాడు.

"ఏమిటో చిన్నప్పుడు ఎంత కేరింతలు కొడుతూ తిరిగేదాన్ని?... ఇప్పుడేమిటి ఈ మాత్రానికే హడలిపోతున్నాను? అనుకు న్నాను బాధగా.

కాస్సేపటికి వీల్ ఆగింది. ఒక్కొక్కరం దిగాం. ఇంకా నాకు తల తిరుగుతున్నట్టే ఉంది. మమ్మల్ని చూసిన కిరీటి ఒక్క అంగలో అక్కడికి వచ్చి నన్ను పట్టుకొని తీసుకెళ్ళి కూర్చోపెట్టాడు.

"అందుకే వద్దన్నాను" అన్నాడు విసు క్కుంటూ. నేను నవ్వాను అయిదు నిమి షాల్లో మామూలుగా అయిపోయాను కూడా. ఒంటిగంటకి దైవదర్శనం అయింది. తర్వాత అతి ప్రయాసగా జనంలోంచి బైట పడి కారు దగ్గరకొచ్చాం. ఆ పరిసరాల్లోనే ఉన్న ఓ పెద్ద చెట్టుకింద జంపకానా వేసి లంచ్ సిద్ధం చేశాడు రామయ్య. బాగా తిరిగి అలిసిపోయామేమో ఆవురావురు మంటూ భోంచేశాం.

నిజంగా అంత ఆకు వెయ్యడం, కడుపు నిండా తినడం కూడా ఈ మధ్యలేదు. నాలోని మార్పుకి కిరీటి చాలా ఆనందపడి పోయాడు. అయితే నేనంతలా అలసిపో యేట్టు తిరగడం మాత్రం తనకిష్టం లేదు.

"కాస్సేపు రెస్ట్ తీసుకో మున్నీ" అన్నాడు జయ భోజనం అయ్యాక. నేను మాట్లాడ లేదు. నిజంగానే నాకు పడుకోవాలనుంది. కానీ అక్కడ, వాళ్ళంతా కూర్చుంటే నేను పడుకోవడమే అంత బావుండదనిపించింది.

"పడుకోవాలనుండీ ఎందుకు ఆలోచిస్తు న్నావు మున్నీ!" నన్ను చదివేసినట్టు అన్నాడు జయ.

"నాకేం పడుకోవాలని లేదు" అన్నాను నిష్టూరంగా. అతను నవ్వాడు.

"మున్నీ! ఈ మధ్య నీ మనసు నీ దగ్గ రుండడంలేదు!" అన్నాడు మెల్లగా.

నేను ఉలిక్కిపడ్డాను.

"కంగారు పడకు. ఆ మధ్య నీకో కలొచ్చిందనీ, ఆ పీడకల రాగానే నువ్వు బాగా అప్ సెట్ అయ్యావనీ, పుంఖాను పుంఖా లుగా రాసే నీ కలం ఆగిపోయిందనీ నాకు కిరీటి చెప్పాడు. అప్పట్నించీ చాలా డల్ గా అయిపోయావనీ చెప్పాడు. కానీ నువ్వింత పిరికిదానివని మాత్రం నేనూహించలేదు" అన్నాడు జయ.

"నిజమే! నాకూ అలాగే అనిపిస్తోంది!"

అన్నాను దిగులుగా.

"అరె! ఏమిటింతలో అలా అయిపో యావ్! నేను సరదాగా అన్నాను. నీకేం నువ్వెప్పుడూ ఝూన్సీరాణివే!" నవ్వాడు జయ. అదే మాటన్నాడు కిరీటి కూడా.

తర్వాత కాస్సేపు రిలాక్సింగ్‌గా పడుకున్నాను. జయ, కిరీటి ఏవేవో కబుర్లు చెప్పారు. రామయ్య తనకి తెలిసిన జాతర్ల గురించి చెప్పాడు

అలా వాళ్ల మాటలు వింటూ మెల్లగా నిద్రలోకి జారిపోయాను. మళ్లీ మెలకువ వచ్చేసరికి సాయంత్రం నాలుగై పోయింది. టైమ్ చూసుకుని-

"సారీ! నాకు తెలియకుండానే నిద్రపోయాను!" అన్నాను నొచ్చుకున్నట్టు. జయ, కిరీటీ కూడా నవ్వేశారు.

"జనం మరీ పెరిగిపోతున్నారు. ఇంకాస్సేపైతే గుండెలు అదిరే వాద్యాలూ, తాగుబోతుల అల్లర్లూ ఎక్కువవుతాయి" అన్నాడు జయ.

"అవునమ్మా! ఈ జాతర పదిరోజులూ చాలామంది ఆడ, మగ అని లేకుండా కల్లు తాగి చిందులు వేస్తారు!" అన్నాడు రామయ్య.

"అమ్మో... ఆ డప్పులు, బాకాలూ విని భరించే శక్తి నాకు లేదు. వెళ్లిపోదాం!" అన్నాను భయంగా.

తర్వాత అన్నీ సర్దుకుని కార్లో కూర్చున్నాం. కారు మళ్ళీ మెల్లగా సాగింది. దారిలో ఎన్నో కబుర్లు చెప్పారు జయ, రామయ్య. కిరీటి మాత్రం ఎక్కువగా మాట్లాడ్డం లేదు. అప్పుడో మాట, ఇప్పుడో మాట తప్ప.

నేను జైంట్ వీల్ ఎక్కిన దగ్గర్నించీ కాస్త గంభీరంగానే వున్నట్టనిపించింది నాకు. అదేం గమనించినట్టు లేదు జయ. తెగ మాట్లాడేస్తున్నాడు.

"మీవూరు నాకు నచ్చింది మృత్యూ!" అన్నాను తృప్తిగా.

"అయితే ఇక్కడే వుండిపో!" అన్నాడు జయ నవ్వుతూ.

"మరి నా సంగతో?" అన్నాడు కిరీటి నిష్ఠూరంగా

"నువ్వూ వుండు!"

"బావుంది" నవ్వాడు కిరీటి.

నవ్వుతున్న కిరీటిని అలా చూస్తుండిపోయాను. కిరీటి నవ్వు చూస్తే ఎవరైనా మైమరచిపోతారు.

ఇల్లు చేరుకునేసరికి బాగా పొద్దుపోయింది. జయకోసం ఎవరో ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు.

"మీరు లోపలికెళ్ళండి నేనిప్పుడే వస్తాను" అంటూ వాళ్ళతో కలిసి హాస్పిటల్‌కేసి నడిచాడు జయ. మేం లోపలికొచ్చేశాం. నాకెందుకో బాగా అలసటగా అనిపించింది. బట్టలు కూడా మార్చుకోకుండా సోఫాలో కూర్చుండిపోయాను. కిరీటి మాత్రం స్నానం చేసి వస్తానని బాత్‌రూమ్‌లో దూరిపోయాడు.

మరో పది నిమిషాలకల్లా జయ వచ్చేశాడు. "ఏవిటి జయా! వైదేహి కబురంపిందా?" అన్నాను ఆతృతగా.

"ఊహూ! పేషెంటు తాలుకు మనిషి!" క్లుప్తంగా అన్నాడతను. ఎందుకో వైదేహికీ, జయకీ మధ్య అంత సఖ్యత లేదేమో అనిపించింది. అది అడుగుదామనుకునేంతలో కిరీటి వచ్చేశాడు. కిరీటి ఎదురుగా అడగడం ఇష్టం లేక వూరుకున్నాను.

"రామయ్యా! పార్వతమ్మ వంట చేసేసింది. ఈ పూటకి నువ్వేం వండకు" అన్నాడు జయ. వంట చెయ్యడానికి సిద్ధమవుతున్న రామయ్య ఆపనిని విరమించుకున్నాడు.

"జాతరెలా వుంది మున్నీ?" ఆప్యాయంగా అడిగాడు జయ.

"జాతర సంగతెలా వున్నా ఈ ప్రయాణం మాత్రం చాలా బావుంది" అన్నాను మనస్ఫూర్తిగా. కిరీటిని కూడా అడిగాడు జయ.

"చాలా బావుంది. ముఖ్యంగా ఆ పల్లె పడుచుల నృత్యం మరీ బావుంది" అన్నాడు

కిరీటి మెరుస్తున్న కళ్ళతో

"నేను చేసిన వంటలు బాగా లేవా బాబూ? " అన్నాడు రామయ్య నవ్వుతూ.

"అవింకా బావున్నాయి. కాకరకాయ గుత్తులు తింటుంటే మా రాజన్నయ్య గుర్తొచ్చాడు. తను వంట బాగా చేస్తాడు. కాకర గుత్తులైతే ఇంక చెప్పనక్కర్లేదు" అన్నాను నేను గభాల్న.

"రాజన్నయ్య ఎవరమ్మా!" అన్నాడు రామయ్య

"అది నన్నడుగు చెప్తాను 'ఈవిడ గారికి రాజన్నయ్య, గిరన్నయ్య అని ఇద్దరు దేవుడిచ్చిన అన్నలుండేవారు. అదే మా కిరీటి ఫ్రెండ్సు" నవ్వాడు జయ. నేను విస్తుపోయాను.

"వాళ్లు నీకు తెలుసా? " అన్నాను విస్మయంగా

"ఓ! బాగా తెలుసు. వాళ్లు నీ గురించి తర్వాత చెప్పారు. అమ్మా వాళ్లు పోయినపుడు నువ్వు చాలా అప్‌సెట్ అయ్యావని కూడా వాళ్ళే చెప్పారు!" అన్నాడు జయ.

"నిజమా! ఎన్నాళ్ళయింది వాళ్ళని చూసి! ఇప్పుడు వాళ్లు ఎక్కడున్నారో తెలుసా మృత్యూ? " అన్నాను ఆతృతగా.

"ఆ! మీ రాజన్నయ్య అమెరికాలో, గిరన్నయ్య అమరావతిలోనూ వున్నారు!"

"మన అమరావతిలోనా? అయితే ఓసారి వెళ్ళి చూడాలి? " అన్నాను వాళ్ళిద్దర్నీ తల్చుకుంటూ.

"వెళ్దాం! నాకూ అమరావతి వెళ్ళాలనుంది? " ఏదో ఆలోచిస్తూ అన్నాడు జయ. కిరీటి ఏదో అడగబోతుండగా నాకు జయ కోరిక సంగతి గుర్తొచ్చింది.

"అన్నట్టు మృత్యూ! నీకేదో కోరిక వుందన్నావ్. దాన్ని గురించి నువ్వు చెప్పనే లేదు!" అన్నాను.

"చెప్తాను. నా కోరిక తీర్చాలి మరి!"

"ఇంత మంచి నేస్తం అడిగితే నా ప్రాణాలైనా ఇస్తాను!" ఒకలాంటి వుద్వేగంతో అన్నాను.

"అమ్మ బాబోయ్! నేను ప్రాణాలు పొయ్యాలని ప్రయత్నించేవాణ్నేగానీ, ప్రాణాలు కోరేవాణ్ని మాత్రం కాదు!" భయం నటిస్తూ అన్నాడు జయ. అతనన్న తీరుకి కిరీటి, నేనూ కూడా నవ్వేశాం.

"సరే! చెప్పు!" అంటూ తొందరపెట్టాను. "కోరిక అడిగేముందు ఓ మాటడుగుతాను. నిజం, చెప్తావా? " గంభీరంగా అన్నాడు జయ.

నేను తెల్లబోయాను

"ఏమిటి మృత్యూ! నీతో ఎప్పుడైనా అబద్ధం చెప్పానా? " అన్నాను దెబ్బ తిన్నట్టు

"లేదు. ఇప్పుడు చెప్తావేమో అని!"

"లేదు. నేను అబద్ధం చెప్పను. నీతో అసలు చెప్పను" అన్నాను దృఢస్వరంతో.

"నువ్వు మంచి సామాజిక స్పృహ వున్న రచయిత్రివి. నీ కలం నుంచి ఎన్నో కథలు, నవలలు, ఇతర రచనలూ వెలువడ్డాయి. కానీ రచయిత్రిగా ఓ విషయం మర్చిపోయావు!" ఎందుకో జయ గొంతు వణికింది.

నేను మరింత విస్తుపోయాను.

"నేను మర్చిపోయిన విషయం ఏమిటి మృత్యూ? నా రచనలు మూసపోసినట్టుండవనీ, ప్రతి రచనలోనూ ఏదో ఓ వైవిధ్యం వుంటుందనీ పెద్ద చాలామంది ఒప్పుకున్నారు? ఇంక నేను రాయనిదేమిటి? " అన్నాను

"నీ జీవితంలో అతి విలువైనవీ, మధురమైనవీ నీ కలం టచ్ కూడా చెయ్యలేదు" అన్నాడు జయ నిష్ఠూరంగా.

"దేన్ని గురించి నువ్వనేది? "

"అన్ని విషయాలూ టచ్ చేస్తూ రాశావు. అపురూపమైన నవలలూ రాశావు. కానీ మన బాల్య స్నేహం గురించి ఎక్కడైనా రాశావా? మనం తిరిగి బాల్యంలోకి ఎలాగూ వెళ్ళలేం, ఆ తియ్యని అనుభవా

లని గురించి ఎందుకు రాయలేదు? "

"మృత్యూ!"

"అవును మున్నీ! అవి మన హృదయాల్లో నిక్షిప్తమై ఉండవచ్చు కానీ ఈ హృద యాలు శాశ్వతం కావే! అదే పేపర్‌మీద పెడితే బాల్యం గురించిన తియ్యని అనుభ వాలు కలలోనైనా చూడలేని ఈనాటి పిల్ల లకి తెలుస్తాయి కదా! ఆ ప్రయత్నం నువ్వెందుకు చెయ్యలేదు? " నిలదీసినట్టు అన్నాడు జయ.

ఛెళ్ళున తగిలినట్టయింది నాకు.

"నిజమే, ఎన్నో సమస్యలు, మరెన్నో థీమ్స్ తీసుకుని నాదైన శైలిలో రాసి ఎంతో మంది ప్రశంసలందుకున్నాను. కానీ మధు రాతి మధురంగా గడిచిన నా బాల్యం గురించి, నిష్కల్మషమైన మా స్నేహాన్ని గురించి, నందనవనంలా ఉండే నా పల్లెని గురించీ ఎందుకు రాయలేదు? " అని నన్ను నేనే తిట్టుకున్నాను.

"అందుకే మైడియర్ మున్నీ, మన బాల్యం గురించి రాయి! నాకోసం!" వేడికో లుగా అన్నాడు జయ.

"ఇప్పుడా? "

"ఏం? రాయలేవా? కానీ రాయాలి! నాకోసం కాదు, మనకోసం!..."

"కానీ..."

"ఇంకేం మాట్లాడద్దు! ఇక్కడ మీరు నెల్లాళ్ళు ఉండబోతున్నారు. అందుకు కిరీటి కూడా ఒప్పుకున్నాడు. అది రాసి నాకిచ్చి మరీ కదలాలి. ఓ!కే? "

నేను కిరీటికేసి చూశాను.

"నువ్వు రాయగలవు! నీకు అండగా నేనుంటాను!" అన్నట్టు నవ్వాడు కిరీటి.

నేను భారంగా నిట్టూర్చాను.

పసిపిల్లలా తుళ్ళుతు, గెంతుతూ ఉన్న నేను ఆర్నెల్లుగా డల్‌గా అయిపోయాను. తెలియని అశాంతి, ఆవేదన నన్నావరిం చాయి. నా పరిస్థితి చూసిన కిరీటి ఎంతో మంది డాక్టర్లకి చూపించాడు. అంతా నార్మల్! అయినా నాలో మార్పులేదు. ఏవేవో పిచ్చి ఆలోచనలు. కలం పట్టడం మానేశాను. ఈ విషయంలో కిరీటిని చాలా రకాలుగా ఇబ్బంది పెడుతున్నానని కూడా నాకు తెలుసు. నా నీడని చూసి నేనే భయ పడుతున్నట్టు తయారయాను. ఈ పరిస్థి తిలో జయ కోరిక తీర్చగలనా? ఏది ఏమైనా ఇక్కడ నెల్లాళ్ళుంటానంటే నాకు చాలా ఆనందం కలిగింది.

"ఒప్పుకున్నట్టేగా!" అన్నాడు జయ నా మౌనం చూసి

"ప్రయత్నిస్తాను!" అన్నాను లోగొంతుతో.

"ప్రయత్నించడం కాదు రాయాలి! మన బాల్యం గురించి మాత్రం రాయి చాలు. నీకు, కిరీటికీ మధ్య జరిగిన స్వీట్ నథింగ్స్ ఏం రాయొద్దులే!" నవ్వాడు జయ.

నేను సిగ్గుగా నవ్వాను.

"ఓ!కే! రాస్తాను!" అనేశాను.

"దట్స్ గుడ్! ఇవాల్టికి రెస్ట్ తీసుకోండి. పొద్దున్నే పేపర్స్ వగైరాలన్నీ ఏర్పాటు చేస్తాను. ఇదిగో ముందే చెప్తున్నాను. పక్ష పాతంతో కిరీటిని గురించి ఎక్కువగా రాస్తే ఊరుకోను. అన్నీ జరిగినవి జరిగినట్టు రాయాలి!" అన్నాడు జయ హెచ్చరిస్తున్నట్టు.

"అలాగే! నీ గురించే ఎక్కువ రాస్తాను. సరేనా!" అన్నాను నవ్వుతూ.

"థాంక్యూ! మరి ఇంక నేను వెళ్ళనా? "

"ఊ! వెళ్ళు!"

"పదినిమిషాల్లో భోజనం పంపుతాను. తినేసి హాయిగా పడుకోండి. కింద రామయ్య పడుకుంటాడు. ఏమైనా కావా లంటే బెల్ నొక్కండి వస్తాడు. నాతో ఏదైనా మాట్లాడాలంటే ఫోన్ చెయ్యండి క్షణాల్లో వచ్చి వాల్తాను!" అంటూ వెళ్ళిపో యాడు జయ.

"నిజంగా ఇంత మంచి స్నేహితుణ్ణి ఇంత

దారిద్ర్యం నేరాలకు తల్లి లాంటిది. - సోమర్‌సెట్ మామ్

కాలం ఎలా మర్చిపోయాను!" అనుకుంటే నాకు సిగ్గనిపించింది.

అన్నట్టే పదినిమిషాల్లో భోజనం సామ గ్రితో తిరిగొచ్చాడు రామయ్య.

ఇద్దరం భోజనం చేసి బెడ్‌రూమ్‌కేసి నడిచాం. హంసతూలికా తల్పంలా ఉన్న ఆ బెడ్‌ని చూస్తుంటే ముచ్చటేసింది. బాగా అలసిపోయాడేమో కిరీటి మంచం ఎక్కి క్షణాల్లో నిద్రలోకి జారిపోయాడు.

కిరీటికేసి ప్రేమగా చూస్తూ నేను అతని పక్కన పడుకుని ముసుగు బిగించాను.

★ ★ ★

అన్నట్టే జయ పొద్దున్నే వచ్చి నాక్కావ లసిన పెన్నులు, పేపర్స్ ఇచ్చాడు. మా సదుపాయాలు బావున్నాయో లేదో పరిశీ లించాడు. మన బాల్యాన్ని గురించి అదిరి పోయేలా రాయాలి! అని హెచ్చరించాడు నవ్వుతూనే. తర్వాత కాస్సేపు కూర్చుని ఏదో ఆపరేషన్ ఉందంటూ వెళ్ళిపోయాడు.

"వానపాములా ఉండే జయ ఎంత యాక్టి వ్‌గా అయిపోయాడు!" అని విస్తుపో యాను. కిరీటి కూడా అదే మాట అన్నాడు.

నిజంగా నాకా ప్రదేశం ఎంతో నచ్చింది. మనసు రవంత సేద తీరినట్టనిపించింది. నా మనశ్శాంతికోసం ఇంత తపన పడు తున్న నా కిరీటిమీద ప్రేమ వరదలా పొంగింది. అయితే దాదాపు ఆర్నెల్ల తరు వాత పెన్ను పట్టుకోవాలంటే ఏదో బెరుగ్గా అనిపించింది.

అయినా రాయాలి! జయ అన్నట్టు మను ష్యులు శాశ్వతం కాదు. మనసులోని భావా లని పేపర్‌మీద పెడితేనే నాలుగు కాలాల పాటు నిలిచేది!

రామయ్య మమ్మల్ని ఎంతో అపురూ పంగా చూసుకుంటున్నాడు. వంటంతా అక్కడే చేసి డైనింగ్ టేబిల్‌మీద సర్ది పక్కగా ఒదిగి నిల్చుంటున్నాడు. కాఫీ టిఫిన్లు బెడ్‌మీదికే అందిస్తున్నాడు. కిరీటి మాత్రం ఆ ఊరంతా తన పరిచయస్తులే ఉన్నట్టు ఎప్పుడూ బైటే తిరుగుతున్నాడు. అదేమంటే-

"నీకు తోడు రామయ్య ఉన్నాడుగా ఎంచక్కా ఇద్దరూ కలిసి కబుర్లు చెప్పుకోండి" అంటూ నవ్వేస్తున్నాడు.

నిజంగానే నాకు రామయ్య ఓ ఆత్మీయు డిలా మారిపోయాడు. ఆత్మీయులందర్నీ పోగొట్టుకున్న ఆ పేద బ్రాహ్మణ్ని ఓ పని వాడిలా కాక ఓ ఆత్మీయుళ్ళా చూస్తాడనీ, అసలు తనుచేసే పనే తక్కువనీ, కేవలం తనకో పని కల్పించాలనే బాబుగారు ఇక్కడ తనని పెట్టారనీ జయని గురించి గొప్పగా చెప్పాడు.

నేను భారంగా నిట్టూర్చాను.

అతని కథ వింటే గుండెలో సన్నని బాధ మొదలయింది. తర్వాత-

"ఎవరికెవరు ఈ లోకంలో ఎవరికి ఎరుక!" అంటూ వేదాంతిలా నవ్వుకున్నాను.

మూడురోజులు గడిచిపోయాయి. పగ లంతా ఇల్లు, తోట చూడ్డం, సాయంత్రం పూట కిరీటితో కలిసి బీచ్‌కెళ్ళడం, కబుర్లు చెప్పుకుని నవ్వుకోవడం మా దినచర్య అయి పోయింది. ఈ మూడురోజుల్లో ఒకటి రెండుసార్లు వచ్చి పలకరించి వెళ్ళిపోయాడు జయ. తరచూ ఫోన్లు మాత్రం చేసేవాడు.

అతనెంత బిజీ డాక్టరో నాకు తెలుసు. భోంచెయ్యడానిక్కూడా టైముండదని రామయ్య బాధపడుతూంటాడు కూడా.

ఆరోజు భోంచెయ్యగానే తలనొప్పిగా వుందంటూ మంచం ఎక్కేశాడు కిరీటి. రామయ్య అందించిన పాలు తాగి నేనూ పడక చేరాను. అయితే పదకొండు దాటినా రెప్పలు మూతపడలేదు. ఓసారి పక్కనే పడుకున్న కిరీటికేసి చూశాను. ముఖం తప్ప మొత్తం ముసుగు బిగించేశాడు. విశా లమైన తెల్లని నుదిటిమీద తుమ్మెద రెక్క ల్లాంటి ముంగురులు పడి అల్లరి చేస్తు

న్నాయి. ఒత్తయిన నల్లని మీసకట్టు కిరీటి అందాన్ని మరింత పెంచింది. అలసిపోయిన కళ్లలో సైతం ఒకలాంటి ఆకర్షణ చోటు చేసుకుంది.

కిరీటిని చూస్తుంటే నా మనసు పొంగిపోయింది. "సినీ హీరోలని తలదన్నేలా వుండే నా కిరీటిని చూస్తే ఏ ఆడపిల్ల మనసు చెదరదు? " అనుకున్నాను గర్వంగా. మూసివున్న ఆ కనురెప్పలమీద సున్నితంగా ముద్దుపెట్టుకుని మెల్లగా లేచాను. షాల్ ఒంటినిండా కప్పుకున్నాను. నాకాళ్లు అప్రయత్నంగా బాల్కనీకేసి నడిచాయి.

చలిగాలి రివ్వున వీచి ఒణికించింది. అయినా లోపలికి రాలేదు. సముద్రపు హోరుని వింటూ వెన్నెల కిరణాలలో సముద్రుణ్ణి చూస్తూ నిల్చున్నాను. మనసంతా జయే నిండిపోయాడు.

మనసులో ఎన్నో ఆలోచనలు కందిరీగల్లా ముసిరి హృదయభారాన్ని పెంచుతున్నాయి. చంద్రుడికేసి పరిశీలనగా చూశాను. ఆ చంద్ర బింబంలో కూడా జయ రూపమే. కనిపిస్తోంది చిరునవ్వులు చిందిస్తూ.

"మృత్యూ!... నీదెంత మంచి మనసు? నీకెంత క్షమాగుణం? ... ఇలాంటి ప్రియనేస్తాన్ని నేనిన్నాళ్లూ ఎలా మర్చిపోయాను? ... నిజంగా మర్చిపోయానా! లేదు. జీవన ప్రవంతిలో కొట్టుకుపోతూ గతాన్ని కాస్త పక్కకి పెట్టాను! అంతే!" అని నన్ను నేను సమర్థించుకున్నాను.

ఇప్పుడు ఎగసి పడుతున్న సముద్రాన్ని చూస్తుంటే గతమంతా నా కళ్ళముందు నిల్చినట్టుంది.

బామ్మ బుజ్జగింపులు, అమ్మ మందలింపులు, నాన్న అభినందనలు, అత్త గారాబం, కిరీటి, జయల ఆత్మీయత అన్నీ సినిమారీళ్ళలా కనిపిస్తున్నాయి.

చలిగాలికి ఒళ్ళంతా కొంకర్లు పోతున్నట్టనిపించింది, మెల్లగా లోపలికొచ్చి తలుపులు బిగించి టేబిల్ ముందు కూలబడ్డాను. టేబిల్ మీదున్న పెన్ను పేపర్ను ఆహ్వానంగా ఆహ్వానించాయి.

మాది కృష్ణాతీరాన వున్న ఓ చిన్న పల్లెటూరు. ఆ పల్లె మున్నూట అరవై అయిదు రోజులూ పచ్చని పొలాలతోనూ, చెట్లతోనూ, నిండుగా వుండే తటాకాలతోనూ కళకళలాడుతూ వుండేది. చెరువుల్లో ఎరుపు, తెలుపు, నీలం రకరకాల కలువపూలు పూసి చూపరులని ఇట్టే ఆకర్షించేవి.

మా ఊరి చెరువులన్నింటిలోను ధర్మచెరువు చాలా పెద్దది. అందులోని నీరు స్వచ్ఛంగా వుండేది. అవే ఆ వూరి జనం తాగడానికి వుపయోగించేవారు.

చెరువుగట్టున వేణుగోపాల స్వామి ఆలయం చాలా ప్రసిద్ధి చెందింది. ధర్మ చెరువన్నా, ఆ ఆలయం అన్నా నాకెంతో ఇష్టం. నాకనేమిటి నా ఫ్రెండ్సందరికీ ఇష్టమే.

ఆ పల్లెలో మా నాన్న ఓ పాటి భూకామందు. పెద్ద మండువా ఇల్లు, కాస్త దూరంగా పశువుల కొట్టం, వీధిలో ఆకాశాన్నంటేలా వున్న పురులు మా వైభవాన్ని చాటుతుండేవి.

మా బామ్మకి మా నాన్నకాక ఇంకో సంతానం మా అత్త సుభద్ర. మా మామయ్యది కూడా వ్యవసాయమే. వాళ్లు మా వెనక వీధిలో వుండేవాళ్ళు. మా నాన్నకి నేనొక్కతినే సంతానం. అలాగే మా అత్తక్కూడా ఒక్కడే సంతానం. వాడే కిరీటి.

అప్పుడు నాకు అయిదేళ్ళు. కిరీటికి ఎనిమిదేళ్ళు. నేను పుట్టిన వెంటనే నన్ను కిరీటి భార్యగా అనౌన్స్ చేసేసిందట మా బామ్మ.

అయినా నేను కిరీటిని బావా అని ఏనాడూ పిలవలేదు. సరికదా ఒరేయ్! అరేయ్ అంటూ పిల్చేదాన్ని. "తప్పమ్మా! బావని అలా పేరుపెట్టి పిలవకూడదు. ఎంచక్కా 'బావా' అని పిలు" అని చాలా మంది నాకు హితబోధలు చేసేవాళ్ళు అయినా నేను పట్టించుకోలేదు. కనీసం



'ఒరేయ్' అని పిలవడమైనా మానెయ్యి అని బతిమాలారు. అయినా ఫలితం శూన్యం.

నేను చిన్నతనంనించీ మహా మొండి దాన్ని. నాకు తోచింది తప్ప ఎవరేం చెప్పినా వినేదాన్ని కాదు.

నాకు చాలా మంది ఫ్రెండ్స్ వుండేవాళ్ళు. చిత్రం ఏమిటంటే నాకన్నా పెద్దవాళ్ళక్కూడా నేనే లీడర్ని. ఎంతమంది ఫ్రెండ్స్ వున్నా నా డియరెస్ట్ ఫ్రెండ్ కిరీటి, మృత్యుంజయ. ముగ్గురం కలిసి ఎన్నిరకాల అల్లర్లు చేశామో చెప్పాలంటే పది గ్రంథాలవుతాయి.

జయ మా పక్కింటి డాక్టర్ మామయ్యగారి ఏకైక పుత్రుడు. నాకన్న రెండేళ్ళు పెద్దవాడు. కాస్త అమాయకంగా వుంటాడు. అతని పేరు మృత్యుంజయ అయినా 'మృత్యూ' అని పిల్చే ఏకైక ప్రాణిని నేనే. ఆ పిలుపుకి అతనే కాదు. చాలామంది అభ్యంతరం పెట్టారు. కానీ నా పద్ధతి మార్చుకోలేదు. క్రమేపీ అంతా అలవాటు పడిపోయారు. అంతేకాదు. నా పేరు యమున అయినా మున్నీ అని పిల్చేదీ అతనొక్కడే. మా ముగ్గుర్నీ "విడిపోని మిత్రత్రయం" అని అంటూండేవాళ్ళు.

ఆలయంతోటలోని జామకాయలు దొంగిలించినా, కరణంగారి దొడ్లోని దానిమ్మకాయలు తస్కరించినా, ప్రెసిడెంటు గారి మామిడి తోపులోని చెట్లెక్కి ఒడినిండా కాయలు కోసుకుని ఉప్పూ కారం అద్దుకుని తిన్నా ముగ్గురం కలిసే చేసేవాళ్లం.

కిరీటికి, జయకీ ఈతవచ్చు. ధర్మ చెరువులో దిగి కలువకాయలు కోసి తెచ్చేవాళ్ళు. ఒడ్డున కూర్చుని ముగ్గురం కలసి తినేవాళ్ళం.

ఇవన్నీ తెలిసిన మా బామ్మ-

"నా తల్లీ, చిన్నా! నువ్వింకా చిన్న పిల్లవి. చెరువులోకి దిగద్దమ్మా!" అంటూ చెర్లో దిగితే ఎంత ప్రమాదమో వర్ణించి చెప్పేది.

"నేనంత పిచ్చిదాన్నేంటి బామ్మ! ఈత రాందే చెరువులోకి ఎలా దిగుతాను. ఈత నేర్చుకున్నాక దిగుతాను!" అనేదాన్ని చాలా తేలిగ్గా.

"అయితే ఈత నేర్చుకుంటావా? " కంగారుగా అంది బామ్మ.

"మరి నేర్చుకోవాలిగా..."

"అదికాదు తల్లీ! ఆడపిల్లలకి అవన్నీ అనవసరం. ఈతలూ, కబడ్డీలు, గోలీలాటలూ ఇవన్నీ మగపిల్లలాడుకునే ఆటలు..." అంటూ నచ్చచెప్పాలని చూసేది బామ్మ.

ఆవిడ చెప్పినవన్నీ నేను ఆడే ఆటలని ఆవిడకి తెలుసు. నేను నవ్వేసేదాన్ని.

అసలు నవ్వు తప్ప నాకు ఏం చేతకాదని మా బామ్మ నమ్మకం. ఒకోసారి.

"అయిందానికీ, కానిదానికీ ఏమిటా నవ్వు? నవ్వు నాలుగిందాల చేటు!" అంటూ విసుక్కునేది కూడా. అయినా నాకు ఒకళ్ళు చెప్తే వినే స్వభావం లేదే!

ప్రతి ఆదివారం బొమ్మల పెళ్ళిళ్లు చెయ్యడం నాకలవాటు.

ఆ పెళ్ళికి మాత్రం మా ఫ్రెండ్సంతా హాజరయ్యేవారు. కొందరు మగపెళ్ళివారుగా, కొందరు ఆడపెళ్ళివారుగా విడిపోయే వాళ్ళం. మా ఫ్రెండ్స్ దేవకి, చంద్రావళి, అన్నపూర్ణ, సుబ్బులు... సుబ్బులు అసలు పేరు సుబ్బలక్ష్మి. కానీ అంతా దాన్ని సుబ్బక్క అని పిల్చేవాళ్ళు. అది దానికి నచ్చక నాగకుమారి అని పెట్టుకుంది. అయితే పాపం ఎవరు ఆ పేరుతో దాన్ని పిల్చేవాళ్ళు కాదు. చివరికి సుబ్బులు సెటిలయింది. సుబ్బులు మాకన్నా కాస్త పెద్దది. ఆడపిల్లలమంతా ఓ కండువానో, టవలో తెచ్చుకుని పైటలా వేసుకుని పెద్దరికం వెలగబెట్టే వాళ్ళం.

చిత్రం ఏమిటంటే మా బొమ్మలాటలో కిరీటి, జయా కూడా పాల్గొనే వారు.

"ఛీ! ఇది ఆడపిల్లలాడుకునే ఆట. ఇందులోకి మగపిల్లలు రాకూడదు" అనేది సుబ్బులు.

"ఏం మా కబాడీ, గోలీల్లాంటి ఆటలు మీరు ఆడ్డం లేదా! అందుకే మేమూ మీ ఆటల్లో పాల్గొంటాం" అంటూ పేచీకి దిగే వాడు కిరీటి.

"ప్లీజ్ మున్నీ! నువ్వయినా చెప్పు! మేము- ఎంచక్క మీ బొమ్మల పెళ్ళిలో ఉంటాం" అని బతిమాలే వాడు జయ.

వాణ్ని చూసే నాకు జాలేసేది.

"ఓ!కే! నువ్వు ఆడపెళ్ళివారి తరఫున, కిరీటి మగపెళ్ళి వారి తరఫున!" అని హామీ ఇచ్చేదాన్ని.

అప్పట్నించీ అందరం బొమ్మలపెళ్ళి ఘనంగా చేసే వాళ్ళం. పెళ్ళి భోజనాలుగా మరమరాలు, పటిక బెల్లం, కజ్జూరపళ్ళు లాంటివి తెచ్చుకునే వాళ్ళం.

ఉత్తిత్తి బాజాలూ, ఉత్తుత్తి మంత్రాలూ చదివే వాళ్ళం. మా సుబ్బులు మాత్రం-

"మాంగల్యం తంతునా... తంతునా... తంతునా... అని ఆగిపోయేది తరవాతిది రాక.

"ఇంక తన్నద్దులే సూత్రం కట్టించెయ్యి!" అనే వాడు కిరీటి నవ్వుతూ. సుబ్బులు ఉడుక్కునేది.

మొదట్లో సిగ్గుపడ్డా తర్వాత తర్వాత మరి కొంత మంది మగపిల్లలు కూడా వచ్చే వారు మా బొమ్మల పెళ్ళికి. ఇవన్నీ చూశాక నాకో బ్రిలియంట్ అయిడియా వచ్చింది.

అంతే! గభాల్న లేచి కూర్చున్నాను.

"ఏవిటే అప్పుడే లేచావ్? రోజూ మేలుకొలుపులు పాడితే గానీ మంచం దిగవు. ఇవాళేమైంది? ఆదివారం స్కూల్ కూడా లేదుగా?" అంది అమ్మ గదిలోకి తొంగి చూస్తూ.

"ఏమందిలే!" అంటూ చకచక పళ్ళు తోముకుని జుట్టు పైపైనే దువ్వుకుని వరండాలోకొచ్చాను. అప్పటికింకా పూర్తిగా తెల్లవారనే లేదు. అంత తొందరగా లేచినందుకు బామ్మ కూడా బోల్డు ఆశ్చర్యపోయి-

"నాతల్లి! నాతల్లి! ఎలాగూ లేచావు కదా. తోటలోకెళ్ళి నాలుగు పూలు కోసుకు రామ్మా!" అంది పూలసజ్జ అందిస్తూ. నాకు ఎక్కళ్ళేని చిరాకూ వచ్చింది.

"నీకు పూలుకోసివ్వడానిక్కాదు నేనింత పెంద్రాళే లేచింది" అంటూ పరిగెడుతున్న

నన్నాపేసింది బామ్మ.

"ఇంకా మీ స్నేహితులెవరూ లేవరే! మా అమ్మవి కదూ! పూజకి వేళయింది నాలుగు పూలు కోసుకురామ్మా!" అంది బతిమాలుతూ. ఇంక తప్పేదేం వుంది? విసురుగా సజ్జ అందుకుని తోటలోకి పరిగెత్తి చకచకా కొన్ని పూలు తీసుకొచ్చి బామ్మకిచ్చి బైటపడ్డాను.

అయితే అప్పుడే మా పెద్ద పాలేరు సంజీవి ముసిముసిగా నవ్వుతూ పలకరించాడు.

"అబ్బబ్బ! అందరికీ నాగురించే కావాలి. నా గురించి నీకెందుకురా! నువ్వెళ్ళి పన్లు చూసుకో" అన్నాను విసుగ్గా.

"...మీరెళ్ళేది తోటలో దాలి దగ్గరికైతే ఎల్లద్దండి!" అన్నాడు తాపీగా. నా గుండె ఝల్లుమంది.

"దాలేంటిరా? " అన్నాను సాధ్యమైనంత అమాయకంగా.

"అదేనండీ! ఉలవదాలి! రేత్రి బాగా పొద్దుపోయాక ఏశాను. ఉలవలు ఇంకా ఉడకలేదండి!" అన్నాడు చిద్విలాసంగా నవ్వుతూ. నా వెన్నులోంచి ఒణుకు మొదలయింది. ధైర్యం తెచ్చుకుని దబాయించబోయాను. అయితే వాడు గొంతు కాస్త పెంచి-

"ఇదిగో అమ్మాయిగోరూ! నాకన్నీ తెలుసండి. రోజూ దాలికాడికెల్లి తాటిమట్టతో ఉడికే ఉలవల్ని తీసుకుతినడం నేను సూస్తానే వున్నాను" అన్నాడు.

అంటే వీడు నన్ను బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడన్నమాట. అంటూ పళ్ళు నూరుకున్నాను. తర్వాత బతిమాలి ఆ విషయం ఎవరికీ చెప్పనని మాట తీసుకున్నాను. ఎవరికీ, దేనికీ భయపడని నేను వాడి మాటకి భయపడేసరికి వాడు గర్వంగా తలెగరేసి-

"నేనెందుకు సెప్తానమ్మాయిగోరూ! కాకపోతే బామ్మగారు గన సూత్తే కొంపలారిపోతాయి, అద్దూసుకోండి" అంటూ వెళ్ళిపోయాడు.

నాకెక్కళ్ళేని నీరసం వచ్చేసింది. ఉత్సాహమంతా చల్లారిపోయింది. నిజానికి నేను దేనికీ భయపడను. కానీ ఇది మామూలు విషయం కాదే!

మా బామ్మకి ఆచారం ఎక్కువ. పాలేళ్ళు తెచ్చిన నీళ్ళు ముట్టుకోను కూడా ముట్టుకోదు. మేం మాత్రం స్నానాలు ఆ నీళ్ళతో చెయ్యొచ్చు. తాగడానికి మాత్రం వంట బ్రాహ్మడు తెచ్చిపోసిన నీళ్ళే తాగాలి. ఓ పేద బ్రాహ్మడు పదిళ్ళలో నీళ్లుపోసి పొట్ట పోసుకుంటాడు. కాల్చిన తేగలుగానీ, తంపట వేరుశనక్కాయలుగానీ కొని తినకూడదు. అబ్బో! ఇలాంటివి చాలా ఉన్నాయి. ఈ విషయంలో బామ్మ ఎవరు చెప్పినా వినదు. నాకేమో ఉడికిన ఉలవలంటే చాలా ఇష్టం.

మాకు నాలుగు జతల ఎడ్లు వుండేవి. వాటి కోసం పాలేళ్లు తోటలో ఓ మూలగా పెద్దగొయ్యి తీసి మరింత పెద్ద బానలో ఉలవలు, వడ్లు కలిపిపెట్టి తంపి పెట్టేవారు. రాత్రిపెడితే అవి తెల్లారేసరికి చక్కగా ఉడికి వుంటాయి.

ఓ రోజు తోటలో ఆడుకుంటూ ఉలవల వాసన వచ్చి జిహ్వా చాపల్యం ఆపుకోలేక, అతిప్రయాసగా బాన మీద మూతతీసి, కొన్ని పేపర్లు తెచ్చి ఆ ఉడికిన ఉలవల్ని తీసుకుని, వడ్లు, ఉలవలు వేరుచేసి అందరం తలా కాసిని ఉలవలూ తినేశాం. వాటి రుచి మరిగిన మేం తరచూ తీసుకుని తినే వాళ్ళం. ఈ వెధవ అదెప్పుడు చూశాడో. ఇప్పుడు నిలదీశాడు. ఈ సంగతి మా బామ్మకి తెలిస్తే చంపేస్తుంది. అందుకే వాణ్ని బతిమాలి నోరు మూయించాను.

అయినా నాకు భయమే. ఎప్పుడు ఈ సంగతి ఇంట్లో చెప్పేస్తాడో ఏమో అని, వాడు చుట్ట కాలుస్తాడు. చుట్టకి డబ్బులిస్తానని చెప్పాలి! అనుకుంటూ వెనక్కి తిరిగాను.

అదృష్టవశాత్తు అప్పుడే అటుగా వచ్చాడు కిరీటి. వాణ్ని చూడగానే నాకు ప్రాణం లేచొచ్చినట్టయింది. సంజీవి సంగతి చెప్పేశాను.

వాడు నాకన్నా ఎక్కువ హడిలిపోయాడు.

"అమ్మో! అమ్మమ్మకి తెలిస్తే వాతలు పెడుతుంది!" అన్నాడు భయంగా. తర్వాత ఒకళ్ళకొకళ్ళం ధైర్యం చెప్పుకున్నాం.

"ఎక్కడికెళ్తున్నావింత పొద్దున్నే? " అన్నాడు కిరీటి.

అప్పుడు గుర్తొచ్చింది నా అయిడియా గురించి. మళ్ళీ ఉత్సాహం తన్నుకొచ్చింది.

"నాకో బ్రిలియంట్ అయిడియా వచ్చింది కిరీటీ? " అన్నాను గర్వంగా.

"ఏంటది? " కుతూహలంగా అన్నాడు కిరీటి.

"ఇప్పుడు చెప్పను. పదింటికల్లా మన బృందాన్నంతటినీ వేణుగోపాలస్వామి గుడి దగ్గరికి రమ్మను. అక్కడ చెప్తాను" అన్నాను ఇంటికేసి నడుస్తూ. కిరీటి సణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

"ఏవిటి అంత హడావిడిగా వెళ్ళి ఇట్టే వచ్చేశావ్? నీ ఫ్రెండ్సంతా గాఢనిద్రలో వున్నారా? " అన్న అమ్మ మాటలు వినిపించుకోకుండానే నా గదిలోకెళ్లిపోయాను.

పదిగంటలు కాకుండానే నీట్‌గా రెడీ అయి బైటికొచ్చేశాను. అప్పటికే జయతో సహా అందరూ అక్కడికి చేరుకున్నారు. గుడి వెనక తోటలో అలా అత్యవసర సమావేశాలు జరుపుకోవడం మాకలవాటే. పూజారి గారు కూడా ఏమీ అనరు. అందరి మొహాలూ పరిశీలనగా చూశాను. నేనేం చెప్పబోతున్నానా అన్న కుతూహలం అందరి మొహాల్లోనూ కనిపించింది.

"చెప్పు" విసుగ్గా అన్నాడు కిరీటి.

"మనం ప్రతి ఆదివారం బొమ్మల పెళ్ళిళ్ళు చేస్తున్నాం కదా? " అంటూ క్షణం ఆగాను.

"అయితే? " అసహనంగా అన్నాడు జయ.

"ఇంక మనం బొమ్మల పెళ్ళిళ్ళు చెయ్యొద్దు!"

"అదేంటి? " తుళ్ళిపడ్డారంతా.

"ఏవిటి? మీ బామ్మ వద్దందా? " అంది దేవకి అనుమానంగా. బామ్మ మాట తప్ప ఇంకెవరి మాటా విననని దానికి బాగా తెలుసు.

"కాదు ఈ బొమ్మల పెళ్ళిళ్ళతో బోర్ కొట్టేస్తోంది. ఎంచక్కా మనుషులకే చేసుకుంటే" ఉత్సాహంగా చెప్పాను అందరికేసీ చూస్తూ.

"భలే... భలే! చాలా బావుంటుంది" ఉత్సాహంగా అరిచారు మగపిల్లలు.

"కానీ అది నిజంగా పెళ్ళి అయిపోతుందేమోనే" భయంగా అంది దేవకి.

"ఛ! బొమ్మల పెళ్ళి నిజం పెళ్ళి ఎలా అవుతుంది? మనం సినిమాల్లో చూడ్డం లేదూ! ఆ పెళ్ళిళ్ళన్నీ నిజం పెళ్ళిళ్ళయిపోతున్నాయా? " అన్నాను దబాయింపుగా.

"నిజమే!..." అంది అన్నపూర్ణ.

తర్వాత కాస్సేపు తర్జనభర్జనలయ్యాయి. చివరికి అంతా నాకే ఓటేసేశారు.

"అయితే ఇవాల్టి పెళ్ళికొడుకు ఎవరు? " అన్నాను

"నేను!" అన్నాడు కిరీటి

"మరి పెళ్ళికూతురు!"

"నేను" అంది అన్నపూర్ణ

"ఛc నాకన్నపూర్ణ వద్దు!"- మొండికేశాడు కిరీటి

"ఇదిగో! నీకు నచ్చినమ్మాయిని చేసుకోవడానికిది నిజం పెళ్ళికాదు. బొమ్మల పెళ్ళి! నువ్విలా పేచీపెట్టావంటే అసలు నిన్నీఆటలోంచే తీసేస్తాం" అంటూ బెదిరించేసరికి అయిష్టంగానే ఒప్పుకున్నాడు కిరీటి.

నేను అన్నపూర్ణ తల్లిగానూ, జయ తండ్రిగానూ, కిరీటి తల్లిదండ్రులుగా దేవకీ, బుజ్జి అనే మరో అతనూ తయారైపోయాం. ఎప్పటిలా సుబ్బులు పురోహితుడైపోయింది.

ఈరకం పెళ్ళి మా అందరికీ నచ్చడం వల్ల ప్రతి ఆదివారం ఈ పెళ్ళి తంతు జరు

గుతూనే వుండేది.

ఇది ఆదివారమే ఎందుకు పెట్టుకున్నామంటే స్కూల్ కి శలవని కాదు. ప్రతి ఆదివారం మా మా పెద్దలు- అంటే మా నాన్న మిగతా వాళ్ల నాన్నలూ పేకాటలోనో, రాజకీయ వాదులాటలోనే బిజీగా వుంటారు. అమ్మా వాళ్లు ఏ జంతికలు చేసే మూడ్ లోనో వుంటారు. అయినా మా పెళ్ళిళ్ళ గురించి అందరికీ తెలుసు. చిన్నపిల్లల మేగా. పెద్దగా పట్టించుకునేవారు కాదు. ఇంకా మాకు స్వేచ్ఛకేం తక్కువ!

★ ★ ★

**మా** స్కూల్ గురించి తల్చుకుంటే ఇప్పటికీ నవ్వొస్తుంది. స్కూల్ అనబడే అది ఓ గొడ్లపాకలా వుంటుంది. మా టీచర్ సత్యం మాస్టారు కేవలం స్కూల్ మాస్టారే కాదు. మా ఊరి పురోహితుడు కూడా. తద్దినాల దగ్గర్నించి బారసాలల దాకా ఆయన చేతుల మీదుగానే జరుగుతాయి. అసలాయన మాకు పాఠాలు చెప్పిందెప్పుడూ లేదు. ఏ ఇన్స్పెక్టరో వచ్చినపుడు మాత్రం పిల్లలందర్నీ ఓ క్రమబద్ధంగా కూర్చోపెట్టి కాస్త నీట్ గా తయారైవచ్చేవాడు.



ఇంకో చిత్రమేమిటంటే అక్కడున్న స్టూడెంట్స్ పేర్లు ఏవీ కరెక్ట్ కాదు. ఆ స్కూల్ ని గురించి తెలుసుకున్న చాలామంది తమ పిల్లల్ని పొరుగూళ్ళోని స్కూళ్ళలో చేర్చేశారు. అయినా వాళ్ళ పేర్లు మాత్రం మా స్కూల్ రిజిస్టర్‌లోంచి తీసెయ్యలేదు. ఇన్స్పెక్టర్ వచ్చినప్పుడు మాత్రం ఏ గొడ్లు కాచుకునే పిల్లల్నో నీట్ గా డ్రస్ చేయించి వాళ్ళ స్థానాల్లో కూర్చోపెట్టి అటెండెన్స్ పలికించేవాడు. ఆ ఇన్స్పెక్టర్స్ వాళ్లు కూడా ఆయన టిఫిన్‌గా పెట్టిన గారెలు, ఆవడలు, సున్నుండలులాంటివి తృప్తిగా తిని, మాస్టార్ని ఎలాంటి ఇబ్బంది పెట్టకుండానే ఇన్స్పెక్షన్ ముగించుకుని వెళ్ళిపోయేవారు.

ఓసారైతే ఏనుగులాంటి స్థూలకాయుడైన మాస్టారు సైతం చిట్టెలుకలా ఒణికిపోయి, నోటికొచ్చినట్టు వాగి పిల్లల ముందు ఫూలై పోవాల్సొచ్చింది.

ఆ రోజు ఇన్స్పెక్షన్ జరగబోతోంది. ముందురోజు మాస్టారు చెప్పిన విధంగానే విద్యార్థుల వేషం కట్టి వచ్చారు గొడ్లు కాచుకునే పిల్లలు, చిన్న పాలేళ్ళు.

వాళ్ళందరికీ ఎవరి పేర్లేమిటో, ఆ పేరు పెట్టి పిలిస్తే ఎలా పలకాలో గంట, రెండు గంటలు ట్రైనింగ్ ఇచ్చారు మాస్టారు బందరు లడ్డూలు పెట్టి మరీ.

మా స్కూల్లో అయిదు క్లాసులున్నా గది మాత్రం ఒకటే. ఆ పాకలోనే తలో వరసా కూర్చునేవాళ్ళం.

ఇన్స్పెక్టర్ గారెలా వుంటాడో, ఎలాంటి ప్రశ్నలు వేస్తాడో, మా బామ్మన్నట్టు ఛండశాసన ముండావాడో అని అందరం హడిలిపోతున్నాం. మా మాస్టారి మొహంలో ఒకటే టెన్షను!

అనుకున్న సమయం రానే వచ్చింది. ఇన్స్పెక్టర్ గారొస్తున్న వార్త విని, వూడిపోతున్న పంచ తిరిగి బిగించుకుంటూ బైటికి పరిగెత్తారు మాస్టారు.

ఆ వెళ్ళడం వెళ్లడం గంట తర్వాత వచ్చారు ఆయనతో కలిసి. ఇప్పుడాయన మొహంలో అంత కంగారు లేదు. ఆయన్నీ, ఆయాసపడుతున్న ఇన్స్పెక్టర్ గారినీ

చూస్తుంటే, మాస్టారు ఆయనకి పీకల దాకా సున్నుండలూ వగైరాలు కొసరి కొసరి మరీ తినిపించారని అర్థమై పోతుంది.

ఇన్స్‌పెక్టర్ ఓసారి క్లాసంతా (పాకంతా) కలయ చూశాడు. రాక్షస కాకిలా ఉండి నెత్తురు ముద్దలాంటి కళ్ళతో చూసేసరికి పిల్లలందరూ బిగుసుపోయినట్టయ్యారు. నేను కూడా.

పేలు చూసుకుంటున్న చంద్రి, సుబ్బి చాచిన కాళ్ళు మడవకుండానే నిలువు గుడ్లేశారు. పులి మేక ఆడుతున్న పిల్లలు ఆ గళ్ళు కనిపించకుండా పలకలు కప్పేశారు.

ఇన్స్‌పెక్టర్ ఒక్కొక్కరి దగ్గరికీ వచ్చి వారికేసి పరిశీలనగా చూస్తుంటే మా పెద్ద పాలేరు మనవడు నాలుగేళ్ళ వెధవ లాగూ తడిపేసుకున్నాడు.



## వేరే కూర వండుకోవచ్చు కదా

ఒకావిడ పోలీస్ స్టేషన్‌కు వచ్చింది. ఆలుగడ్డలు తెస్తానని మార్కెట్‌కు వెళ్లిన తనభర్త జాడ రెండురోజులైనా దొరకలేదని చెప్పింది. ఆయన తప్పిపోయి ఉంటాడేమోనని అనుమానం వ్యక్తం చేసింది.

వెంటనే స్టేషన్ ఇన్‌స్పెక్టర్, 'ఇప్పుడేమైందమ్మా.. ఆలుగడ్డలు కాకపోతే వేరే కూర వండుకోవచ్చుకదా' అన్నాడు విసుగ్గా.

ఇదంతా ఆయన గమనించ లేదు గానీ మా మాస్టారు మాత్రం గమనించి హడిలిపోయి అందరికేసీ కోపంగా చూశాడు.

ఇన్స్‌పెక్టర్ 'వుఫ్' అంటే ఎగిరిపోయే నారిగాడి దగ్గరికొచ్చి ఆగాడు. వాడు నిలువెల్లా ఒణికి పోతుంటే.

"లేవరా!" అన్నాడు మాస్టారు గర్జించినట్టు.

వాడు గభాల్ని లేచి నిల్చున్నాడు.

"నీ పేరేమిటి?' అన్నాడు ఇన్స్‌పెక్టర్ హుందాగా.

"నారిగాడు... అహఁ కాదు. రామ... కాదు కాదు రంగరాజు." అన్నాడు వాడు మరింత హడిలిపోతూ.

అనుమానంగా చూశాడు ఇన్స్‌పెక్టర్. మా టీచర్‌కి ముచ్చెమటలు పోశాయి.

"హి... హి... హి... వాడిక్కాస్త కంగారెక్కువ. అదీగాక రవంత నత్తి.' అన్నాడు మాస్టారు అనవసరంగా నవ్వేస్తూ.

"ఐ సీ!..." అంటూ మరొకడి దగ్గరికొచ్చాడు ఇన్స్‌పెక్టర్.

వాడు లేచి నిల్చోగానే "కీచకుణ్ణి ఎవరు చంపారు?" అన్నారాయన.

వాడు బిత్తర పోయాడు.

"చెప్పు! కీచకుణ్ణి ఎవరు చంపారు?" ఈసారి కళ్లెర్ర జేసి మరీ అడిగాడు ఇన్స్‌పెక్టర్.

వాడికి ఏడుపొచ్చేసింది.

"నాను కాదండి! సత్తిపెమానంగా నాను కాదండి!" అంటూ బావురుమన్నాడు.

ఇన్స్‌పెక్టర్ మాస్టారికేసి చూశాడు.

ఆయన మరింత కంగారు పడిపోయాడు. ఏం మాట్లాడుతున్నాడో తెలియని పరిస్థితి!

"లేదు సర్! వీడేం చంపుతాడు? వట్టి అర్భకపు వెధవ! అందులోనూ వీడు బల్లిని చూసి కూడా భయపడతాడు!" అన్నాడు కండువాతో చెమటలు తుడుచుకుంటూ

ఇన్స్‌పెక్టర్ మా చిన్న పాలేరు రంగడి దగ్గరికొచ్చాడు. వాడికి పదిహేడేళ్ళుంటాయి. బలంగా, దృఢంగా ఉంటాడు.

వాడు లేచి నిల్చోగానే అదే ప్రశ్న వేశాడు ఇన్స్పెక్టర్.

"అయ్ బాబోయ్! ఆ రోజు నేనీ ఊళ్ళోనే లేనండి! మా అయ్‌గోరు ఎరువులు తెమ్మంటే పట్నం ఎలిపోనాను!" అన్నాడు దాదాపు ఏడుస్తున్నట్టు.

మళ్ళీ టీచర్ కేసి చూశాడు ఇన్స్పెక్టర్. ఈ సారి ఆయన మతే పోయింది

"లేదు సర్! కచ్చితంగా వీడే చంపుంటాడు. చూడండి. ఆ కళ్లలో నేరం చేశానన్న భయం స్పష్టంగా కనిపించడం లేదూ? " అనేశాడు.

ఇన్స్పెక్టర్ పెద్దగా నవ్వాడు. మాస్టారితో సహా అందరం వింతగా చూశాం ఆయన కేసి.

"లేకపోతే ఏవిటయ్యా! ఇక్కడున్న పిల్లలందరి మొహాల్లోనూ భయం కనిపిస్తోంది. అంత మాత్రాన వీళ్లందరినీ దోషులనగలమా? అయినా సీతమ్మ వారిమీదే కన్ను వేసిన కీచకుణ్ని ఇంత చిన్న పిల్లలు ఏం చంపగలరయ్యా, ఎవడో రాక్షసుడే చంపుంటాడు!" అన్నాడు తేలిగ్గా ఇన్స్పెక్టర్.

"నిజం! నిజం!" ఆనందంగా అన్నాడు మాస్టారు.

"కిరీటీ, కీచకుడు కన్ను వేసింది ద్రౌపది మీద కదా... ఈయన సీతమ్మవారి మీదంటాడేవిటి? " గుస గుసగా అన్నాడు జయ.

"ష్! అదంతే! మాట్లాడకు. లేకపోతే నువ్వే చంపావని అన్నా అనగలరు!" అన్నాడు కిరీటి.

ఇలాంటి ప్రశ్నలే మరి కొన్ని వెయ్యబోతుంటే

"సర్! చాలా టైమయింది. తమ కోసం వేడి వేడి పెసరట్లు, ఉల్లిపాయ బజ్జీలూ రెడీగా ఉన్నాయి. చల్లారి పోతాయి పదండి!" అన్నాడు మాస్టారు.

పెసరట్లు, బజ్జీలు పేరు వినగానే ఇన్స్పెక్టర్ నోట్లో నీళ్లూరాయి. ఈసారొచ్చేసరికి బాగా చదవండి" అని హెచ్చరించి మాస్టారితో కలిసి బైటికెళ్ళి పోయాడు.

వెళ్లేవాడు వూరికే వెళ్ళలేదు. వెళ్తూ వెళ్తూ విలన్‌లా కనిపించే వీరిగాడిని మా అందర్నీ కదలనీకుండా చెయ్యమని చెప్పి మరీ వెళ్ళాడు.

వీరిగాడు మంచివాడో చెడ్డవాడో నాకు తెలియదు. గానీ అచ్చం సినిమాల్లో విలన్‌లా ఉంటాడు. అందుకే అందరికీ వాడంటే చచ్చే భయం. పిల్లలు నిద్ర పోక పోయినా మారాం చేసినా "వీరిగాణ్ని పిలుస్తాం" అని బెదిరించేవారు కూడా పెద్దలు. అంత పాపులర్ వాడు.

ఇంక మాకు నోట మాటేంవస్తుంది? కిక్కురుమనకుండా కూర్చున్నాం. వీరిగాడు... ఓ బీడీ ముట్టించి గ్రామంలో చతికిల పడుతూ తలెత్తకుండా చదవమని మాకు ఓ ఆర్డరు పారేసి కళ్ళు మూసుకున్నాడు.

అంతసేపు కుదురుగా ఏనాడూ కూర్చోని రంగడు, తదితరులు బుర్ర గోక్కుంటూ, సణుక్కుంటూ కూర్చున్నారు. మనసులో మాస్టార్ని, వీరిగాణ్ణి తిట్టుకుంటూనే. నాకు మాత్రం మాస్టారి కంగారు గుర్తుకొచ్చి చచ్చే నవ్వొస్తోంది. నవ్వుతుంటే జయ, కిరీటి కూడా నవ్వద్దన్నట్టు సైగ చేశారు.

గంట తర్వాత మెల్లగా తొంగి చూశాడు వీరిగాడు. అందరం కిమ్మనకుండా కూర్చోవడంతో ఓ సారి గర్వంగా తలెగరేసి-

"నేనేం అనన్లే. మెల్లగా మాట్లాడుకోండి." అన్నాడు దయ తల్చినట్లు. వాడికీ మా పరిస్థితి చూస్తే జాలేసినట్టుంది. ఆ మాత్రం ఛాయిస్ ఇచ్చేసరికి గుసగుసగా మాట్లాడ్డం మొదలు పెట్టి కబుర్లలో పడిపోయాం. పేలు చూసుకోవడాలు, పులి మేక ఆడుకోవడాలూ మొదలయ్యాయి.

మా బృందం మాత్రం మాస్టారి మీద పగ ఎలా తీర్చుకోవాలా అన్న ఆలోచనలో పడ్డాం. మళ్ళీ మాస్టారు వూడి పోతున్న పంచని సరిచేసుకుంటూ, ఆపసోపాలు పడుతూ ఓసారి మాదగ్గరికి వచ్చారు.

అందరం మళ్లీ సైలెంటయిపోయాం.

"సరే! అలాగే కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అని మాతోనూ, జాగ్రత్తగా చూడమని వీరిగాడితోనూ చెప్పి పరిగెత్తాడు. బహుశా ఇన్స్‌పెక్టర్ గార్ని చల్లబరిచి పంపడానికేమో,

మాస్టారు వచ్చి ఇంటికి పొమ్మంటారేమో అని ఆశపడినమాకు నిరాశే ఎదురైంది.

వీరిగాడితో ఆయనేం చెప్పాడో ఏమో, వీరిగాడు పెద్ద ఆఫీసరులా ఫోజు పెట్టి-

"నేనిప్పుడే వస్తాను. మీరెవరూ కదలకండి. ముఖ్యంగా ఆ రంగడూ వాళ్ళు తలెత్తకూడదు.' అంటూ ఓ ఆర్డరు పారేసి బైటికి నడిచాడు. మా అందరికీ పిచ్చి కోపం వచ్చేసింది. రంగడూ వాళ్ళకైతే మరీను!.

వాళ్లటు వెళ్ళగానే పోలోమంటూ లేచారంతా

"నియ్యమ్మ! లడ్డూ లెడతాననీ, పావలా ఇస్తాననీ లాక్కొచ్చి కూకోపెట్టి అణ్ని సంపావ్, ఈణ్ని సంపావ్ అంటాడా? ఈపాలి ఆనపకాయ, పొట్లకాయల కోసం మా ఇంటికి రాకపోతాడా, అప్పుడు ఈయన సంగతీ నాను సూడకపోతానా? " అని గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు రంగడు.

మాస్టారు అరేంజ్ చేసిన వాళ్ళంతా తలో రకంగా మాస్టార్ని తిట్టుకుంటూ వెళ్ళిపోయారు. అసలు స్టూడెంట్స్ మాత్రం మిగిలిపోయారు.

"ఊఁ, ఈ స్కూల్లో చదివితే మనమూ గొడ్లుకాచుకోవాల్సిందే" భారంగా అన్నాడు జయ.

"అవును పంతులేకాదు, ఆ ఇన్స్‌పెక్టర్ కూడా మహాజ్ఞానే" అంది దేవకి.

"నేనింక ఈస్కూల్లో చస్తే చదవను" శపథం చేశాడు కిరీటి. అదే మాటన్నారు బుజ్జి, సుబ్బులు.

"కానీ మనవాళ్ళు పట్నం పంపరే!" దిగులుగా అంది అన్నపూర్ణ.

"మనకి మాత్రం ఈ స్కూల్ బెటర్రా!" దీర్ఘం తీసింది చంద్రావళి.

"ఎందుకు? " అందరం ఒకేసారన్నాం.

"ఇక్కడ చేసిన అల్లరి ఇంకే స్కూల్లో చెయ్యలేముగా? అదీగాక ఇక్కడున్నన్ని శలవులు ఇంకెక్కడా వుండవు!"

"నిజమే! ప్రతి స్కూల్లోనూ సంక్రాంతి శలవులనీ, దసరా శలవులనీ, వేసంగి శలవులనీ వుంటాయి. కానీ మా స్కూల్లో అవి కాక వూడుపు శలవులు, కలుపు శలవులు, కోతల శలవులు. ఇలా చాలా రకాల శలవులు వుంటాయి. అంతేనా. మా మాస్టారింటికి బంధువులొస్తే శలవు. మా మాస్టారు, పెళ్ళాం దెబ్బలాడుకుంటే శలవులు! అంతెందుకు; అసలాయనొచ్చినపుడు మాత్రం మాకు చదువు చెప్పేదెప్పుడు? తద్దినాలో, బారసాలలో వస్తే ఒంటిగంటగ్గానీ రాడు. వస్తూనే ఏ పద్యాన్నో వల్లెవేయమని చెప్పి పెరట్లో వున్న నేరేడు చెట్టుకింద సిమెంటు బెంచీమీద పడుకుని గుర్రుతీస్తాడు. ఆ గుర్రు నాలుగు ఫర్లాంగుల దూరం వినిపిస్తుంది. ఆ టైమ్‌లో మాదే రాజ్యం.

ఆయన రూపం కూడా తమాషాగా వుంటుంది.

పిప్పళ్ళ బస్తామీద ఓ పెద్ద గుండ్రాయి బోర్లించినట్టుంటాడు. చలిమిడి ముద్దలాంటి పెద్దతల మీద పెద్ద పిలక. పిలకంటే మామూలు పిలక్కాదు. గుప్పెడుంటుంది. మూరెడు పొడవుంటుంది.

స్కూల్ కొస్తేనే ఆ పిలక ముడి విప్పి మహారాణి అంతఃపురం పై మేడమీద, తలంటుకున్న జుట్టు ఆరపెట్టుకుంటున్నంత దర్జాగా ఆరబెట్టుకంటూ సిమెంటు బెంచీ మీద కొరుగుతాడు.

మా స్కూలు చిన్నదేగానీ దాని పెరడు మాత్రం పెద్దదే. మాచేతే బంతి, చామంతి లాంటి మొక్కలు నాటిస్తాడు. వాటి పోషణ భారం కూడా మాదే.

ఆయన పిలక చూసినప్పుడల్లా నాకో చిలిపి కోరిక కట్టలు తెంచుకుంటుంది.

వెండిలా మెరిసిపోతున్న ఆ పిలకని ఎంచక్కా దువ్వి జడేసి రిబ్బన్ కుచ్చుపెట్టాలని. కానీ ఇంత వరకూ ఆ కోరిక తీరనేలేదు.

గంట తర్వాత మాస్టారు మళ్ళీ వచ్చారు. ఆయన మొహం ప్రళయకాలరుద్రుళ్ళావుంది.

"ఏరీ ఆ వెధవలు!" అన్నారు బెత్తం ఝుళిపిస్తూ.

"వెళ్ళిపోయారు! ఇంక జన్మలో ఇటుకేసి రారట!" కాస్త ధైర్యంగానే అన్నాను.

ఆయన మొహం వెలవెలపోయింది. తర్వాత అకారణంగా మా అందరిమీద మండి పడ్డారు. కొందర్ని బెత్తంతో చావబాదాడు. కొందరికి గోడకుర్చీ వేయించాడు.

మాకు నిజంగా చాలా కోపం వచ్చింది. అయినా ఏం అన్లేం కదా. గురువుగార్రైపోయారాయె.

అన్నట్టు అందరం పొలోమంటూ లేచాం. కిరిటీ మాత్రం

"మాస్టారూ! చిన్న సందేహం!" అన్నాడు వినయంగా

"అడుగు!" దర్పంగా అన్నాడాయన

"ఇంతకీ కీచకుణ్ణి చంపింది ఎవరండీ?" ఓరగా చూస్తూ అన్నాడు కిరీటి.

అప్పటికే తన పిచ్చివాగుడు గ్రహించిన మాస్టారు.

"నేనేరా! మీరంతా అవతలికి తగలడండి" అన్నాడు అరిచిట్టు మేం గొల్లున నవ్వుతూ బైటికొచ్చేశాం.

స్కూల్ కాస్త ముందే వదిలారు గనక మా బృందం సరాసరి ఇంటికెళ్ళకుండా దేవకీ వాళ్ళ చింత చెట్టుకిందకి చేరాం, అందరి మనసుల్లోనూ ఒకటే ఆలోచన! మాస్టారికి బుద్ధి చెప్పాలి! కానీఎలా?

అందరూ నాకేసే చూస్తున్నారు. మరి లీడర్ని నేనేకదా? ఏదో చెప్పబోతుండగా దేవకీ వాళ్ళన్నయ్య అటుగా వచ్చి మమ్మల్ని చూసి "ఏం చేస్తున్నారు?" అన్నాడు గద్దించినట్టు. అసలు అతను మహాకోపిష్టి. అంతే కాదు, నా మూలంగా తన చెల్లెలు, మిగతా ఆడపిల్లలూ చెడిపోతున్నారని అతని అనుమానం.

అతన్ని చూడగానే అందరం కంగారుగా లేచాం

"ఆడుకుంటున్నాం అన్నయ్యా!" లోపల భయపడుతూనే అమాయకంగా అంది దేవకి.

"స్కూల్ ఎగ్గొట్టా?"

"స్కూల్ వదిలేశారన్నయ్యా" అన్నాన్నేను. అతన్ని మేమంతాకూడా అన్నయ్య అనే అంటాం.

"వదిలేశారా? ఇంకా టైమవలేదే" వాచ్ చూసుకుంటూ అన్నాడతను.

"ఈ స్కూల్‌కి టైముకూడా ఒకటుందా?" అని మనసులో అనుకుంటూనే పైకి మాత్రం.

"ఇవాళ ఇన్స్‌పెక్షన్ జరిగింది. అందుకే మాస్టారు కాస్త ముందుగా పంపేశారు" అన్నాను మరింత అమాయకంగా.

"అలా అయితే ఇళ్ళకి పోక ఇక్కడ సమావేశం అయ్యారెందుకు? అంతకీ ఇన్స్‌పెక్టర్ ఏమైనా అడిగాడా? మీరు సరైన జవాబులు చెప్పారా?" అన్నాడు. అందరం చెప్పామన్నట్టు బుర్రలూపాం. నాకుమాత్రం వాళ్ళడిగిన ప్రశ్నలు, రంగడు వాళ్ళు చెప్పిన జవాబులూ గుర్తొచ్చి చచ్చే నవ్వొచ్చింది.

"ఆс మీ మొహాలు చూస్తుంటే బానే చెప్పినట్టుంది. ఇంక ఇళ్ళకెళ్ళండి" అన్నాడతను వ్యంగ్యంగా. అంతేకాదు దేవకి రెక్కపట్టుకుని లాక్కెళ్ళాడు.

ఇంక మేం ఉసూరుమంటూ ఇళ్ళమొహం పట్టాం. మా చర్చలకి తాత్కాలికంగా వాయిదావేసి. ఇల్లు దగ్గరవుతున్నకొద్దీ మా టీచర్ భాషా పాండిత్యమే గుర్తొస్తోంది.. ఆపుకోలేని నవ్వొ వస్తోంది.

నాలో నేను నవ్వుకుంటూ వస్తున్న నన్ను చూసి "రిపోర్ట్ ఇచ్చారా? మంచి మార్కులు వచ్చాయా? "అంది బామ్మ ఉత్సాహంగా.

"అదేం కాదులేగానీ బామ్మా! కీచకుణ్ణి ఎవరు చంపారే? " అన్నాను చాలా సీరియస్‌గా నా ప్రశ్నకి ఆవిడ తెల్లబోయింది.

"కీచకుడెవరే? " అంది అయోమయంగా.

"ఊ నువ్వా ఆ బాపతేనా? పురాణాలన్నీ తెలుసంటావ్. కీచకుడెవరో తెలియదు ఖర్మ' అన్నాను విసుగ్గా.

బామ్మ నవ్వింది.

"ఆ కీచకుడి గురించా నువ్వడిగేది! నువ్వు ప్రతివాడికీ తలో బిరుదూ తగిలిస్తావుగా. అలాంటివాడేమో అనుకున్నాను" అంది.

నిజంగానే నేను నాకు నచ్చనివాళ్లందరికీ ఏదో ఓ పేరు పెడుతుంటాను. దాన్నే నా ఫ్రెండ్స్ ఫాలో అవుతారు.

"నేనడిగేది రామాయణంలో కీచకుడి గురించి!" అన్నాను తాపీగా. ఈసారి మరింత తెల్లబోయిందావిడ.

"రామాయణంలో కీచకుడా!" అంది విస్మయంగా

"ఆс అదే... సీతమ్మవారిమీద కన్ను వేశాడు..."

"హోరి భగవంతుడా, కాలం ఎలా తయారైందిరా! రామాయణంలో కీచకులూ, భారతంలో సీతలూ!... హు.. ఇదంతా వీళ్ల తప్పుకాదు. పసితనం నుంచీ పిల్లలకి మన పురాణ కథలు చెప్పాలే అని మొత్తుకున్నా మీ అమ్మ వినిపించుకుందా... ఇప్పుడు చూడు. ఇదేం వాగుతోందో! హవ్వా! ఈ పార్వతమ్మ మనవరాలికి ఈ చిన్న విషయమే తెలియదంటే ఎంత అప్రదిష్ట!" అంటూ దండకం మొదలుపెట్టింది బామ్మ.

"అబ్బ! నువ్వూరుకో బామ్మా! ఈ మాటన్నది నేను కాదు!"

'మరి? ఆ కిరీటిగాడా'?

"ఉcహూ! మా మాస్టారు, ఆ ఇన్‌స్పెక్టరూనూ!

"ఏవిcటి? " బిగుసుకుపోయింది బామ్మ.

తర్వాత స్కూల్లో జరిగిందంతా తుచ తప్పకుండా చెప్పాను.

"ఓరి దుర్మార్గుడా! ఇవ్వా నువ్వు స్కూల్లో చెప్పే పాఠాలు! పద! వెళ్లి కడిగేస్తాను. ఈ మాత్రం తెలియనివాడు టీచర్‌గా పనిచేసి జీతంరాళ్లు తీసుకుంటున్నాడా!" అంటూ మండిపడింది బామ్మ.

"అవునమ్మగారూ! పావల్డబ్బులిస్తానని ఆశపెట్టి నన్నక్కడ కూకోబెట్టి ఆడెవణ్నో నేనే సంపానని బల్లగుద్ది మరి చెప్పాడాపం తులుగోరు!" కళ్లు తుడుచుకుంటూ అన్నాడు రంగడు.

నీరసంగా కూలబడిపోయింది బామ్మ. కాస్సేపు తర్వాత-

"అమ్మడూ ఇంక నువ్వా స్కూల్ కెళ్ళొద్దే!" అంది ఆవేశంగా ఆమెని కూల్ చేసే సరికి నా తలప్రాణం తోక్కొచ్చేసింది.

మా ఇన్‌స్పెక్షన్ విషయం, అక్కడ జరిగిన తతంగం వూరంతా తెలిసిపోయింది. మేమే పని కట్టుకుని మరీ వెళ్ళి ప్రాపకాండ చేశాం. అంతేకాదు. మా మాస్టారు కనిపించినప్పుడల్లా మా కిరీటిలాంటి వాళ్ళు.

"భారతంలో సీతలూ, రామాయణంలో ద్రౌపదీ!" అంటూ కూనిరాగం తీసేవారు. దీంతో మా మాస్టారు వూరి వాళ్లందరి దృష్టిలోనూ ఓ బఫూన్ కింద తయారైపోయాడు.

ఏమాత్రం అవకాశం దొరికినా బెత్తం పట్టుకుని చావబాదడం, గోడకుర్చీలు వేయించడం, మండుటెండలో నిల్చోపెట్టడం లాంటివి చేస్తూ పైశాచికానందం పొందేవాడు. అదేమని పెద్దలు నిలదీస్తే వాడు పాఠం అప్పగించలేదనో, టీచర్‌కి ఎదురుతిరిగి మాట్లాడుతున్నాడనో ఏదో ఒకటి చెప్పి తప్పించుకునేవాడు. దాంతో మా వాళ్లే మమ్మల్ని మందలించే స్థితికొచ్చేశారు.

ఓరోజు అందరం అత్యవసర సమావేశం జరిపి చర్చించుకున్నాం. ఏమైనాసరే మాస్టారికి తగిన గుణపాఠం నేర్పాలని నిర్ణయించు

సహనానికి కూడా సరిహద్దులు ఉంటాయి - జాన్ డ్రైడెన్

కుని తగిన సమయం కోసం ఎదురుచూస్తూ ఆయన పట్ల అతి వినయం ప్రదర్శించ సాగాం.

పిచ్చి మానవుడు! మేం మారిపోయామ నుకున్నాడు.

ఆరోజు ప్రెసిడెంటుగారి తల్లి ఆబ్దీకం. మాస్టారు తద్దినం పెట్టి, సుష్టుగా తిని ఏ ఒంటిగంటకో వస్తాడని మాకు తెలుసు. అయినా మేం టైమ్‌కే స్కూల్‌కి వెళ్లాలి. లేకపోతే మావాళ్లు వూరుకోరుగా.

టైమ్‌కి స్కూల్‌కెళ్లి దొడ్డినపడి గోలగో లగా అరుచుకుంటూ ఆడుకున్నాం. తేగలు, సీమచింతకాయలు లాంటివి ఎంజాయ్ చేస్తూ తిన్నాం.

సరిగ్గా ఒంటిగంటకి భుక్తాయాసంతో దొర్లుకుంటూ వచ్చాడాయన.

ఆయన వస్తున్న అలికిడి గమనించిన మేమంతా ఎవరి స్థానాల్లో వాళ్లం బుద్ధిగా కూర్చుని పుస్తకాల్లో తలలు దూర్చాం. ఓసారి మమ్మల్ని చూసి తృప్తిగా నిట్టూర్చి -

"గుడ్! ఎక్కాలు, పద్యాలూ వల్లె వేయండి, నేనలా కాస్సేపు నడుం వాలు స్తాను!" అంటూ తడిగా ఉన్న పిలక విప్పి ఆరబెట్టుకుంటూ నేరేడు చెట్టుకింద ఉన్న బెంచీమీద వాలిపోయాడు. పది నిమిషాల్లో మూడూళ్లు వినిపించేలా గురక మొదలుపె ట్టాడు.

మళ్లీ మేమంతా కోతులం అయిపోయాం. మెల్లగా పెరట్లోకెళ్లాం. తెల్లని ఆయన పిలక బెంచీమీదుగా కిందికి వేలాడుతోంది. విర బోసుకున్నాడేమో తెల్లగా పట్టులా మెరిసిపో తోంది జుట్టు.

ఆ జుట్టు చూస్తుంటే నాలో ఎన్నాళ్లుగానో పేరుకుపోయిన కోరిక ఇంతెత్తున లేచింది.

అందర్నీ లోపలికి తీసుకొచ్చి -

"దేవకీ! ఇవాళ ఎంచక్క మాస్టారికి జడ వేసి రిబ్బన్ కడతానే!" అన్నాను ఉత్సా హంగా.

"అమ్మో! ఆయన లేస్తే? " అంది దేవకి భయంగా.

"తాట ఒల్చేస్తాడు!" అంది అన్నపూర్ణ.

"అంతగా లేస్తే-

"అయ్యో మాస్టారూ పట్టులాంటి మీ జుట్టు మట్టిలో పడిపోతుంటే చూడలేక ముడేద్దామనుకున్నానండీ!" అంటూ అమా యకంగా చెప్పేస్తాను!" అన్నాను ధీమాగా.

"చస్తే నమ్మడు!" అంది సుబ్బులు.

"మీకా భయం ఏం అక్కర్లేదు. ఇప్పు డాయన మీద పిడుగులు పడ్డా లేవడు. యమునా! నువ్వు జడవేసెయ్యి!" అన్నాడు కిరీటి.

నాకెక్కళ్లేని ఉత్సాహం వచ్చేసింది.

"దువ్వెనేదీ!" అన్నాను.

"నా దగ్గరుంది!" అంటూ జేబులోంచి ఓ చిన్న దువ్వెన్ని తీసి ఇచ్చాడు జయ.

అన్నపూర్ణని ఓ మంచి బంతి పువ్వు తెమ్మని ఆర్డర్ వేసి, చంద్రావళి జడకున్న ఎర్ర రిబ్బన్ తీసుకుని మెల్లగా మాస్టారి దగ్గ రికెళ్లాను. మిగతా వాళ్ళు నిశ్శబ్దంగా నన్న నుసరించారు.

మెల్లగా మాస్టారి తల దగ్గరికెళ్ళి గొంతు కూర్చుని పట్టుకుచ్చులాంటి ఆయన జుట్టు చేతిలోకి తీసుకున్నాను. ఆయన గుర్రు ఆగ కపోవడంతో మా అందరికీ ఎక్కళ్ళేని ధైర్యం వచ్చేసింది. దువ్వెనతో చక్కగా దువ్వి గట్టిగా జడవేసి రిబ్బన్ కట్టాను. కుచ్చు సరిగ్గా చేత కాకపోతే దేవకి అందంగా కుచ్చు పెట్టింది. అన్నపూర్ణ తెచ్చిన బంతి పువ్వు సన్నగా పాయతీసి పెట్టాను. నిజంగా చాలా అందంగా నచ్చింది జడ.

నా ముచ్చటైతే తీరిందిగానీ, మా మిగతా ఫ్రెండ్స్ అక్కసు తీరలేదు.

"జడేస్తే ఏం వుందీ! లేచి తిట్టుకుంటూ విప్పేస్తాడు. అంతేగా!" అన్నాడు బుజ్జి.

"మరేం చేద్దాం? " అన్నాను అమాయ కంగా.

"చెప్తాను" అంటూ కిరీటి, జయలతో గుస గుసలాడి బట్టలారేసుకునే ఓ బలమైన

నైలాన్ తాడు తెచ్చాడు బుజ్జి.

"ఇదెందుకు? " అంది సుబ్బులు.

"చెప్తాను" అంటూ మాస్టారి జడకి, ఆ తాడుకి గట్టిగా ముడేసి, రెండో చివర సిమెంటు బెంచీక్కట్టాడు బుజ్జి.

"పాపమేమోరా!" అన్నాను రవంత జాలిగా.

"పాపమా! ఈయన మనల్ని ఎన్ని రకాలుగా చిత్రహింసలు పెట్టాడు? ... ఈయనకి తగిన గుణ పాఠం చెప్పాల్సిందే!" అన్నాడు కిరీటి.

మిగతా వాళ్ళు వాడికి వంత పాడారు.

అంతా పకడ్బందీగా చేసి పిల్లుల్లా లోపలికొచ్చేశాం.

గంట, రెండు గంటలు గడిచిపో యాయి గానీ ఆయన గుర్రులో మార్పు మాత్రం రాలేదు. మా అంద రికీ తెగ టెన్షన్‌గా వుంది.

మరో అరగంట తర్వాత గురక ఆగింది.

మా గుండెలు క్షణం ఆగి, తిరిగి రెట్టించిన వేగంతో కొట్టుకోసాగాయి. అందరం కిటికీల్లోంచి కుతూహలంగా చూస్తున్నాం.

అప్పుడే నేరేడు చెట్టు మీదున్న ఓ కాకి కరెక్ట్‌గా ఆయన గుండు మీద పడేలా రెట్ట వేసింది. కాస్త మెలకువలో ఉన్న మాస్టారు గభాల్న లేచారు.

అంతే! ఆయన నోటంట ఓ చావుకేకలాం టిది వెలువడింది. మేం హడలిపోయి పెర ట్లోకెళ్ళాం.

అంతే! అందరం శిలల్లా అయిపోయాం. కారణం! పాపం మాస్టారి పిలక ఆయన గుండు మీద లేదు. జడత సహా వూడి సిమెంటు బెంచీకి వేలాడుతోంది. బాధతో గిలగిల్లాడుతున్న మాస్టార్ని చూస్తుంటే నిజంగానే జాలేసింది.

"ఏమైంది మాస్టారూ? " అన్నాను అమా యకంగా.

అంతే! ఆయన ఉగ్రనరసింహమూర్తే అయిపోయాడు. బెత్తం పెట్టి ఒక్కర్నీ ఒద లకుండా అందర్నీ చితకబాదేశాడు.

"ఎంత ధైర్యం రా మీకు? చదువు చెప్పే గురువుగారినే ఇంత అవమానం చేస్తారా! పదండి. మీ అంతు తేలుస్తాను!" అంటూ హుంకరించాడు.

"ముందు ఆ కాకిరెట్ట కడుక్కోండి మాస్టారూ! వెధవ కంపు!" అన్నాడు జయ కాస్త ధైర్యం తెచ్చుకుని.

అప్పుడు గుర్తొచ్చినట్టుందాయనకి.

"ఛి! ఛి! వెధవ కాకులు!" అంటూ కుండలో వున్న నీళ్ళతో తలంతా కడుక్కు



## ఈ జన్మకి అయ్యేదికాదు

'ఏమండీ! అమ్మాయి పదిహేడునిండి పద్దెని మిదో సంవత్సరంలోకి అడుగుపెట్టింది. మీరు మాత్రం పెళ్లి సంబంధాల విషయం పట్టించుకో వడంలేదు.. దండకం మొదలెట్టబోయింది భార్య.

'లేదులేదు.. నేనూ ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. కానీ ఏ వెధవను చూసినా తల మా సినవాడేనాయె.. ఏంచేయను? ' అన్నాడు భర్త.

'ఆఁ.. పోదురూ బడాయి.. మా అమ్మానాన్న మీలాగే ఆలోచించుంటే నాకీజన్మకి పెళ్లయ్యేది కాదుతెల్సా' ఠక్కున అంటించింది భార్యామణి.

న్నాడు. తర్వాత నిప్పులు కురిపించే కళ్ళతో చూస్తూ-

"మీరంతా పొండి! ఇవాళ తాడోపేడో తేల్చేస్తాను!" అన్నాడు వూడిన పిలక దగ్గర రాసుకుంటూ.

అంతే! పాలోమంటూ బైటికి పరిగెత్తామంతా.

"రోగం కుదిరింది!" కసిగా అన్నాడు కిరీటి.

"జరిగింది మనవాళ్ళతో చెప్తాడేమో రా!" భయంగా అన్నాడు జయ.

"చెప్పనీ! అయినా చదువు చెప్పే పంతులు ఒంటిగంటకి రావడమే గాక, వస్తూనే పడుకుని నిద్రపోతాడా' ఇది మాత్రం సరైన పద్ధతా? " కస్సుమన్నాడు బుజ్జి.



"నిజమే! ఇక ఈ పంతులు పని అయిపోయినట్టే!" ఉత్సాహంగా అంది అన్నపూర్ణ.

"ఇంక మనం స్కూల్ కెళ్ళక్కర్లేదు!" ఆనందంగా అంది సరోజిని.

అలా అనుకున్నా చేసినదానికి మా పెద్దల చేత ఎన్ని తిట్లు తినాలో, ఎన్ని తన్నులు తినాలో అన్న భయం అందర్నీ ఒణికించేసింది. అయినా ఎవరం బైటపళ్ళేదు.

★ ★ ★

**ఆ** సాయంత్రం బుద్ధిగా కూర్చుని చదువుకుంటున్నాను. 'చదువుకుంటున్నాను' అనే కన్నా చదువుతున్నట్టు నటిస్తున్నాను' అంటే బావుంటుందేమో! నేనంత కుదురుగా కూర్చుని చదువుకోవడం అందర్నీ ఆశ్చర్యంలో ముంచింది. ఏదో ఎనిమిదో వింత చూసినట్టు మొహాలు పెట్టారంతా.

"ఏంటి మా మున్నీ ఇంత బుద్ధిమంతురాలైపోయింది? " అన్నాడు నాన్నతో మాట్లాడ్డానికొచ్చిన మామయ్య".

"ఏదో తుఫాన్ ముందు ప్రశాంతతలా వుంది? " అంది కనకాంబరాలు కోస్తున్న అత్తయ్య.

"తుఫాన్ ముందు ప్రశాంతతలా లేదు. ఏదో పాడుపనిచేసొచ్చి, ఏం ఎరగని నంగనాచిలా కూర్చున్నట్టుంది? " అంది అమ్మ.

బామ్మ మాత్రం వాళ్ళందరి మీదా ఇంతెత్తున లేచింది నన్ను వెనకేసుకొస్తూ. అసలు నేనేం చేసినా తేలిగ్గా తీసుకుని నవ్వేసేదీ, నామీద ఈగవాలినా సహించలేనన్నట్టు నన్ను వెనకేసుకొచ్చేదీ ఆవిడే.

"అవునమ్మా, చుట్టూ అల్లరిమూక లేకుండా ఇంత బుద్ధిగా ఎప్పుడైనా కూర్చుందా నీ మనవరాలు? " అంది అత్తయ్య.

నాకు చాలా కోపం వచ్చింది.

"అసలేంటి మీ వుద్దేశం? నలుగురితో తిరిగితే ఏమిటీ తిరుగుళ్లు అంటారు. ఇంట్లో కూర్చుంటే కూర్చున్నావంటారు, సరదాగా మాట్లాడితే ఏమిటా వాగుడు? అని అరుస్తారు. మాట్లాడకపోతే ముంగిలా అలా వున్నావేం అంటారు. అసలు మిమ్మల్ని అర్థం చేసుకోవడం ఎలా? " అన్నాను అరుస్తూ.

"ఏదో జరిగింది!" అన్నట్టు మొహాలు చూసుకున్నారంతా.

"స్కూల్లో ఏమైనా గొడవ జరిగిందా మున్నీ? " అంది బామ్మ అనునయంగా, నేను కంగారు పడిపోయి అలాంటిదేం లేదన్నాను తడబడుతూ

"కిరీటిగాడు కూడా అదోలా వున్నాడు.



కొంపతీసి మీరిద్దరూ ఏమైనా పోట్లాడుకు న్నారా? " అంది అత్తయ్య అనుమానంగా.

"ఛ! కిరీటితో నేనెందుకు పోట్లాడతాను? ఒకవేళ పోట్లాడినా ఇలా ఎందుకుంటాను!" అనేశాను తేలిగ్గా.

"అంటే ఇంకెవరితోనైనా గొడవ పడ్డావా!"

"నేనెవరితోటి గొడవ పళ్లేదు" విసుగ్గా అన్నాను.

"నాకంతా తెలుసులే" నవ్వాడు మామయ్య.

"ఏం తెలుసు" చివ్వున తలెత్తి కళ్లు చిట్లిస్తూ అడిగాను.

"జరిగిందే! నువ్వు చెప్పకపోయినా కిరీటి అంతా చెప్పాడు!" గంభీరంగా అన్నాడు మామయ్య.

నాగుండె ఆగినంతపనయింది. "ఏవింటి కిరీటీ చెప్పాడా? " అన్నాను.

ఆహా!... అంతా చెప్పేశాడు.

"ఓరి దుర్మార్గుడా? ఎవరికీ చెప్పద్దని నాకు చెప్పి తనే అంతా చెప్పేశాడా? " అంటూ కిరీటిని తిట్టి పోశాను.

"ఇంతకీ ఏం జరిగిందే? " అయోమ యంగా అంది బామ్మ.

"అది కాదు బామ్మా! మా మాష్టారు... ఏదో చెప్పబోయిన నేను కిరీటి అదుపుతో ఆపేశాను.

"మున్నీ! నేనేం చెప్పలేదు. నీ చేత నిజం చెప్పించాలని మానాన్న ఆడుతున్న నాటకం" అన్నాడు తుఫాన్లా దూసుకొచ్చి నాకు మామయ్య మీద పిచ్చికోపం వచ్చింది. "కిరీటి చెప్పిందేమిటి? " అని నిలదీసినట్టు అన్నాను, బుర్ర గొక్కున్నాడు మామయ్య.

మా మొహాలు చూసి భళ్ళున నవ్వింది బామ్మ.

"అసలు జరిగిందేమిటో నన్నడగండర్రా!" అంది కులాసాగా నవ్వుతూ. మాతో సహా అందరం ఆవిడకేసి చూశాం.

"నాకు మున్నీ అంతా చెప్పింది!" నాకేసి ప్రేమగా చూస్తూ అంది బామ్మ. కిరీటి నాకేసి కోపంగా చూశాడు. నేను హడలిపో యాను.

"ఇంతకీ ఏం జరిగిందత్తయ్యా!" అంది అమ్మ అసహనంగా!

"ఏం లేదే! భారతంలో సీత" అంటూ మళ్లీ నవ్వింది బామ్మ. అర్థంకానట్టు అయో మయంగా చూశారంతా బామ్మ, మాస్టారు, ఇన్స్‌పెక్టర్ల మాటలు చెప్పింది.

"నిజమా!" అన్నాడు మామయ్య తెల్ల బోయి.

"నిజమయ్యా!" అంటూ నన్ను అవతలికి తీసికెళ్ళింది బామ్మ.

అందరూ నమ్మినట్టే ఉన్నారు. అయినా ఏదో భయం?

నిజం! మేం చేసిన పనికి ఏం ఉపద్రవం వచ్చిపడుతుందో అన్న భయంతో నాకా రాత్రి నిద్రే పట్టలేదు. నాకనేమిటి మావాళ్లెవరికీ పట్టుండదు.

అయితే పూర్తిగా తెల్లవారికుండానే ఉరుకుల పరుగులతో ఆయాసపడుతూ వచ్చాడు జయ.

"ఏమిటి నువ్వా? మాస్టారు మీ ఇంటికి వచ్చి మీ నాన్నతో విషయం చెప్పేశారా? " అన్నాడు ఆత్రుతగా.

"అదికాదు మున్నీ! మాస్టారు, ఆయన భార్యా పొద్దున్నే ఏదో ఊరికి వెళ్లిపోయారట. నాలుగైదు రోజులు మనకి స్కూల్ లేదట!" అన్నాడు జయ.

నాగుండె దడదడలాడింది.

"కొంపదీసి ఉద్యోగం వదిలి పోలేదుకదా!' అన్న భయం నన్ను ఒణికించేసింది.

"ఏమిటి జయా! ఇంత పెంద్రాళే వచ్చావ్? ఇవాళ ఆదివారం కాదే! బొమ్మల పెళ్ళిళ్లు చెయ్యడానికి" అంది అమ్మ నవ్వుతూ వచ్చి

ఆవిడకీ గొడవలేం తెలియవు. జయ నీళ్లు నములుతుంటే -

"ఏం లేదమ్మా! ఎందుకో దేవకి గుడికి రమ్మందిట. వాళ్ల బామ్మ పూజ చేయిస్తోం దేమో" అని.

"నువ్వెళ్లు మృత్యూ! నేనిప్పుడే వస్తాను" అని వాడికి సైగచేసి పంపేశాను.

అర్థగంటలోపు రెడీ అయిపోయి గుడికేసి పరిగెత్తాను. అప్పటికే మా బృందమంతా వచ్చేసి, నాకోసం చూస్తున్నారు. అందరి మొహాల్లో దిగులు గూడుకట్టుకొని ఉంది.

"ఏవిఁటే అలా ఉన్నారు? నాలుగురోజులు శలవులొచ్చాయని సంతోషించవే"? అన్నాను బలవంతంగా నవ్వుతూ.

అయితే వాళ్లు నవ్వలేదు.

"నీకు తెలుసా, పాపం! మన మాస్టారు, మనం చేసిన అవమానం భరించలేక ఊరొదిలి పోయారట!" దాదాపు ఏడుస్తూ అంది చంద్రావళి.

"అవును, అసలదంతా నీ వల్లే వచ్చింది. మాస్టారి జుట్టు పట్టుకుచ్చులా వుంటుంది. ఎంచక్కా జడవేయాలనుంది అంటూ ప్రాణం తీసి జడేశావు! ఇప్పుడు చూడు!" అంది దేవకి.

"అయితే నేను జడేసినందుకే ఊర్నించి పారిపోయారంటావా? ఏదో అల్లరికి పిల్లలు వేశార్లే అని విసుక్కుని విప్పేసుకునే వాడు. అంతేగానీ ఊరునీ, ఉద్యోగాన్నీ వదిలిపోడు! ఇదిగో ఈ బుజ్జిగాడి మూలంగానే జరిగిందిదంతా. చక్కని జడకి నైలాన్ తాడు ముడేసి, దాన్ని సిమెంటు బెంచీక్కట్టాడు. ఆయన లేచేసరికి అదికాస్తా వూడి చక్కావచ్చింది. ప్రాణప్రదంగా పెంచుకున్న పిలక కాస్తా బెంచీకి వేలాడుతుంటే భరించలేక పోయాడాయన!" అన్నాను కోపంగా బుజ్జికేసి చూస్తూ.

"ఇది మరీ బావుంది. అందరూ కలిసి నేరం నామీదికి నెడుతున్నారా! మాస్టారు చావబాదుతున్నారు. గోడ కుర్చీలు వేయిస్తున్నారు. ఈయనకి శాస్తి చేయాల్సిందే అని మీరు మాత్రం అన్లేదా! అయినా సరదాగా కట్టానేగానీ, కాకిరెట్ట తలమీద పడగానే, బాంబు నెత్తిన పడ్డట్టు ఆయన లేస్తాడనీ, ఆయనగారి పిలక వూడిపడుతుందనీ నేను కలగన్నానా? " అంటూ రుసరుసలాడాడు బుజ్జి.

ఇలా ఒకర్నొకరు నిందించుకొని తర్వాత

అందరం ఒకే ధోరణికొచ్చేశాం.

"నిజంగా మనం చేసింది చాలా తప్పు. గురువు దైవంతో సమానం. అలాంటి గురువుగారిని మనం చాలా రకాలుగా ఏడిపించాం" అని బాధపడి పోయాం.

"పాపం ఉద్యోగం లేకపోతే ఆయనెలా బతుకుతాడే!" కళ్లు తుడుచుకుంటూ అంది సరోజిని.

"మంత్రాలొచ్చుగా... తద్దినాలూ, బారసాలలూ చేసి బతుకుతాడేమో!" అన్నాడు కిరీటి.

"ఏడిసినట్టుంది నీ తెలివి! తద్దినాలూ, బారసాలలూ రోజు వుంటాయా? అదీగాక అలాంటివేవైనా వుంటే ఆయనకి తిండి దొరుకుతుందిగానీ పాపం! వాళ్లావిడేం తింటుంది? " అంటూ విసుక్కున్నాను.

"నిజమే!" అనేశారంతా.

గుమ్మడికాయలా వుండే మాస్టారు తిండి లేక ములక్కాడలా అయిపోయినట్టు ఊహించేసుకున్నాం.

"గుళ్లోకెళ్లి మాస్టారు క్షేమంగా వుండాలని మొక్కుకుందామా? " అంది దేవకి.

"అదే మంచిది. నేను మా ఇంట్లోంచి నాలుగు కొబ్బరికాయలు తీసుకొస్తాను" అంది చంద్రావతి.

"నాదగ్గర రెండు రూపాయలున్నాయి. వాటితో కర్పూరం, అగరొత్తులూ తెస్తాను" అన్నాడు జయ.

తర్వాత అందరం కలిసి గుడికెళ్లాం. చేతులు జోడించి, మా మాస్టారు క్షేమంగా రావాలనీ, తిరిగొచ్చి మళ్ళీ ఉద్యోగంలో చేరేలా చూడమని ఆ వేణుగోపాలస్వామికి మనస్ఫూర్తిగా దణ్ణాలు పెట్టుకున్నాం.

అయిదోరోజే కాబోలు మాస్టారు ఊళ్ళోకొచ్చేశారన్న వార్త వచ్చింది. ఆ వార్త మా అందరి మీదా పన్నీరు కురిపించినంత ఆనందాన్ని కలిగించింది.

అంతేకాదు అందరం వెళ్ళి జరిగినదానికి క్షమార్పణ చెప్పుకోవాలని కూడా నిర్ణయించుకున్నాం. అందరం మాస్టారింటికేసి పరిగెత్తాం. అక్కడ మాస్టారు లేరుగానీ ఓ బామ్మగారు తలమీదికి ముసుగు లాక్కుంటూ గిన్నెలు కడుగుతోంది తలదించుకుని.

"మామ్మగారూ! మాస్టారున్నారండీ? " అన్నాను అతి వినయంగా, ఆవిడ మాస్టారి బంధువై ఉంటుందని.

ఆవిడ తలెత్తి చూసి-

"నేనేనే యమునా! మీ పిన్నిని!" అంది నవ్వుతూ.

మేం కొయ్యబారిపోయాం.

పిన్ని అంటే మాస్టారి భార్య!

మాకు దుఃఖం వచ్చేసింది.

"ఇంతలో ఏమైంది పిన్నిగారు! మొన్నటిదాకా మాస్టారు పిడిరాయిలా ఉండేవారు. ఇంతలో ఏం సుస్తీ చేసిందీ? " అన్నాను. ఎప్పుడో బామ్మ దగ్గర విన్న మాటల్ని గుర్తు చేసుకుంటూ-

"ఛ! ఛ! అప్రాచ్యపు మాటలూ నువ్వూనూ. మీ మాస్టారికేం కాలేదు. దుక్కలా ఉన్నారు!" అందావిడ కొట్టినట్టు.

"మరీ గుండు... తలమీద ముసుగు..."

"అదా! తిరుపతెళ్ళాంలే! మొక్కుందీ... అందుకే ఇద్దరం తలనీలాలిచ్చాం!" అందావిడ లోపలికెళ్ళి ముఖాన రూపాయి కాసంత బొట్టు పెట్టుకుంటూ. బహుశా అప్పుడే మొహం కడుక్కున్నట్టుంది. ఆ బోసి మొహం, నున్నని గుండు చూసి మేం మరోలా అనుకున్నాం.

"ఇంతకీ మాస్టారేరీ? " అన్నాడు జయ మాటమారుస్తూ.

"పడుకున్నారు. పట్టుకుచ్చులాంటి మూరెడు పిలక ఉండేదా... హఠాత్తుగా అదేమైందో తెలీదు. అడిగినా చెప్పలేదు. అప్పటికప్పుడు తిరుపతి ప్రయాణం కట్టించి నా గుండు గొరిగించారు. తన నెత్తినేం ఉంది గనక! అయినా తనూ తలనీలాలిచ్చి

నట్టు చెప్పమన్నారు. అయ్యో నామతి మండా! అన్నీ నేనే చెప్పేశానే... ఈ విషయం ఎక్కడా అనకండి నాయనా! ఆయనగారు నా ప్రాణం తీస్తారు!" అందా విడ భయం భయంగా.

విషయం ఆవిడకి తెలియదని విన్నాక మాకు వెర్రి ఆనందం వచ్చేసింది.

"ఛ! మేం ఎందుకు చెప్తాం పిన్నిగారూ! అసలా వెంకటేశ్వరస్వామే ఆయన పిలక లాక్కుని ఉంటాడు. మీకు తెలియకుండా ఆయనెప్పుడూ మొక్కుకుని, ఆ మొక్కు తీర్చుండరు. అందుకే ఆ దేవుడికి కోపం వచ్చి ఆ పిలక కాస్తా లాక్కుని ఉంటాడు!" అన్నాను అతి భక్తి ప్రదర్శిస్తూ.

"నిజమేనే తల్లీ! ఆయనకన్నీ గుట్లే! ఏదీ చెప్పిచావరు..." అంది గొణుక్కున్నట్టు.

ఆవిడ లోపలికెళ్ళగానే బతుకుజీవుడా అన్నట్టు మేం చల్లగా జారుకున్నాం.

తర్వాత అందరం కలిసి ఆయన్ని క్షమార్పణలు అడగడం, ఆయన నవ్వుతూ క్షమించెయ్యడం జరిగిపోయాయి. అంతేకాదు. మునుపట్లా వస్తూనే పడి నిద్రపోకుండా కాస్త శ్రద్ధగా పాఠాలు చెప్పడం, మృదువుగా మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

మాకు ప్రాణాలు కుదటపడ్డాయి.

రోజులు గడిచిపోతున్నాయి. మా ఆటలు పాటలు, అల్లర్లు కూడా పెరుగుతున్నాయి.

ఏం మానినా ఆదివారం బొమ్మల పెళ్ళిళ్లు మాత్రం మానేవాళ్ళం కాదు. దానికి మా పెద్దలు అడ్డు చెప్పేవారు కాదు.

ఆరోజు ఆదివారం.

ఉదయం ఎనిమిదైపోయింది. అంతా వచ్చేశారు. గానీ జయ మాత్రం రాలేదు.

"వెళ్ళు! వెళ్ళి మీ మిత్రుని తీసుకురా!" వ్యంగ్యంగా అన్నాడు కిరీటి.

ఈ మధ్య కిరీటికి జలసీ ఎక్కువయింది. నేను జయతో ఎక్కువసేపు మాట్లాడినా అతనిని మెచ్చుకున్నా మూతిముడుచుకుంటాడు. నేనంటే జయకన్నా తనకే ఎక్కువ ఇష్టమనీ, ఎక్కువ చనువనీ చెప్పుకోవాలని తాపత్రయపడిపోతున్నాడు. ఈమధ్య నాకు ఈతకూడా నేర్పించాడు. నేను, జయ, కిరీటి సరదాగా ధర్మ చెరువులో ఈతకొడుతుంటే కిరీటి అల్లరిగా నన్ను ముంచేసి ఉక్కిరిబిక్కిరి చేసేవాడు. జయమాత్రం తెగబాధపడిపోయి కిరిటీతో ఘర్షణకి దిగేవాడు.

"అది నా మరదలు. ఏమైనా చేసుకుంటాను. మధ్య అడగడానికి నువ్వెవరు?" అని వాదనికి దిగేవాడు కిరీటి. ఇదంతా నాకు చిరాగ్గా వుండేది. కిరీటి మీద కోసం, మృత్యూ మీద ఇష్టం ఏర్పడ్డాయి. అది భరించలేక పోయాడు కిరీటి. అందుకే మాటకి ముందు మీ మృత్యూని, మీ మృత్యూనిపిలు, మీ మృత్యూతో కలిసి స్విమ్ చెయ్యి అనేవాడు. అయినా నేనేం పట్టించుకునేదాన్ని కాదు.

నేను వెళ్ళేసరికి నాన్నగారు హాల్లో పేపర్ చదువుతూ కూర్చున్నారు. నన్ను చూసి.

"ఏవిట్రా మృత్యూ కోసమా? వాడు స్నానం చేస్తున్నాడు కూర్చో" అన్నాడు. ఆయన సరదాగల మనిషి. ముఖ్యంగా నేనంటే చాలా అభిమానం.

నేను మౌనంగా కూర్చున్నాను.

ఏమిటి ఇవాళ నీకు జయకీ పెళ్ళా? అన్నాడు డాక్టర్ మామయ్య.

పెళ్ళి విషయం ఎత్తగానే నాకు ఎక్కళ్లేని ఉత్సాహం వచ్చేసింది.

"లేదుమావయ్యా! కిందటి ఆదివారం కిరీటికి, దేవక్కి పెళ్ళిచేశాం. ఈవారం సుబ్బులుకి, బుజ్జికి చేస్తున్నాం. వచ్చేవారం నేనూ, మృత్యూ పెళ్ళి చేసుకుంటాం!" అన్నాను ఉత్సాహంగా.

మా ఆటల గురించి ఆయనకు కూడా తెలుసు.

"సరే. ముస్తాబై వస్తాళ్ళే నువ్వెళ్ళు" అన్నాడు. నేను వచ్చేశాను.

మరో పావుగంటకి సారీచెప్తూ వచ్చాడు జయ.

తర్వాత పెళ్ళి తతంగం, విందు భోజనాలూ అప్పగింతలూ పూర్తయి ఎవరిళ్ళకి వాళ్ళం వెళ్ళిపోయాం.

"ఏళ్ళు మీద పడుతున్నాయి. ఇంకా ఈ పెళ్ళిళ్ళు గొడవ ఏమిటే? " విసుక్కుంది బామ్మ.

"ఏళ్ళు వస్తే పెళ్ళి చేసుకోకూడదా? " అన్నాను దబాయింపుగా

మనదంతా దబాయింపు సెక్షన్!

"నీ మొహం ఇంకా ఈ ఆటలేంటి. నీకూ, కిరీటికీ పెళ్ళి నిర్ణయించేశాం! ఆ తాంబూలాలేవో పుచ్చుకుంటే ఇంకే బాధ వుండదు!" అంది బామ్మ

"ఛ నాకూ, కిరీటికీ పెళ్ళా! నేను చస్తే కిరీటిని చేసుకోను" అన్నాను ఖచ్చితంగా.

బిత్తరపోయారంతా.

"కిరీటిని చేసుకోవా! వాడు నీ మొగుడని నువ్వు పుట్టినప్పుడే నిర్ణయించేశాం. ఇప్పుడు కాదనడానికి నువ్వెవరు? " కోపంగా అంది బామ్మ.

నాకు పిచ్చకోపం వచ్చింది.

"నాకు కిరీటి అంటే ఇష్టం లేదు. నేను జయని ప్రేమించాను. అతన్నే చేసుకుంటాను!" అన్నాను ఖచ్చితంగా

ఈసారి కొయ్యబారిపోయారంతా.

"నువ్వు. జయని ప్రేమించావా!" అంది బామ్మ అయోమయంగా.

"అవును. తనూ నన్ను ప్రేమించాడు. అందుకే నేను జయనే చేసుకుంటాను!" అన్నాను నిర్మోహమాటంగా.

"చూశావా అమ్మమ్మా; దీనికి నాకన్నా ఆ జయగాడంటేనే ఎక్కువ ఇష్టం! నేనంటేనే మండిపడుతుందీ మధ్య!" ఫిర్యాదు చేశాడు కిరీటి.

"దానిమొహం! పట్టుమని ఎనిమిదేళ్ళు లేవు. దానికి ప్రేమలేంటిరా. ఏదో జయ సున్నితంగా వుంటాడుకదా. అందుకే అలా అంటోంది. అది ఎప్పటికైనా నీ పెళ్ళామే!" అభయం ఇచ్చింది బామ్మ.



## నాకా హక్కుంది

భార్యాభర్తలు హోరాహోరీగా పోట్లాడుకున్నారు. కోపం పట్టలేక భార్య చేతిలో ఉన్న ఇస్త్రీ పెట్టె తీసి మొగుడి మీదికి విసరబోయింది.

'వద్దు వద్దు.. కిందపడి పగిలిపోతుంది.. పాడైపోతుంది' అరిచాడు భర్త.

'పాడైతే పాడవనీ.. ఇవన్నీ నేను పుట్టింటి నుంచి తెచ్చినవే కదా' అంటూదాన్ని చేతపట్టుకుని ఆమె అతని వెంటపడింది. గత్యంతరంలేక అతను వెళ్లి ఇంట్లోనే ఓ గదిలో దాక్కున్నాడు.

చేతిలో ఇస్త్రీపెట్టెతో ఆమె వీరంగం వేయడం మొదలెట్టింది. 'ఎక్కడున్నావురా? పిరికిపందా? దాక్కోవడం కాదురా.. దమ్ముంటే బయటకురా చూసుకుందాం' అంటూ అరిచింది.

వెంటనే 'ఇది నా ఇల్లు. ఇందులో ఎక్కడైనా దాక్కునే హక్కు నాకుంది' అంటూ భోషాణంలో నుంచి సన్నగా విన్పించింది.

గర్వంగా చూశాడు కిరీటి.

ఆ చూపు మరింత చిరాక్కలిగించింది నాకు.

"నేను చచ్చినా నిన్ను చేసుకోను! చేసుకుంటే ఆ జయనే చేసుకుంటాను. ఏం చేస్తావో చేసుకో!" అనేసి అక్కణ్నించి వెళ్ళిపోయాను.

బిత్తరపోయారంతా.

"పవిత్రా ఇదంతా!" దిగులుగా అంది బామ్మ నాన్నతో.

"దాని మొహం ప్రేమ. పెళ్లిని గురించి దానికేం తెలుసు. నువ్వేం దిగులు పడకు. యమున కిరీటికి పెళ్ళాం. సరేనా!" అన్నాడాయన.

నేను విసురుగా వెళ్ళిపోయాను.

నిజంగానే నాకు కిరీటికన్నా జయంటేనే ఎక్కువ ఇష్టం. ఎందుకంటే ధర్మచెర్లో కలువకాయలు లేకపోతే కంచల కాలవలో దిగి మరీ తెచ్చి పెడతాడు. ఆ కాలవలో కలవ కాయకే కాదు, గట్టున పెద్ద పెద్ద తాచులు కూడా తిరుగుతుంటాయి. అయినా తను భయపడకుండా తెచ్చిస్తాడు. మాలికి తెలియకుండా జామకాయలూ, మామిడి కాయలూ కోసి ఇస్తాడు. అసలు నాకు ఈత నేర్పింది కూడా జయే. అంతేకాదు. వాళ్లింట్లో ఏ పిండివంటలు చేసినా చాటుగా తెచ్చి నాకిచ్చి మురిసిపోతాడు. అన్నింటి కన్నా ముఖ్యమైందేమిటంటే, నాలా ఎప్పుడూ నవ్వుతూ వుంటాడు.

మరి కిరీటి అలాకాదే! నన్ను రకరకాలుగా ఏడిపిస్తాడు. దొంగిలించిన జామకాయలు కూడా తను తిని, మిగిలినవే నాకిస్తాడు. మాటకుముందు అలుగుతాడు. నేనెవరితో మాట్లాడినా కుళ్ళుకుంటాడు. అలాంటి వాణ్ణి నేనెలా పెళ్ళి చేసుకుంటాను? అదీగాక "అత్తకొడుక్కూడా ఓ మొగుడేనా? " అని కరణంగారి తల్లి బోల్డు సార్లు అనడం విన్నాను. అందుకే నాకు కిరీటిని చేసుకోవడం నాకిష్టం లేదు.

ఆ సాయంత్రం గుడిదగ్గర ఒంటరిగా కూర్చున్న జయదగ్గరికెళ్ళి.

"మృత్యూ! నన్ను పెళ్ళి చేసుకుంటావా? " అని సూటిగా అడిగేశాను. దానికి వాడు బిత్తరపోయి.

"పెళ్ళా? మొన్నేగా మనం పెళ్ళి చేసుకుంది. రేపాదివారం కిరీటికి, చంద్రావళికి చెయ్యాలి' అన్నాడు.

"ఛ! మట్టిబుర్ర. నేను చెప్పేది వుత్తుత్తి పెళ్ళి కాదు. నిజం పెళ్ళి!" అన్నాను.

"నిజం పెళ్ళా? " నోరు తెరిచాడు జయ.

"అవును. నాకు నువ్వంటే ఇష్టం. నీకూ నేనంటే ఇష్టం. అందుకే మనిద్దరం ఎంచక్కా ప్రేమించుకుని పెళ్ళి చేసుకుందాం!" అన్నాను జయ చెయ్యి పట్టుకుని ఊపేస్తూ

"నిజంగానా? " అన్నాడు ఆనందంగా

"నిజంగా... నిజం!"

"మరి కిరీటి..."

"వాడి బొంద! నాకిష్టంలేకపోతే వాడేం చేస్తాడు. నేను ఆల్ రెడీ చెప్పేశాను!" అంటూ జరిగిదంతా చెప్పేశాను. జయ మొహం మరింత వెలిగిపోయింది.

తర్వాత పెళ్లి గురించి, ఊహల పల్లకీ ఎక్కి వూరేగడం గురించి, కొత్త బట్టలు కట్టుకోవడం గురించి, పిండి వంటల గురించీ, ఇంకా చాలా మాట్లాడుకున్నాం. అప్పుడే పెళ్లియినంతగా మురిసిపోయాం.

"వీల్లేదు."... ఎప్పుడొచ్చాడో కిరీటి అరిచినట్టు అన్నాడు. క్షణం ఇద్దరం కంగారు పడ్డాం తర్వాత నేనే తేరుకుని-

"అది చెప్పడానికి నువ్వెవరివి! నేనూ, జయా ప్రేమించుకున్నాం పెళ్ళి చేసుకుంటాం!" అంటూ అతన్నెందుకు చేసుకుంటానన్నానో, తనని ఎందుకు చేసుకోనన్నానో గుక్క తిప్పుకోకుండా చెప్పేసి, జయ చెయ్యి పట్టుకుని విసురుగా వెళ్లిపోయాను.

ప్రతిమలా అయిపోయిన కిరీటి, తేరుకుని ఇంటి దారి పట్టడం మేం గమనిస్తూనే వున్నాం.

అయితే అదే రాత్రి నేను చదువుకుంటుంటే పిల్లిలా వచ్చాడు కిరీటి.

"ఏవిటి? " అన్నట్టు చూశాను.

"యమునా! ఇకనుంచీ జయలాగే నీకు అన్నీ తెచ్చిస్తాను. అంతేకాదు. పక్కూరు వెళ్ళి నీకిష్టమైన గులాబీ పూలు కూడా తెచ్చిస్తాను. నువ్వు నన్నే పెళ్లి చేసుకో

యమునా!" అన్నాడు కిరీటి దీనంగా.

"నిన్నా?"

"అవును. ఇంక నించీ నిన్ను అస్సలు ఏడిపించను. ప్రామిస్! జయలా ఎప్పుడూ నవ్వుతూంటాను! నన్నే ప్రేమించు యమునా!" ఈసారి కిరీటికి దుఃఖం వచ్చేసింది.

నిజంగా వాణ్ని చూస్తుంటే జాలేసింది.

"సరేలే! ఆలోచిస్తాను. నువ్వు మాత్రం అచ్చం జయలాగే వుండాలి" అన్నాను హెచ్చరిస్తున్నట్టు.

"వుంటాను" ఠక్కున అన్నాడు కిరీటి.

"ఏవిఁటే ఆ గుసగుసలు?" అంటూ వచ్చింది బామ్మ నేనేదో అనబోతుంటే-

"ఏం లేదమ్మమ్మా! ఏదో నోట్స్ కావాలని... యముననడగడానికొచ్చాను!" తడబడుతూ అన్నాడు కిరీటి.

"నోట్సా! యమున క్లాసు వేరు, నీ క్లాస్ వేరు. దాని నోట్సులు నీకెలా పనికొస్తాయిరా?" అనుమానంగా అంది బామ్మ.

"ఏం లేదులే! నువ్వెళ్లు. నేనూ, కిరీటీ ఏదో మాట్లాడుకోవాలి!" అన్నాను విసుగ్గా... చిత్రంగా చూస్తూ వెళ్లిపోయింది బామ్మ.

★ ★ ★

**కా**లం శరవేగంతో పరుగులు తీస్తోంది. మిగతా వాళ్ళ మాట ఎలా వున్నా, నేను, కిరీటి, జయ ప్రాణస్నేహితులమైపోయాం. పక్కవూరి హైస్కూల్లో చేరాం.

అయినా మా కార్యక్రమాల్లో పెద్దగా మార్పు రాలేదు. ఒక్క బొమ్మల పెళ్ళిళ్లు తప్ప మిగతావన్నీ మునపట్లాగానే చేసేవాళ్లం.

పండగలొస్తే మా ఆనందానికి పట్టపగ్గాలుండేవి కావు. ఆగస్టు పదిహేనున మా వీధిలో ఓ వాసం పాతి, జండా అదీ అమర్చి జండావందనం చేసేవాళ్ళం. వినాయక చవితికి ముందురోజే బుట్టలకొద్దీ పూలూ, పత్రీ, వెలక్కాయలు, సీతాఫలాలూ లాంటివి సంపాదించి పెట్టుకునేవాళ్ళం. పుస్తకాలు దేవుడి ముందు పెట్టి భక్తిగా పూజలు చేసుకునేవాళ్ళం.

ఇంకా దీపావళి సరేసరి. ఊళ్లోని సందడంతా మా ఇంట్లోనే వుండేది. తాటాకు టపాకాయలు, సీమ టపాకాయలు కిరీటి చేత్తో పట్టుకుని కాలుస్తుంటే జయ బిత్తరపోయి చూసేవాడు. తనకి అలా కాల్చడం భయం!

సంక్రాంతి పండగ సంగతి చెప్పాలా! నెల్లాళ్లూ సందడే. మాకు నాలుగావులుండేవి. వాటి పేడ చాలదన్నట్టు ముగ్గురం కలిసి ఊరిమీద పడేవాళ్ళం, గొబ్బెళ్ళకోసం.

తెల్లవారుఝామున నాతోపాటు గొబ్బెళ్లు చేసేవాళ్ళు కిరీటి, జయ కూడా. వాళ్ళని చూసి అంతా నవ్వినా వాళ్ళు పట్టించుకునే వాళ్లు కాదు. నన్ను మెప్పించడమే వాళ్ళ ధ్యేయం!

నిజానికి కిరీటికి పేడ అంటే పరమ అసహ్యం. అయినా జయ చేస్తున్నాడు కాబట్టి తనూ చేసేవాడు. జయ ఎక్కువ మార్కులు కొట్టేస్తాడేమో అని వాడి భయం. ముగ్గురం కలిసి పసుపుకుంకాలతోను, గుమ్మడిపూలతోనూ సర్దేవాళ్ళం. అట్లతద్ది, వుండ్రాళ్ళ తద్దిక్కూడా నాతోపాటు గోరింటాకు పెట్టుకుని, తెల్లవారుఝామున లేచి, గోంగూర పచ్చడి, నువ్వులపొడి, వెన్న, పెరుగన్నం తిని రకరకాల ఆటలు ఆడుకునేవాళ్ళం. ధర్మచెరువు ఒడ్డున రావి చెట్టుకేసిన ఉయ్యాల ఊగేవాళ్ళం.

"ఆడవాళ్ళలో పెద్దబావలు!" అంటూ దేవకీ వాళ్లు కిరీటి, జయల్ని ఏడిపించేవారు. కిరీటి వుడుక్కుంటే జయ బిక్కమొహం వేసేవాడు.

అసలీ పండుగల గురించిగానీ, ఆటల గురించిగానీ ఇప్పటి పిల్లలకి తెలుసా? ఎంతసేపూ బండెడు పుస్తకాలూ, స్కూలూ, చదువూ, కాస్త టైముంటే టి.వి.లు.!

కనీసం వాటిని గురించి చెప్పడానికి వాళ్ల

తల్లిదండ్రులకే తీరిక, ఓపికలు లేవు. తీరిక వున్నా ప్రస్తుతం వచ్చే టి.వి. సీరియల్స్ ఆ తియ్యని అనుభవాలని కాలరాచేస్తున్నాయి. అసలు పల్లెలంటేనే చీదరించుకునే దశకి చేరుకున్నాం. పట్నాల మోజు పెరిగిపోయింది. ఆ పై విదేశాల మీద మోజు!

అరె! ఇదేవిటి అందమైన మా పల్లెనొది లేసి పట్నంలోకొచ్చేశాను?

అసలు అంత అందమైన పల్లె ఈ రాష్ట్రంలో లేదని చెప్పగలను. ఇప్పుడు కాదు. అప్పటి పల్లె.

నాకు పధ్నాలుగేళ్ళొచ్చేసరికి పెద్దదానివయ్యానంటూ స్కూల్ మాన్పించేసింది బామ్మ. అంతటితో ఆగిందా?

"నువ్వు పెద్దదానివయ్యావ్! ఇక మగపిల్లలతో అంత చనువుగా మాట్లాడకూడదు!" అంటూ ఆంక్షలు పెట్టింది.

చదువంటే పెద్దగా ఇంట్రస్ట్ లేదుగానీ, మగ పిల్లలతో మాట్లాడొద్దంటే మాన్తానా!

చెప్పి చెప్పి విసిగిపోయిన బామ్మ ఇక మాట్లాడలేదు. కిరీటి, జయ లేకపోతే నాకు పిచ్చెక్కినట్టుండేది.

ఏం బుద్ధి పుట్టిందో, ఓ రోజు ఓ చిన్న కవిత రాసి నాన్నకి చూపించాను. అది చదివిన నాన్న పొంగిపోయాడు.

"నా తల్లి వర్డ్స్‌వర్త్ అంత పొయిట్ అవుతుంది" అంటూ ఆ కవిత ఊరందరికీ చదివి వినిపించాడు. నాకు ఎక్కళ్లేని ఉత్సాహం వచ్చేసి కుదురుగా కూర్చుని చిన్న చిన్న కవితలు, కథలు రాయడం మొదలుపెట్టాను. వాటిని నాన్న పత్రికలకు పంపడం, అవి అచ్చు కావడంతో నా లెవలే పెరిగిపోయిందా పల్లెలో.

నేనో చిన్న కథ రాస్తే, మా బామ్మ- "మా అమ్మడు పెద్ద నవల రాసిందీ, దాన్ని చదివి భారతదేశం మొత్తం మెచ్చుకుని తెగ ఉత్తరాలు రాసేస్తున్నారు" అని చాటించేది.

నమ్మిన అమాయకులు నోళ్లు తెరిచేవారు, నమ్మని వాళ్లు ముసిముసిగా నవ్వుకునేవారు. ఏమాటకామాటే చెప్పాలి. మా కిరీటి, జయ కూడా నా రచనల్ని చదివి తెగమెచ్చుకునేవారు. ఫ్యూచర్లో పెద్ద రచయిత్రివవుతావని జోస్యం కూడా చెప్పారు.

మరో ముఖ్య విషయం చెప్పడం మర్చిపోయాను. మరిడయ్యా అనే మంత్రగాడు ఊరొదిలి పోయిన దగ్గర్నించీ ఆ మంత్రాల చార్జీ, మందుల చార్జీ మా బామ్మ హేండోవర్ చేసుకుంది. అప్పుడు తెలిసింది ఊరువాళ్లకీ, నాకూ కూడా.

బామ్మ ఆ మరిడయ్యకి డబ్బులు, బియ్యాలూ ఇచ్చి తెగకాకాపట్టి వాడి విద్యలన్నీ నేర్చుకుందని.

ఇంకేముందీ ఏ తేలుకుట్టినా ఏ పాము కరిచినా (అసలు మా వూళ్లో తిరిగేవి ఎక్కువగా బురదపాములే. అవి కొన్ని తాచు లంత పెద్దవిగానూ ఉంటాయి). మా ఇంటి కొచ్చేసేవారు. ఇక మా బామ్మ కొంగుముడి వేసుకుని, విప్పి అలా చేస్తూ.. మంత్రాలు వల్లిస్తూ అవి మాకు వినిపించకూడదట. వినిపిస్తే ఫలితం ఉండదట. అందుకే గొణిగినట్టు చదివేది. మందూ మాకూ వేసేది.

ఇక అప్పట్నించీ మా బామ్మ ఓ దేవతే అయి కూర్చుంది. మరిడయ్యలా డబ్బులు తీసుకోకపోయినా బోలెడన్ని నమస్కారాలందుకునేది. నాకు మాత్రం ఆ మంత్రాలమీద ఆవగింజంతైనా నమ్మకంలేదు.

"ఏవిటో ఈ జనాల మూఢనమ్మకాలు!" అనుకునేదాన్ని భారంగా. అయినా ఈ రోజుల్లోనే మంత్రాలనీ, తంత్రాలనీ, బాబాలనీ, మాతృశ్రీలనీ రోజుకొకళ్లు వీధికొకళ్లు పుట్టుకొస్తుంటే జనాలు పొలోమంటూ పోవడం లేదూ. మన మూఢనమ్మకాలు మనతోపాటు పోవాల్సిందే! నన్నడిగితే నా చిన్నతనం నాటికన్నా మరింత పెరిగాయంటాను. ఘరి పాపాలూ పెరిగాయిగా.

చీకూచింతా లేని మామీద బామ్మకి హార్ట్ అటాక్ రూపంలో ఓ బాంబు పడింది నిమిషాలమీద పట్నం హాస్పిటల్లో చేర్చాడు



నాన్న డాక్టర్ మామయ్య సలహా మేరకు.

మా నాన్నకి నాన్నకనేమిటి మా ఇంట్లో అందరికీ బామ్మంటే చాలా ఇష్టం. అలాంటి బామ్మకి హార్టెటాక్ వచ్చింది. అయితే ఆ భగవంతుడి దయవల్ల అయితేనేం డాక్టర్ల కృషి అయితేనేం ఆవిడకి ప్రాణగండం తప్పింది. అయితే ఆమెకి పూర్తి విశ్రాంతి అవసరం అనీ, ఆవిడికిష్టంలేని పన్లేం చేసి ఆవిడ మనసు నొప్పించొద్దనీ, మరోసారి హార్టెటాక్ వస్తే ఆ దేవుడు కూడా కాపాడ లేడనీ డాక్టర్లు హెచ్చరించారు.

"మా అమ్మకిష్టంలేని పని మా ఇంట్లో ఎవరం చెయ్యం డాక్టర్" అన్నాడు నాన్న.

నిజమే మరి. ఎవరేం అనుకున్నా తుది నిర్ణయం బామ్మదే. ఆ విషయం ఊళ్లో వాళ్లందరికీ తెలుసు.

ఓ నిజం చెప్పాలంటే మా బామ్మకి. అందరికన్నా నామీదే కాస్త ఎక్కువ ప్రేమ ఒకోసారి కిరీటిక్కూడా పెట్టకుండా మీగడలో పంచదార వేసి నాకే పెడుతుంది చాటుగా. నేను కనిపించకపోతే గిలగిల్లాడిపోతుంది.

అసలు నాకు చదువన్నా, స్కూల్ కెళ్లా లన్నా మహాచిరాకు. దానికితోడు మా బామ్మ నాకు వత్తాసు పలుకుతుంది.

"అసలు ఆడపిల్లలకి చదువు ఎందుకర్రా! చాకలి పద్దులు చూడ్డానికి, మొగుడికో ఉత్తరం రాయడానికీ తగ్గ చదువుంటే చాలు!" అని వాదిస్తుంది. మరి మా బామ్మ మాట వేదంకదా, మనసులో తిట్టుకుం టున్నా పైకి మాత్రం ఏం అనరు.

మా ఊళ్లో అప్పుడప్పుడు తోలుబొమ్మలా టలు, గంగిరెద్దు ఆటలు, ఇంకా పగటివేష గాళ్ల నాటకాలు... ఒకటనేంటి చాలా జరు గుతుండేవి. అలాంటప్పుడు మాకు పండగే పండగ. మా ఊళ్లో సినిమాహాలు మాత్రం లేదు. పక్కన ఉన్న ఓ పాటి పెద్దఊర్లో ఓ టూరింగ్ టాకీసుంది. అందులో భక్తి సిని మాలు వచ్చేవి. బామ్మతో సహా అందరం బళ్లు కట్టించుకుని వెళ్లేవాళ్లం.

అన్నట్టు తోలుబొమ్మలాటలో కేతిగాడంటే నాకు భలే ఇష్టం. మా కిరీటిమీద కోపం వచ్చినప్పుడు, 'కేతిగాడు' అని ఏడిపిస్తుం టాను. వాడు ఉడుక్కుంటాడు.

ఆరోజుల్లోనే పక్కూళ్లో పురాణ కాలక్షేపం అవుతోంది. మా బృందమంతా బయ ల్దేరాం. నిజానికి పురాణం వినడానిక్కాదు. ఆ వంకన అల్లరి చేయడానికి.

అయితే బామ్మ ఒప్పుకోలేదు. పోట్లాడి, బతిమాలి వెళ్లాలనుకున్నాంగానీ, ఆరోజే డాక్టర్ మామయ్య వచ్చి బామ్మని పరీక్ష చేసి-

"కండిషన్ అంత బాగాలేదు. ఎందుకో మందులు పని చేస్తున్నట్టు లేవు. మీరు జాగ్రత్తగా ఉండండి" అన్నాడు నాన్నతో చాటుగా.

"చెన్నపట్నం తీసుకెళ్దామా డాక్టర్? " అన్నాడు నాన్న కంగారుగా.

"అవసరంలేదు! ఎప్పుడూ ఆవిణ్ని ఆనం దంగా ఉంచండి. ఆవిడేమాత్రం ఎగ్జయిట యినా తట్టుకోవడం కష్టం! మా మందులు, మీ ప్రవర్తనలే కాదు, ఆవిడ కోలుకోవాలంటే ఆ దైవం కూడా అనుకూలించాలి" అని వెళ్లి పోయాడు మామయ్య.

అందరం హడలిపోయాం.

"కిరీటీ! బామ్మ నిజంగా చచ్చిపోతుందే మోరా" అన్నాను దిగులుగా. మా బృంద మంతా తోటలో చేరిపోయాం.

"అవును. ఆవిడ మనసు నొప్పిస్తే ఠపీ మని గుండె ఆగిపోతుందట!" అన్నాడు కిరీటి కళ్లు తుడుచుకుంటూ.

మనం బామ్మని బాధపెట్టద్దని. కిరీటికి కూడా చెప్పాను. వాడూ సరే అన్నాడు.

"బామ్మ కన్నా ఎక్కువేవిఁటి? అనుకుని అందరం ఆవిడ చెప్పినట్టు నడుచుకో సాగాం. అయితే ఆవిడ ప్రాణం మీద ఆవి డకే నమ్మకం లేదేమో దిగులుతో పూర్తిగా మంచం పట్టేసింది. అత్తయ్య, మావయ్యా వాళ్లంతా కూడా మా ఇంటికే మకాం మార్చేశారు మా నాన్న కోరిక మేరకు.

ఆవిడ ఏదో చెప్పాలని తాపత్రయపడు తోందని గ్రహించిన నాన్న మెల్లగా ఆవిడ దగ్గర కూర్చొని-

"నీకేం పర్లేదమ్మా! అనవసరంగా నువ్వే ఏదేదో వూహించుకుని బాధపడుతున్నావ్. అసలు నీ మనసులోని బాధేమిటో చెప్పు!" అన్నాడు అనునయంగా.

బామ్మ మొహంలోకి కాంతి వచ్చింది.

"కాశీకెళ్ళాలనుందా బామ్మా? " అన్నాను ఆవిడ తల నిమురుతూ.

ఆవిడ నీరసంగా నవ్వింది. "ఇంకా కాశీ ఏవిఁటి తల్లీ! కాటికే వెళ్ళబోతున్నాను" అంది ఆయాసపడుతూ. ఆవిడ మాటలకి అంతా హడలిపోయారు. అది పల్లెటూరు కదా. ఊరుఊరంతా తరలి వచ్చి పరామ ర్శించి పోతున్నారు.

కొందరైతే ఆవిడ ఆఖరు క్షణాలు దగ్గర పడిపోయాయని నిర్ణయించేశారు. వేదాంత ధోరణిలో మాట్లాడ్డం మొదలుపెట్టారు.

ఇదంతా మా నాన్నావాళ్లకి చాలా చిరాకు కలిగించేది. అయినా ఏమంటారు?

ఓ రోజు సాయంత్రం ఓ నలుగురమ్మల క్కలొచ్చి పరామర్శించారు. త్వరలో లేచి ఎప్పటిలా తిరుగుతావని హామీ కూడా ఇచ్చారు.

అయితే బామ్మ ఎవరి మాటలూ వినిపిం చుకునే స్థితిలో లేదు. ఆవిడ మనసులో ఉన్నది ఎవరికో చెప్పుకోవాలని ఆరాటపడి పోతోంది.

"పాపం! ఆస్తిపాస్తుల పంపకాల గురించి ఆలోచిస్తున్నట్టుంది!" గుసగుసగా అందొకా విడ పక్కావిడతో.

అందుకు ఓ కారణం ఉంది. మాకు పొలాలు, తోటలు, ఇళ్ళు, వాకిళ్ళు బానే ఉన్నాయి. అవన్నీ మా తాతగారి స్వార్జి తాలు. అంతేకాదు ఆస్తిపాస్తులన్నీ ఆవిడ పేరునే రాశారు మా తాతగారు.

ఆవిడ పిల్లలిద్దరిలోనూ తేడాగా ఎవర్నీ చూడలేదు. కాబట్టి ఆస్తిపాస్తులు ఇద్దరికీ సమంగా చెందుతాయి. మరింక ఈవిడ ఆలోచన దేనికి? ఇదే ఎవరికీ అర్థం కావ డంలేదు.

"నగలపంపకాలగురించేమో!"

"తల్లినగలు కూతురికే చెందుతాయి" "అదేలా! ఆస్తిలో భాగం తీసుకుంటున్నప్పుడు నగల్లోనూ కోడలికి సగం చెందాల్సిందే!" "ఒకవేళ వజ్రాల హారం గురించేమో!" "అది వాళ్ళ వంశపరంపరగా వస్తున్నదిగా. అది కచ్చితంగా కోడలికే చెందాలి!" అలా తలో మాటా రహస్యంగా మాట్లాడుకుంటున్నారు అమ్మలక్కలు.

వాళ్లంతా మెల్లగా మాట్లాడుకున్నా మాకవి స్పష్టంగానే వినిపిస్తున్నాయి. నాన్న మొహంలో చిరాకు చోటుచేసుకుంది.

"ఒరేయ్ నాన్నా! కోడల్నోసారి పిలవరా!" అంది బామ్మ. గుమ్మంలో వున్న అమ్మ పిలవకుండానే వచ్చి ఆవిడ పక్కన కూర్చుంది.

"ఓ పెన్నూ కాగితం తీసుకురాతల్లీ!" అంది బామ్మ.

"వట్టి కాగితానికి విలువుండదు పిన్నీ! మీ లాయర్‌ని పిలిపిస్తే మంచిది!" అంది ఓ కోర్టు తల్లి.

బామ్మ అడ్డంగా వూపింది.

"అది కాదు పిన్నీ... అసలు.."

"వదినగారూ! మాకు ఆ కాయితాలు కూడా అక్కర్లేదు. ఆవిడ మాటే మాకు వేదం! మీరు అనవసరంగా లాయర్లు, పంపకాలు అంటూ ఆవిణ్ని మరింత కంగారు పెట్టకండి!" అంది కాస్త అమ్మ కాస్త కఠినంగానే.

మరిమాటరాలేదావిడకి. మొహం మాడ్చుకుని రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

మళ్ళీ చెప్పింది బామ్మ.

"ఇప్పుడవన్నీ ఎందుకమ్మా! నీకేం పర్వాలేదు. హాయిగా పడుకుని నిద్రపో!" అంది అత్తయ్య వస్తూ.

అయినా బామ్మ వినిపించుకోలేదు.

ఆస్తిపాస్తుల గురించి ఎవరికేది చెందాలో బామ్మ ఎప్పుడో చెప్పేసింది. అయితే మా ఇంట్లో ఓ ఖరీదైన వజ్రాలహారం నాలుగు తరాల నించే వుంటోంది. దాని మీద అమ్మ సంగతేమో గానీ, అత్తయ్యకి మాత్రం చాలా మమకారం వుంది. ఆ నగని గురించి చెప్పడానికే అన్న నిర్ణయానికొచ్చేశారంతా.

బామ్మకోరినట్టుగా పెన్ను, పేపరు తెచ్చి అత్తయ్యకిచ్చింది అమ్మ.

"అది నువ్వు తీసుకో!" అంది బామ్మ అమ్మతో.

అత్తయ్య మొహం మాడిపోయింది. విసురుగా కాయితం, కలం అమ్మకిచ్చేసి అవతలికెళ్ళిపోయింది.

అమ్మకి కంగారొచ్చేసింది. అయినా బామ్మ మాటకెదురు చెప్పలేదుగా!తర్వాత అందర్నీ బైటకెళ్ళమన్నట్టు సైగచేసింది బామ్మ. అందరం వెళ్ళిపోయాం.

తర్వాత తలుపులు మూసుకున్నాయి. బైట అత్తయ్య నిప్పులు తొక్కిన కోతిలా అయిపోయింది.

"ఛ! ఇలాంటి సమయంలోనా... నీ వాగుడు! అయినా ఆ నగ ఆ ఇంటికోడళ్ళకి చెందాలేగాని కూతుళ్ళక్కాదు. ఇంక చిందులు మానెయ్యి!" అంటూ విసుక్కున్నాడు మామయ్య. మరి మాట్లాడలేదు అత్తయ్య.

అందరికీ ఒకటే టెన్షన్!

ఆ నగ ఎవరికి రాస్తుంది! లేకపోతే ఇంకేమైనా విలువైన నగలు తమకి తెలియకుండా దాచిందా? అలా అయితే అవి ఏమై ఉంటాయి? అన్న ఆలోచనలు కందిరీగల్లా ముసిరి గోల చేస్తున్నాయి.

గంట తర్వాత మెల్లగా తలుపులు తెరుచుకున్నాయి. అందరం అమ్మకేసీ, అమ్మ చేతిలోని కాగితంకేసీ ఆత్రంగా చూశాం.

అమ్మ పెదవుల్లో చిరునవ్వు చిందులు వేసింది.

"ఊం! ఇంకేం... ఆ హారం ఈవిడగారికి వ్వాలని రాసేసుంటుంది!" కసిగా అనుకుంది అత్తయ్య.

"ఆ నిధి నిన్నే తీసుకోమని రాసిందా? " ఆవేశాన్ని అతి ప్రయాసగా తొక్కిపెడుతూ

అంది.

"ఉఁ!"

"అనుకున్నాను. అది నీకే ఇస్తుందని నాకు తెలుసు. ఇంకేం. ఇనప్పెట్టి తీసి మెళ్ళో తగిలించుకో!" కసిగా అంది అత్తయ్య.

అత్తయ్య మాటలు ఎవరికీ నచ్చలేదని వాళ్ళ మొహాలే చెబుతున్నాయి.

"ఇనప్పెట్టెలోంచి తీసుకోనక్కర్లేదు. నా చేతులకే స్వయంగా ఇచ్చేశారు!" శాంతంగా అంది అమ్మ.

"ఏవిఁటి.. నీకే ఇచ్చేసిందా! ఈ మాత్రపు దానికి కాగితాలూ, కలాలూ దేనికి? ఆ తలుపులు మూసుకోవడాలు దేనికీ" అక్కసుగా అంది అత్తయ్య.

"సుభద్రా! ఏవిఁటా మాటలు!" మళ్ళీ మందలించాడు మామయ్య.

అమ్మ మళ్ళీ నవ్వింది.

ఆ నవ్వు చూస్తే మరింత ఉడికిపోయింది అత్తయ్య. "అబ్బ! నగలంటే ఇష్టంలేని నువ్వు... విలువైన నగ స్వంతమయ్యేసరికి అంత పొంగిపోతున్నావంటే, నగలంటే ఇష్టంలేదన్న మాట పచ్చి అబద్ధం అని తెలిసిపోతుంది. అయినా ఎవడిక్కావాలి ఆ బోడి నగ. కావాలంటే నేనే చేయించుకోగలను" అంది కళ్ళూ చేతులూ తిప్పుతూ.

"సుభద్రా! ఎందుకు అనవసరంగా అవేశపడతావ్! మీ అమ్మగారిచ్చిన నిధి నాకక్కర్లేదు. అది నువ్వే తీసుకో. కానీ ఈ విషయం మాత్రం గోప్యంగా ఉంచు. అది నాకు మాత్రమే చెందాలనీ, నా తదనంతరం నా ఇష్టమొచ్చిన వాళ్ళకివ్వాలనీ ఆవిడ కోరిక!" అంది అమ్మ గంభీరంగా.

అత్తయ్య ముందు తెల్లబోయి, తర్వాత ఆనందపడిపోయింది.

"ఏదీ ఆ హారం?" అంది ఆతృతగా.

"ఇదిగో" అంటూ చేతిలో కాయితం అత్తయ్యకిచ్చింది అమ్మ.

అయోమయంగా దాన్ని తీసి చదివిన అత్తయ్య మొహం నెత్తురుబొట్టు లేనట్టు పాలిపోయింది.

"ఇదా నీకు రహస్యంగా ఇచ్చింది!" అంది తడారిపోతున్న గొంతుతో.

"అవును! అక్షరాలా అదే! ఇంక హారం సంగతంటావా. అది నాకొద్దు. ఒకవేళ అత్తయ్య నాకిచ్చినా దాన్ని నువ్వే తీసుకో!" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది అమ్మ.

అత్తయ్య మొహం సిగ్గుతో కుంచించుకుపోయింది. "ఇంతకీ ఏవిఁటిరా ఆవిడ ఇచ్చిన నిధి!" అన్నాడు నాన్న. భార్య చేతిలోని కాయితం తీసుకుని చదివిన మామయ్య పడీపడీ నవ్వాడు.

ఇంతకీ అందులో రాసింది ఏ నిధి గురించీ కాదు. మారిడయ్య దగ్గర తను నేర్చుకున్న మంత్రాలూ, ఏవో చెట్లవేళ్ళూ, పసరుతీసే ఆకుల పేర్లూ... స్పష్టంగా రాసున్నాయి.

తన తదనంతరం ఆ మంత్రాలూ వగైరాలు కోడలికి ధారాదత్తం చేసింది బామ్మ.

ఈ సారి అందరం పగలబడి నవ్వుకున్నాం. అత్తయ్య మాత్రం తలెత్తుకుని తిరగలేకపోయింది.

రోజులు గడుస్తున్నాయి. డాక్టర్ మామయ్య రోజూ బామ్మను చూసి వెళ్తున్నాడు.

కానీ బామ్మ పరిస్థితి మెరుగవలేదు సరికదా మరింత క్షీణించిపోయింది.

"ఇంక ఆవిడ ఎక్కువకాలం బతకదు!" అని కూడా చెప్పేశాడు డాక్టర్ మామయ్య.

అందరి మొహాల్లోనూ దిగులు గూడుకట్టుకుంది. ఎంతసేపూ బామ్మ నన్ను తన దగ్గరే కూర్చోబెట్టుకునేది.

"నా తల్లి కళ్ళు చాలు. వెన్నెల కురుస్తుంది ఆ నవ్వు! అది నవ్వితే ముత్యాలు రాలవూ" అనేది పదే పదే.

కళ్ళల్లో వెన్నెల కురవడం ఏమిటి, నవ్వితే ముత్యాలు రాలటం ఏవిఁటి సంధి ప్రేలాపన కాకపోతే! అనుకునే దాన్ని బాధగా.

ఓ రోజు వున్నట్టుండి మరో బాంబు పేల్చింది బామ్మ కొడుకుని పిల్చి-"ఒరేయ్ నాన్నా! నాకోకోరికుంది తీరుస్తావా? " అంది నీరసంగా.

"ఏమిటమ్మా! ఏం కావాలి చెప్పు! నువ్వే దడిగినా తెప్పిస్తాను! అన్నాడు నాన్న కళ్ళు తుడుచుకుంటూ.

ఈ సారి ఏం కోరిక కోరుతుందా అని ఇంటిల్లిపాదిమీ ఆత్రుతగా ఎదురుచూస్తున్నాం.

"వజ్రాలహారం సుభద్రకిద్దామా? " అంది అమ్మ ఆవిడ తల ఆప్యాయంగా నిమురుతూ.

"ఉఁహుఁ!"

"మరి? "

"నేనింకెన్నాళ్ళో బతకనమ్మా..." బామ్మకి దుఃఖం వచ్చేసింది.

" ఛ! ఛ! అలా అనకండత్తయ్యా! మీకేం పర్లేదని డాక్టర్‌గారు చెప్పారు!" వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అంది అమ్మ.

బామ్మ వేదాంతిలా నవ్వింది.

"ఇంతకీ నీకేం కావాలో చెప్పమ్మా!" అన్నారు నాన్న.

"నాకు అమ్మడి పెళ్ళి చూడాలనుందిరా!" దీనంగా అంది బామ్మ.

అందరం ఒక్కసారి తుళ్ళిపడ్డాం.

"యమున పెళ్ళా? " అప్రయత్నంగా అంది అమ్మ.

"అవునే! నే బతికుండగానే దానికీ, కిరీటికీ పెళ్ళయితే నేను తృప్తిగా కన్నుమూస్తాను!"

"ఇప్పుడు దానికి పెళ్ళేమిటమ్మా!" గొణిగినట్టు అన్నాడు నాన్న.

"అవునత్తయ్యా! అది ఇంకా చిన్న పిల్ల. అదీ గాక వయసు పెరిగినంత పెరగలేదు కూడా... అయినా ఇప్పుడు మీకేమైందని. మీరు వాళ్ళ పెళ్ళి చూడ్డమే కాదు. వాళ్ళ పిల్లల్ని ఎత్తుకుని ఆడిస్తారు కూడా!" అంది అమ్మ.

బామ్మ మొహం గంభీరంగా అయిపోయింది.

"ఇంకా చిన్నపిల్లేమిటే... దానీడుకి నాకు మీ ఆయన పుట్టాడు. కిరీటికి నీ కూతుర్ని ఇవ్వడం ఇష్టంలేకపోతే ఆ మాటే చెప్పు! అయినా నా స్థితేమిటో నాకు తెలుసు" అంది ఆవేశంగా.

"ఆవేశపడకమ్మా! మన యమునకి కిరీటికిచ్చి చేద్దామని ఎప్పుడో అనుకున్నదేగా. కాకపోతే, వాడి చదువు పూర్తి కాలేదు. దీనికి లోకం గురించి తెలియదు. అందుకే కొన్నాళ్ళాగి చేద్దాం!" అన్నాడు నాన్న అనునయంగా.

అదే మాట అత్తయ్య, మామయ్య కూడా చెప్పారు. అయినా బామ్మ వినిపించుకోలేదు. వాళ్ళిద్దరికీ పెళ్ళి చేస్తారా నన్ను చావమంటారా!" అంటూ అరిచింది.

"చూద్దాంలే!" అనేశాడు నాన్న గత్యంతరం లేక.

"చూద్దామంటే కాదు. వెంటనే శాస్త్రులుగారిని పిలిపించి లగ్నాలు పెట్టించెయ్యి!" అంటూ హుకుం జారీ చేసింది బామ్మ.

"సరేలే! అంటూ వెళ్ళిపోయాడు నాన్న.

మిగతా వాళ్ళూ కదిలారక్కణ్నుంచి.

అయితే నాన్న అన్నట్టు పురోహితుడికి కబురుపెట్టలేదు. నాలుగు రోజులు చూసిన బామ్మ నిరాహారదీక్ష పూనింది. అంతే కాదు. ఎంత బతిమాలినా మందులుకూడా వేసుకోవడం లేదు. డాక్టర్ మామయ్య బి.పి. చూడ్డానికొస్తే తరిమినంత పని చేసింది.

ఏం చెయ్యాల్లో ఎవరికీ అర్థం కాలేదు.

"ఇప్పుడేందారి డాక్టర్‌గారూ? " అన్నాడు నాన్న నెత్తిన చేతులు పెట్టుకుంటూ డాక్టర్ మామయ్యతో.

"ఆవిడ నాలుగు రోజులు బతకాలంటే

భగవంతుడు ఏది చేసినా మన మేలు కొరకే చేస్తాడని విశ్వాసం గల వ్యక్తిని ఎట్టి క్లిష్ట పరిస్థితులూ కలత పెట్టలేవు. – ఎలియానార్ రూజ్వెల్ట్

ఆవిడమాట వినాల్సిందే!" అన్నాడాయన ఏదో ఆలోచిస్తూ.

"వివాహం విద్యానాశాయ, శోభనం సర్వం నాశాయ అన్నారు పెద్దలు. ఇంకా వాడి చదువే పూర్తికాలేదు. వాడికి పెళ్ళేమిటండీ!" అన్నాడు మామయ్య.

"బాగా ఆలోచించండి. పెళ్ళి చెయ్యండి. మిగతావి తర్వాత చూసుకోవచ్చు! ఆవిడసలే మొండిమనిషి. పరిస్థితీ అంతంత మాత్రంగానే వుంది. నాకు తోచింది చెప్పాను. తర్వాత మీ ఇష్టం" అంటూ వెళ్ళిపోయాడు డాక్టర్ మామయ్య.

అంతకన్నా ఆయన మాత్రం ఏం చెప్పగలడు. మా వాళ్ళంతా నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చున్నారు.

"పోనీ పెళ్ళి చేసేసి, కిరీటిగాడి చదువు పూర్తయి ఉద్యోగం వచ్చేదాకా శోభనం చెయ్యకుండా యమునని ఇక్కడే ఉంచేసుకుందాం" అంది అత్తయ్య.

"అదే మంచిది. చూస్తూ చూస్తూ నిండు ప్రాణాన్ని తీసెయ్యలేం కదా!" భారంగా అంది అమ్మ.

మామయ్య కూడా సరే అనక తప్పలేదు. వెంటనే తమ నిర్ణయం బామ్మకి చెప్పేశారంతా.

అంతే! ఆవిడ మొహం దివిటీలా వెలిగిపోయింది. నాకు మాత్రం పిచ్చకోపం వచ్చింది.

"అసలు నన్నుగురించి వీళ్ళేమనుకుంటున్నారు! ప్రాణంలేని బొమ్మ ననుకుంటున్నారా: పెళ్ళి చేసుకునే దాన్ని-

"అయ్యో! దీనికిష్టముందో లేదో! ఓసారి అడిగి చూద్దాం" అన్న ఆలోచనైనా లేని వీళ్ళు పెద్దలా? " అంటూ మండిపడ్డాను.

"నేనసలు ఆ కిరీటిగాణ్ణి చేసుకోను పొండి!" అన్నాను. కంగారుగా చూశారంతా. తర్వాత బతిమాలారు.

"అయితే కొన్ని కండిషన్స్‌కి ఒప్పుకోవాలి!" అన్నాను సీరియస్‌గా.

"ఏమిటి? " అన్నారు ఏక కంఠంతో.

"నేను పెళ్ళైనా వాణ్ణి కిరీటీ అనే పిలుస్తాను!"

"అలా బావుండదు తల్లీ!" అనునయంగా అంది అమ్మ.

"బావున్నా బావుండకపోయినా అలాగే పిలుస్తాను. నిన్నటిదాకా ఏరా కిరీటీ! ఒరేయ్ కిరీటీ" అని పిల్చిన నేను పెళ్ళవగానే "ఏమండీ! చూడండీ!" అని పిలవాలా! చస్తేపిలవను. అందుకు ఒప్పుకుంటేనే నేనీ పెళ్ళి చేసుకుంటాను! లేకపోతే ఈ పెళ్ళి కేన్సిల్!" అన్నాను మొండిగా.

"అలాగే! కిరీటీ! అని పిలు. కానీ ఒరేయ్ అని మాత్రం పిలవకు. ఎందుకంటే వినే వాళ్ళు ఈ పిల్ల రాక్షసి. మొగుడికి కాస్తయినా మర్యాద ఇవ్వదు అని నిన్నే తిట్టుకుంటారు!" అంది అత్తయ్య అనునయంగా.

నేను ఆలోచనలో పడ్డాను.

తర్వాత అందరూ నాకు బ్రైన్‌వాష్‌చేసి 'ఒరేయ్' అని పిలవను అనిపించారు.

"అయితే రేపే శాస్త్రుర్లుగార్ని తీసుకొస్తాను!" అన్నాడు నాన్న. బామ్మ మొహంలోకి కొత్తకాంతి వచ్చింది. కిరీటి మొహంలోకాన్ని జయించినంత ఆనందంగా వుంది.

నాకు హఠాత్తుగా జయ గుర్తొచ్చాడు. అంతే! వెంటనే లేడిలా వీధిలోకి పరిగెత్తాను. వెనకనించి అమ్మావాళ్ళు పిలుస్తున్నా వినిపించుకోకుండా.

"ఏముందీ. తన పెళ్ళి సంగతి ఆ దేవకీ వాళ్ళకి చెప్పడానికి పరిగెడుతోంది!" అన్న అత్తయ్య మాటలు నాకు వినిపించాయి.

నేను సరాసరి డాక్టర్ మామయ్యా వాళ్ళింటికెళ్ళాను. హాల్లో ఎవరూ లేరు. జయ టి.వి. చూస్తూ కూర్చున్నాడు.

"మృత్యూ! అర్జెంట్‌గా నాతోరా! నీకో న్యూస్ చెప్పాలి!" అంటూ అతని చెయ్యి పట్టుకుని ధర్మచెరువుకేసి పరిగెత్తాను. దారిలో చాలా మంది మమ్మల్ని వింతగా చూస్తున్నా నేను పట్టించుకోలేదు.

"ఏవిటి మున్నీ! ఏమిటీ హడావిడి?" చెరువొడ్డునున్న రావిచెట్టుకింద కూలబడుతూ అన్నాడు జయ.

"మృత్యూ! ఓ గుడ్‌న్యూస్!" మెరుస్తున్న కళ్ళతో అన్నాను.

"ఏవిటి నువ్వు మళ్ళీ ఏదైనా కథ రాశావా? దానికి ప్రైజొచ్చిందా?" నవ్వుతూ అన్నాడు జయ.

"ఛ! అదికాదు మృత్యూ! నాపెళ్ళి!"

"వ్వాట్" అదిరి పడ్డాడు జయ.

"నిజం మృత్యూ! నాకూ, మా కిరీటికీ పెళ్ళి. రేపే ముహూర్తాలు పెట్టేస్తారట!" కళ్ళు తిప్పుతూ ఉత్సాహంగా అన్నాను.

జయ మొహం వెలవెలపోయింది. అదేం గమనించకుండానే-

"అవును! మా బామ్మ పట్టుపట్టింది. అంతా సరే అన్నారు. నేను మాత్రం పెళ్ళయ్యాక కూడా కిరీటీ అనే పిలుస్తానన్నాను. సరే అన్నారు!" అన్నాను.

జయ మాట్లాడలేదు.

"మృత్యూ! ఈ విషయం నీకు ఆనందంగా లేదూ?" అతని మొహం చూసి విస్తుపోతూ అన్నాను.

"ఆనందమా? అసలు నాగురించి నువ్వేమనుకుంటున్నావ్!" అన్నాడతను తీక్షణంగా.

నేను బిత్తర పోయాను. నవ్వుతప్ప అతని మొహంలో సీరియస్‌నెస్ చూడ్డం చాలా అరుదు.

"నేను కిరీటిని చేసుకొనడం నీకిష్టంలేదా మృత్యూ?" అన్నాను మెల్లగా.

"అది తరువాత చెబుతాను. నువ్వు నాతో ఏం చెప్పావ్?" గంభీరంగా అన్నాడు జయ.

"నీతో చాలా చాలా అన్నాను. దేన్ని గురించి నువ్వడిగేది!" అన్నాను అమాయకంగా.

"ప్రేమ గురించి!"

"ప్రేమ గురించా?"

"అవును. నన్ను ప్రేమించాననీ, పెళ్ళి చేసుకుంటాననీ ప్రామిస్ చెయ్యలేదూ?" తీక్షణంగా అన్నాడు జయ.

నేను తుళ్ళిపడ్డాను.

నిజమే! నేను అలా చాలా సార్లన్నాను. అంతేకాదు. నాకూ కిరీటికన్నా నువ్వంటేనే ఎక్కువ ఇష్టం అని కూడా అన్నాను.

"చెప్పు! అన్నావా లేదా?" గద్దించాడు జయ.

"అన్నాను మృత్యూ! మా బామ్మ..."

"బామ్మ సంగతి వదిలెయ్! నువ్వు నన్ను ప్రేమించావా లేదా."

"ప్రేమించాను. ఇంకా ప్రేమిస్తున్నాను!" అన్నాను బేలగా చూస్తూ. "అసలు ప్రేమంటే ఏమిటో తెలుసా నీకు?"

"ఎందుకు తెలియదు? ప్రేమంటే ఇష్టం."

"అంటే నామీది ప్రేమ కూడా మామూలు ఇష్టమేనా?"

నాకేం చెప్పాలో తోచలేదు.

"కిరీటి అంటే నీకిష్టంలేదని నువ్వు చెప్పలేదూ? పెద్దయ్యాక మనిద్దరం పెళ్ళి చేసుకుందామని చెప్పలేదూ! ఇవన్నీ మామూలు ఇష్టంతో చెప్పిన మాటలేనా?" నా చెయ్యి పట్టిగుంజేస్తూ అన్నాడు జయ.

"అది కాదు మృత్యూ! అప్పుడు కిరీటి నన్ను తెగ ఏడిపించేవాడు. అందుకే అలా అన్నాను. కానీ పాపం! తనిప్పుడు చాలా మారిపోయాడు. అందుకే ఈ పెళ్ళికి ఒప్పుకున్నాను!" అన్నాను బిక్కమొహంతో.

"అయితే ఒక్కమాట చెప్పు! నేనన్నా నీకిష్టం. కిరీటన్నా ఇష్టం. ఎవరంటే ఎక్కువిష్టం?" అన్నాడతను. నా చెయ్యి గుచ్చిపట్టుకుని.

"ఇద్దరన్నా ఇష్టమే!"

"అలా కాదు. ఎవరంటే ఎక్కువిష్టం! నన్ను, కిరీటినీ ఒకచోట నిల్చోపెట్టి మీబామ్మ- 'నీకెవరు నచ్చితే వాళ్ళని చేసుకో' అందనుకో. అప్పుడు నువ్వు ఎవర్ని చేసు

కుంటావు?" అన్నాడు నా కళ్లలోకి సూటిగా చూస్తూ.

"కిరీటినే చేసుకుంటాను. ఎందుకంటే పాపం కిరీటికి నేనంటే చాలా ఇష్టం కదా... నా కోసం ఇష్టంలేని పన్లు కూడా చాలా చేశాడు! పెళ్ళయ్యాక నన్ను పువ్వుల్లో పెట్టుకుని చూసుకుంటానని ప్రామిస్ చేసి మరీ చెప్పాడు!" అన్నాను.

అంతే! బిగించిపట్టుకున్న నా చేతిని వదిలేశాడు జయ. మొహం ప్రసన్నంగా అయిపోయింది.

"కంగ్రాట్స్ మున్నీ! మీ పెళ్ళి వైభవంగా జరగాలనీ, మీ కాపురం నిండు నూరేళ్ళు హాయిగా సాగిపోవాలనీ మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ఇంక వెళ్ళు నీ కోసం మీ కిరీటి వాళ్లు ఎదురుచూస్తూ వుంటారు!" అంటూ విసురుగా వెళ్లిపోయాడు జయ.

"మృత్యూ! ఒక్కమాట విను మృత్యూ!" అన్న నా మాటలు గాల్లో కలిసిపోయాయి.

★ ★ ★

"రాజు తల్చుకుంటే దెబ్బలకి కొదవా" అన్నట్టు బామ్మ నిర్ణయించాక ఇక తిరుగుంటుందా! అన్నట్టే మా ఇంటి పురోహితుణ్ణి పిలిపించి లగ్నాలు పెట్టించేశారు. సరిగ్గా పెళ్లికి పదిరోజులు మాత్రమే టైముంది. తెగ హడావిడి పడిపోతున్నారంతా. మా బామ్మ రోగం ఎటుపోయిందో నాన్నా వాళ్లు వారిస్తున్నా వినకుండా తెగ తిరిగేస్తోంది.

"నిన్నటి దాకా లేవడాన్నికూడా ఓపిక లేక మంచంలో పడున్న మనిషి ఇంత ఉత్సాహంగా ఎలా తిరుగుతోందో నాకర్థం కాలేదు. మా కిరీటి మొహమైతే పున్నమి నాటి చంద్రుళ్ళా వెలిగిపోతోంది.

అయితే నా మనసులో మాత్రం సంతోషం అన్నమాటే లేదు. అలా అని కిరీటితో పెళ్ళి ఇష్టం లేదని కాదు. నా పెళ్ళి మాట విన్నదగ్గర్నించీ జయ కనిపించకపోవడమే. నాకైతే పిచ్చెక్కినట్టుంది. అక్కడికే మేం ఆడుకునే చోట్లన్నీ గాలించాను. అయినా అతను కనిపించలేదు.

చివరికి వాళ్లింటికి వెళ్ళాను.

అప్పుడు డాక్టర్ మామయ్య, అత్తయ్య హాల్లో కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. నా కళ్ళు జయకోసం వెతికాయి. కానీ అతను కనిపించలేదు. నన్నుచూసి-



"ఏవిటే పెళ్ళికూతురా! ఇలా వచ్చావ్? పెళ్ళి కుదిరాక ఇంక నువ్విలా తిరక్కూడదు!" అంది అత్తయ్య నవ్వుతూ.

"కిరీటి తిరగడంలా? " అన్నాను మూతి అదోలా తిప్పుతూ

"కిరీటంటే మగాడు! కానీ నువ్వాడపిల్లవే!... అయినా ఇంకా కిరీటేమిటే బావా అని పిలవలేవూ? "

"ఛ! వాణ్ని! బావా అనా? "

"అయ్యో! కలికాలం! కాబోయే మొగుణ్ణి పట్టుకుని వాడు, వీడు అంటావా! ఇంక ఈ కాపరం సాగినట్టే!" అంది అత్తయ్య దీర్ఘం తీస్తూ. దానికి మామయ్య భార్యని విసుక్కున్నాడు.

"చిన్నప్పట్నించీ పిల్చిన అలవాటు! ఒక్కసారిగా మారమంటే మారుతుందా? పెళ్ళయ్యాక అన్నీ తనే తెలుసుకుంటుంది. అదిసరే! ఏమిటే యమునా ఇలా వచ్చావ్? " అన్నాడు నన్ను తన పక్కన కూర్చోపెట్టుకుంటూ.



## బడిపేరేంటి?

గోపాలం తన స్నేహితుడి ఇంట్లో ఓ ఐదేళ్ల కుర్రాడు కన్పిస్తే, 'బాబూ.. నీ పేరేమిటి? ' అని అడిగాడు.

'పప్పు' అన్నాడు వాడు.

'అది నీ ముద్దు పేరై ఉంటుంది. బడి పేరేంటో చెప్పు మరి?

'వివేకానంద పబ్లిక్ స్కూల్'

"జయ రెండు మూడు రోజుల్నుంచీ కనిపించడంలేదు. అందుకే..." నసిగాను.

ఈసారి పెద్దగా నవ్వాడు మామయ్య

"ఓసినీ! అయితే వాడికోసం వచ్చావన్నమాట! ఇంకా మమ్మల్ని చూడ్డానికొచ్చావేమో అని సంబరపడిపోతున్నాను. అవును మీ బామ్మెలా వుంది? " అన్నాడు కుతూహలంగా.

"దుక్కలా వుంది! నా పెళ్ళికోసమే ఆవిడకా రోగం వచ్చినట్టుంది!" అన్నాను విసుగ్గా.

"అదేమిటే ఈ పెళ్ళి నీకిష్టం లేదా? " విస్మయంగా అంది అత్తయ్య

"ఎందుకిష్టం లేదు. కానీ ఇంత హఠాత్తుగా లగ్నాలు పెట్టడమే ఇష్టం లేదు..."

"తప్పదే యమునా! మీ బామ్మ పరిస్థితి నిజంగా బాగాలేదు. ఈ పెళ్ళయేదాకా అయినా ఆవిడ బావుంటే అదే గొప్ప!" భారంగా అన్నాడు మామయ్య.

ఆయన మాటలు నన్ను రవంత కంగారు పెట్టిన మాట నిజం.

"కానీ ఆవిడ బానే తిరుగుతోందిగా!" అన్నాను.

"నీ పెళ్ళి చూడాలన్న కోరికే ఆవిడకంత శక్తినిచ్చింది. అయినా ఆవిణ్ణి ఎక్కువగా తిరగనీకండి! సాయంత్రం నేనోసారి వచ్చి చూస్తాన్లే!" అన్నాడు మామయ్య.

"జయ... జయ ఇంట్లో లేడా...? " అన్నాను మేడమెట్లకేసి చూస్తూ.

"లేడే! మా తమ్ముడొస్తే, వాడితో కలిసి కాలేజీకెళ్ళాడు..." అంది అత్తయ్య గర్వంగా

అసలు ఆవిడకి గర్వం జాస్తి. మామయ్యలాకాదు. గొప్పింటి ఆడబడుచనీ, వాళ్ళ తమ్ముడు పెద్ద కలెక్టరనీ బడాయి!

నేను నిరాశగా బైటికొచ్చేశాను.

ఎందుకో ఇంటికెళ్ళాలని అనిపించలేదు. సరాసరి వేణుగోపాలస్వామి గుడి కెళ్ళాను. తలుపులు మూసి వుండడంతో కళ్యాణమండపంలో కూలబడ్డాను.

"ఛ! నా పెళ్ళి విషయం గొప్పగా వెళ్ళి జయకి చెప్పాను. అందుకే తనకి నామీద కోపం వచ్చుంటుంది. అందుకే నా నుంచి తప్పించుకు తిరుగుతున్నాడు. ఈ విషయం చెప్పకుండా వుంటే బావుండేది!" అనుకున్నాను పదే పదే.

నేను చెప్పినప్పుడు అతనన్నమాటలూ, అతను చూసిన చూపులు నన్ను వెంటాడుతూనే వున్నాయి.

అలా ఎంతసేపున్నానో-

"ఏవిఁటే యమునా! అక్కడ కూర్చున్నావ్! అదీ నీ బృందం ఎవరూ లేకుండా? " అంటూ పూజారిగారు పిల్చేదాకా నాకు తెలియలేదు.

"ఏం లేదు తాతయ్యా! మనసు బాగా లేదు. అందుకే ఇలా వచ్చాను!" అన్నాను ఆరిందాలా.

ఆయన వింతగా చూశాడు నాకేసి "ఏ

మిటి మనసు బాగా లేదా? ఏమయిందమ్మా? నీకూ, కిరీటికీ పెళ్ళి నిశ్చయమయిందని కూడా విన్నాను. పదిరోజుల్లో పెళ్ళికూతురవబోతున్న నీకు మనసు బావుండకపోవడం ఏమిటి. పద తీర్థప్రసాదాలు తీసుకుందువుగాని!" అన్నారు ఆప్యాయంగా. నేను అల్లరి పిల్లనని తెలిసినా నేనంటే ఆయనకి చాలా ఇష్టం. నాకూ ఆయనంటే ఇష్టమే! పాపం చెప్పకుండా జామకాయలు, మామిడికాయలూ అవీ కోసుకున్నా ఏం అనడు.

ఆయనతో నడిచి, దేవుడికి దణ్ణం పెట్టుకుని, ఆయనిచ్చిన తీర్థప్రసాదాలు తీసుకున్నాను.

"బాగా పొద్దుపోయింది. ఇంక ఇంటికి వెళ్ళు" అని మిగతా వాళ్ళకి ప్రసాదాలు పంచడంలో పడిపోయాడాయన.

నేను మౌనంగా ఇంటికి బయల్దేరాను. అపుడూ నాకు ఇంటికెళ్ళాలని అనిపించలేదు. చెరువొడ్డున రావిచెట్టుకింద కూర్చుని నీళ్లలోకి రాళ్ళు విసురుతున్నాను. నీళ్ళలోనూ నాకు జయే కనిపిస్తున్నాడు.

ఎందుకో నాకు దుఃఖం వచ్చేస్తోంది.

పదినిమిషాల తర్వాత కిరీటివచ్చాడక్కడికి.

"అరె! నువ్వు ఇక్కడున్నావా! నీకోసం ఊరంతా వెతుకుతున్నాను. ఒంటరిగా ఇక్కడేం చేస్తున్నావ్? " అన్నాడు నా పక్కన కూలబడుతూ.

నేను ఒక్కసారిగా బావురుమన్నాను. అతను కంగారు పడిపోయాడు.

"ఏవిఁటి.. నువ్వు!... ఏడుస్తున్నావా? ఏమయింది యమునా? " అన్నాడు హడలిపోతూ.

"జయ కనిపించడంలేదు కిరీటీ!" ఏడుపును ఆపుకుంటూ అన్నాను.

"జయకనిపించడంలేదా? ""అవును. మన పెళ్ళని చెప్పినదగ్గర్నించీ అతన్నాక్కనిపించలేదు. మామయ్య వాళ్ల ఇంటికి వెళ్తే, జయ వాళ్ల కలెక్టర్ మామయ్య వచ్చాడట. ఆయనతో కలిసి కాలేజీకెళ్ళాడట!.. అదేం కాదు. జయ కావాలనే నన్ను తప్పించుకు తిరుగుతున్నాడు." అన్నాను కళ్ళు తుడుచుకుంటూ.

నా మాటలకి పక్కున నవ్వేశాడు కిరీటి.

"ఇందుకా ఇంత రాద్ధాంతం! భలేదానివే! వాడేదో బిజీగా తిరుగుతూండి వుంటాడు. అందులోనూ ఢిల్లీనుంచి వాళ్ల మామయ్య వచ్చాడని అంటున్నావుగా. అందుకే మనల్ని కలవడం కుదిరుండదు!" అన్నాడు తేలిగ్గా.

"అయితే నిన్ను కూడా కలవలేదా జయ? "

"లేదు. రెండు మూడు రోజులుగా నాకు కూడా వాడు కనిపించడంలేదు" ఏదో ఆలోచిస్తూ అన్నాడు కిరీటి.

"అయితే ఏదైనా ఊరెళ్ళాడేమో!"

"లేదు ఊళ్లోనే ఉన్నాడు. కాకపోతే వాళ్ల మామయ్య వచ్చాడుగా. ఆయనతో పాటు తిరుగుతున్నాడేమో!"

"వాళ్ల మామయ్య వచ్చినపుడు కూడా మనల్ని కలిసి మనతో మాట్లాడేవాడుగా!" అమాయకంగా అన్నాను.

"పోనిద్దూ! ఈ సారి మనింటికి ఎవరైనా చుట్టాలొస్తే వాడికసలు చెప్పద్దు!" అన్నాడు కిరీటి కసిగా

"కానీ ఇది వరకు వాళ్లతో పాటు మనల్ని సినిమాలకీ, షికార్లకీ తీసి కెళ్లేవాడుగా!" అన్నాను. దానికి కిరీటి ఏం మాట్లాడలేదు.

"కిరీటీ! సినిమా అంటే గుర్తొచ్చింది. మనం సినిమాకెళ్ళి చాలా రోజులైంది కదూ? " అన్నాను.

నాకు పక్కఊరెళ్ళి టూరింగ్ టాకీస్‌లో సినిమాలు చూడ్డమంటే చాలా ఇష్టం. అందుకే బామ్మ, ఏదైనా మంచి సినిమావస్తే మా ఎడ్లబండి మీద తీసుకెళ్ళి చూపిస్తుంది. ఇంట్రవెల్‌లో తినడానికి చేగోడీల్లాంటివి కూడా తెస్తుంది. ఎంచక్కా ఆ

చెగోడీలు తింటూ సినిమా చూడ్డం అంటే నాకు భలే ఇష్టం.

అన్నట్టు చిన్నపిల్లకి టికెట్టు వుండదని నాకు పదేళ్ళొచ్చేదాకా సినిమా హాలుగేటు దగ్గర ఎత్తుకునేది, గేటు వాడు టికెట్ అడిగితే-

"ఏమిటయ్యా! పిల్లకెన్నేళ్ళనుకుంటున్నావ్! అయిదేళ్ళు నిండలేదు. బస్సులో కూడా టికెట్ తీసుకోరు. నువ్వేంటి టికెట్ అంటూ గోల చేస్తున్నావ్!" అంటూ తనే పెద్ద గోల చేసేది. ఆవిడ చెప్పిన మేరకు మొహాన్ని ఆవిడ మెడలోనే దాచుకునే దాన్ని లోపలికెళ్ళి కూర్చునేదాకా.

లోపలికెళ్ళగానే బియ్యం బస్తా పడేసినట్లు ధన్‌మంటూ కింద పడేసేది. ఎంతైనా గుమ్మటంలా ఉన్న నన్ను మొయ్యడం కష్టం కదా. బామ్మే కాదు. మా ఊళ్ళో చాలా మందే ఇలా చేసేవారు.

"ఏమిటీ అంతలా ఆలోచిస్తున్నావ్! ఇంకా ఆ జయగాడి గురించేనా? " చిరాగ్గా అన్నాడు కిరీటి.

"కాదు సినిమా గురించి! బామ్మ నన్ను ధన్‌మంటూ పడేయడం గురించి!" నవ్వాను.

"అమ్మమ్మ పడేసిందా? "

"అదే కిరీటీ మనం సినిమాకెళ్తే ఎత్తుకొని..." అంటూ విషయం చెప్పాను. కిరీటి కూడా నవ్వాడు.

"ఇంక అలా చెయ్యదులే. ఇప్పుడు పెద్దదానివయ్యావ్, అదీగాక పెళ్ళవుతోంది!" అన్నాడు గర్వంగా చూస్తూ.

"నిజమే!" అన్నాను నేనూ నవ్వేస్తూ.

మళ్ళీ మా మాటలు జయ మీదకెళ్ళాయి. జయ మాట రాగానే నా మొహం అదోలా అయిపోయింది. ఆలోచనలో పడ్డాను.

"యమునా! నేనోమాట అడగనా? " మెల్లగా అన్నాడు కిరీటి.

"ఏవిటి? "

"నేనంటే నీకిష్టమేగా? "

"ఎందుకిష్టంలేదు! బోలెడిష్టం!" గభాల్న అనేశాను.

"నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టమేకదా? "

"ఇష్టం కాకపోతే పెళ్ళికి ఎందుకొప్పుకుంటాను? " విసుగ్గా అన్నాను.

"మరైతే... మన పెళ్ళి నిశ్చయం అయిందగ్గర్నించీ నువ్వు అదోలా వున్నావేమిటి? ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ తిరిగే నువ్వు మూడీగా అయిపోయావేవిటి? " నిలదీసినట్టు అన్నాడు కిరీటి.

నాకు మళ్ళీ ఎక్కళ్ళేని దిగులూ వచ్చేసింది.

"ఇదంతా జయ మూలంగానే!" అన్నాను చిరాగ్గా.

"జయమూలంగానా? "

"అవును! మన పెళ్ళి విషయం చెప్దామని వెళ్లాను. విషయం చెప్పేసరికి బిత్తరపోయాడు. నన్ను చేసుకుంటానని చెప్పి ఆ కిరీటిని చేసుకుంటావా అని కొట్టినంతపని చేశాడు!" అంటూ ఆనాడు జరిగిందంతా అక్షరం పొల్లుపోకుండా చెప్పేశాను.

కిరీటి ఆలోచనలో పడిపోయాడు.

"కిరీటీ!... అది వరకు నువ్వంటే ఇష్టం లేదుగా. అందుకే అతన్ని చేసుకుంటానన్నాను. నువ్విప్పుడు మారిపోయావుగా. అందుకే నిన్ను చేసుకుంటున్నాను. నేను చేసింది తప్పా? " అమాయకంగా అన్నాను.

"ఏం కాదు చిన్నప్పుడు ఎన్నో అనుకుంటాం. అవన్నీ జరగాలా? అంతెందుకు! మనం మొన్నమొన్నటి దాకా బొమ్మల పెళ్ళిళ్ళు అంటూ ఫ్రెండ్సంతా కలిపి పెళ్ళిళ్ళు చేసుకున్నాం. మరవన్నీ నిజం పెళ్ళిళ్ళు అయిపోతాయా? ఇవన్నీ ఆలోచించి నీ మనసు పాడు చేసుకోకు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావ్! దట్సాల్!" అన్నాడు తేలిగ్గా.

"అసలు ప్రేమంటే ఏమిటి? " అన్నాను

**శాంతంగా, నిబ్బరంగా ఉండటమే నిజమైన శక్తికి నిదర్శనం. - లిన్‌యుటాంగ్**

అమాయకంగా.

"ప్రేమంటే... ప్రేమంటే... ఇష్టం!"

"మరి ప్రేమ అమ్మానాన్నల మీద, బామ్మ మీదా కూడా ఉంటుందిగా? "

"ఛ! తెలివితక్కువ మొద్దు!... ఆ ప్రేమలు వేరు. ఓ పెళ్ళి కాని అబ్బాయి, ఓ పెళ్ళి కాని అమ్మాయి ఒకర్నొకరు ఇష్టపడు తున్నారంటే అదే ప్రేమ!" నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ- అన్నాడు కిరీటి.

"మరైతే నేను జయని ప్రేమిస్తున్నాను. జయా నన్ను ప్రేమిస్తున్నాడు. పెళ్ళి కూడా చేసుకుందామనుకున్నాం. మరి దీన్నేమం టారు? " అన్నాను సూటిగా చూస్తూ.

తుళ్ళి పడ్డాడు కిరీటి. అప్రయత్నంగా నా చేతులు వదిలేశాడు. మొహం గంభీరంగా అయిపోయింది.

"అయితే ఆ జయనే చేసు కోకపోయావా? " అన్నాడు కస్సుమన్నట్టు. జవాబు తెలియకపోతే అలా అరవడం కిరీ టికి అలవాటే.

"లేదు. నాకు జయని చేసుకోవడం ఇష్టం లేదు. నువ్వంటేనే నాకు ఎక్కువిష్టం! ఇష్టం ఎక్కువ వున్నవాళ్ళనే కదా చేసుకోవాలి? " అన్నాను అనునయంగా.

అతని మొహం కాస్త తేరుకుంది.

"మరింక ఈ దిగులెందుకు? ఇంక ఆ జయ సంగతొదిలెయ్యి" అన్నాడు ఉత్సాహంగా.

"కానీ జయ బాధ పడుతున్నాడు. అతను బాధ పడితే నేను భరించలేను. పోనీ ఓ పని చేస్తే? " అన్నాను ఆతృతగా.

"ఏమిటి? నేను మీ ఇద్దర్నీ ప్రేమిస్తు న్నాను కదా. ఇద్దర్నీ చేసుకుంటే? "

"ఏవిఁటీ, ఇద్దర్నీ చేసుకుంటావా? " పక్కనే బాంబు పడ్డట్లు తుళ్ళిపడ్డాడు కిరీటి.

"అవును. అలా చేస్తే ఎవరికీ బాధుం డదు. మన కరణంగారి తమ్ముడు ఇద్దర్ని చేసుకోలేదూ!"



"వాళ్ళు మగాళ్ళు" తేరుకున్న కిరీటి మెల్లిగా అన్నాడు. ఆ మాటకి నాకు కోపం వచ్చింది.

"ఏవిఁటి మగాళ్ళయితే చేసుకోవచ్చు గానీ ఆడవాళ్ళు చేసుకోకూడదా. ఆడవాళ్ళు నీకంత తక్కువగా కనిపిస్తున్నారా? పోనీ అలాగే అనుకుందాం. ద్రౌపది అయిదు గుర్ని చేసుకోలేదా? అసలు మన పురా ణాల్లో ఎంతమందికి ఒకడి కన్నా ఎక్కువ మొగుళ్ళు లేరూ. వాళ్ళే చేసుకున్నప్పుడు మనం చేసుకుంటే తప్పా? " అన్నాను పెద్ద లెక్చరిస్తూ.

కిరీటికి ఎక్కళ్ళేని నీరసం వచ్చేసింది.

"అయ్యో! యమునమ్మ తల్లీ! ఇన్నాళ్ళు నీకు మెదడు మోకాలులోనే వుందనుకు న్నాను. కానీ అసలు నీకు మెదడే లేదని ఇదిగో ఇప్పుడే తెలిసింది. అయిదుగుర్ని కాకపోతే పదిమందిని చేసుకో" అంటూ విసురుగా లేచాడు.

"అదికాదు కిరీటీ! పాపం జయని తల్చు కుంటే బాధేసి అలా అన్నానేగాని... నాకు నువొక్కడివీ చాలు!" అంటూ అతని చెయ్యి పట్టుకుని కూర్చోపెట్టాను.

"బతికించావ్! ఇంతకీ నీ బాధ జయని గురించేగా" అన్నాడు ప్రశాంత స్వరంతో

"అవును!... మన పెళ్ళయితే శరత్‌బాబు నవల్లో దేవదాసులా అయిపోతాడేమో అని భయంగా వుంది" అన్నాను దిగులుగా.

"నీకా భయం అక్కర్లేదు. అసలు నువ్వు చేసుకుంటానన్నా వాడు నిన్ను చేసుకోడు" ఖచ్చితంగా అన్నాడు కిరీటి.

"ఏవిటీ? "

"అవును యమునా! నీకు వైదేహి తెలు సుగా! అదే జయావాళ్ళ మామయ్య కూతురు"

"అదెందుకు తెలియదు. ఒకటి రెండు సార్లు ఇక్కడికొచ్చిందిగా. కలెక్టర్ కూతు ర్నని తెగ పొగరు. అంతేకాదు. బ్రహ్మారాక్ష సట. కోపం వస్తే చేతిలో వున్నది విసిరికొ ట్టేస్తుందట. దాన్ని చూస్తేనే నాకు ఒళ్ళు

మంట!" అన్నాను కోపంగా.

"ఆc! హిడింబినే జయ చేసుకోబోతున్నాట్ట! అంతేకాదు. జయని తన దగ్గరికి తీసుకెళ్ళి, చదువు చెప్పిస్తాట్ట వాళ్ళ మామయ్య. చదువయ్యాక, కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాట్ట. ఇదంతా జయా వాళ్ళమ్మా, వాళ్ళ మావయ్యా కలిసి వేసిన ప్లానట! జయక్కూడా ఆ వైదేహి అంటే చచ్చే ఇష్టంట. అలాంటివాడు, నిన్ను చేసుకోలేదని బాధపడతాడా? " అన్నాడు కిరీటి.

"నిజమా? " నా కళ్ళు ఆశ్చర్యంతో విశాలమయ్యాయి. "డాక్టర్ మామయ్యనే అడుగు"

"అయితే జయ నా గురించి బాధపడడుగా? "

"పడడు! పడడూ! పడడూ!" నొక్కి మరీ చెప్పాడు కిరీటి.

అప్పటిగ్గానీ నా మనసు కుదుటపళ్ళేదు.

"పోన్లే, వైదేహి రాక్షసైతేనేం. పెళ్ళయ్యాక మారుతుంది. అని తృప్తిగా లేచి, కిరీటి చెయ్యి పట్టుకుని ఇంటికేసి నడిచాను.

ఆ రోజు మా మాస్టారొచ్చి పెళ్ళి కుదిరినందుకు నన్ను మా నాన్నని అభినందించి, నన్ను ఆశీర్వదించి

"ఏమే మున్నీ! పెళ్ళయ్యాకైనా ఈ అల్లర్లు మానేస్తావా? లేకపోతే మీ బావతో కలిసి మరింత అల్లరి చేస్తావా" అన్నాడు నవ్వుతూ

"లేదు మాస్టారూ! నేనిప్పుడు చాలా బుద్ధిమంతురాల్నైపోయాను. అంతేకాదు. ఎవరైనా పలకరిస్తే కాస్త సిగ్గుపడుతున్నాను కూడా" అన్నాను గర్వంగా. నిజంగానే పెళ్ళి మాటలొస్తే సిగ్గుపడుతున్నాను. సిగ్గుపడ్డం కాదు. అలా నటిస్తున్నానంతే. లేకపోతే నాకు సిగ్గేమిటి? ఒకోసారి కిరీటే సిగ్గుపడతాడు. కానీ నేను సిగ్గుపడను. కానీ పెద్దవాళ్ళు వూరుకోరే! పెళ్ళంటే అలా సిగ్గుపడాలట.

"ఇంకోటి తెలుసా! నేనెప్పుడూ వెన్ను విరుచుకుని మగరాయుళ్ళా నడుస్తానట. రేపు పెళ్ళి పీటల మీద కూడా నిటారుగా కూర్చుని దిక్కులు చూస్తానని మా బామ్మ నాకో శిక్ష వేసింది. ఓ సేరు కందిపప్పు, ఓ సేరు శనగపప్పు కలిపేసి రోజుకో డబ్బా నా చేతి ఏరి సపరేట్ చేయిస్తోంది. మరి అవి ఏరేటప్పుడు తల దించి తీరాలి కదా. కిరీటిగాడు మాత్రం దర్జాగా తలెత్తుకుని తిరిగేస్తున్నాడు. నాకిది మరీ కోపంగా వుంది. అయినా ఏం చేస్తాను. ఆడపిల్లనై పుట్టానుగా. వచ్చే జన్మలో మాత్రం చచ్చినా ఆడపిల్లగా పుట్టను. ఎంచక్కా కిరీటి, జయలా మగపిల్లాణ్ణయి పుట్టాలని ఆ దేవుడికి దణ్ణం పెట్టుకుంటాను. అంతేకాదు. వంద కొబ్బరికాయలు కొడతాను" అనుకున్నాను మనసులో.

"ఏమిటే అలా మౌనంగా వుండిపోయావ్" అన్నడు మాస్టారు.

"చెప్పానుగా మాస్టారూ! నేను బుద్ధిమంతురాలినైపోయాను" అన్నాను గర్వంగా. నేనన్న తీరుకి ఆయన పడీపడీ నవ్వాడు. ఇందులో అంత నవ్వడానికేం వుందో అర్థం కాలేదు.

మాస్టారు నాన్నతో మాట్లాడి, అమ్మ ఇచ్చిన చిక్కటి మజ్జిగ తాగి వెళ్ళిపోయాడు.

"ఏమే మున్నీ! నువ్వు అల్లరి మానేశావా? బుద్ధిమంతురాలివైపోయావా" బుగ్గలు నొక్కుకుంటూ అంది బామ్మ.

నేను పకపక నవ్వేశాను. బామ్మ మురిసిపోయింది. "అదీ! అలా ఎప్పుడూ నవ్వుతూ వుండాలి" అంటూ నా కోసం కిరీటి కోసం కొన్న బట్టలు, నగలూ చూపించింది. అబ్బో చాలా నగలు చేయించారు. అదే బామ్మతో అంటే-

"ఇవే ఏమిటే వజ్రాల హారం కూడా నీకే ఇస్తాను" నా చెంపలు పుణికి ముద్దుపెట్టుకుంటూ అంది బామ్మ.

నా కళ్ళు మెరిశాయి. అలా అని నాకు నగలంటే పిచ్చనికాదు. వజ్రాలహారం వజ్రాలహారం అని వినడమేగానీ దాన్ని నేనె

ప్పుడూ చూడనైనా చూడలేదు. ఓసారి చూపించమని పోరితే ఇనప్పెట్టెలోంచి తీసి మెరుపులా ఇలా చూపించి మళ్ళీ దాచేసింది బామ్మ. చూళ్ళేదు మొర్రో అన్నా వినిపించు కోకుండా దాచేసింది. అందుకే దాన్ని చూడాలన్న కుతూహలం నాకూ, కిరీటికీ కూడా ఉంది. ఇప్పుడు నా కోసం చేయించిన నగలు కూడా ఇంట్లో ఉన్న పాత నగలు చెరిపించి చేయించినవే అని నాకు తెలుసు. పట్టు పరికిణీలూ అవి ఇప్పుడు తీసుకున్నారు. పెళ్ళిచీర అని జానెడు వెడల్పు జరీ అంచున్న కంచిపట్టు చీర కొన్నారు. నా మొహం చిన్నపిల్లని అంత చీర ఎలా కట్టుకోగలను! కిరీటికి మాత్రం పట్టు పంచలు కొన్నారు. వాడికి లుంగీ కట్టుకోడమే చేతకాదు. ఇంక పంచేం కడతాడు? పంచెలో కిరీటిని ఊహించుకుంటే చచ్చే నవ్వొచ్చింది. అలా నవ్వుకుంటే నా నెత్తిన ఒక్క మొట్టు మొట్టింది అత్తయ్య. అలా నవ్వుకోకూడదట. ఒంటరిగా నాలో నేను నవ్వుకుంటే పిచ్చిదాన్ననుకుంటారట! "ఏంటో నవ్వడానిక్కూడా స్వతంత్రం లేదు" అనుకున్నాను బాధగా.

అసలు అత్తయ్య ప్రతిదానికీ వంక పెడుతుందేమిటి? అసలు ఇళ్ళు వేరైనా ఎప్పుడూ ఒకింట్లో ఉన్నట్టే కనిపిస్తారు. ఎంచక్కా అత్తయ్య వాళ్ళ ఊరు ఇంకో ఊరైతే ఎంత బావుండు. రైలో బస్సో ఎక్కి వెళ్ళొచ్చు. సెలవలన్నీ హాయిగా గడపచ్చు అనుకుని భారంగా నిట్టూర్చాను.

ఇరుగు పొరుగువాళ్ళూ, బంధువర్గం వచ్చి నా పెళ్ళి పనుల్లో మాకు సాయపడుతున్నారు. అమ్మలక్కలు అప్పడాలూ, వడియాలు, కందిసున్ని, మినపసున్ని లాంటివి తయారు చేస్తుంటే బైట పనులు మగాళ్ళు చేస్తున్నారు. అయితే ఎంతమంది వచ్చినా డాక్టర్ మామయ్య పెళ్ళాం మాత్రం పేరుకు వచ్చానన్నట్టు ఓ రెండు నిమిషాలుండి వెళ్ళిపోతోంది. చెప్పానుగా ఆవిడకి గర్వం ఎక్కువని. అందులోనూ డాక్టర్‌గారి భార్య. తనొచ్చి సాయం చేస్తే తన హోదా తగ్గిపోతుందేమో అని ఆవిడ బాధ. కానీ పాపం జయకి మాత్రం అస్సలు గర్వం లేదు. పేద వాళ్ళతో కూడా చక్కగా మాట్లాడతాడు. గంగిరెద్దువాళ్ళు అడిగితే వాళ్ళమ్మకి తెలియకుండా పాతబట్టలు తెచ్చి ఇచ్చేవాడు. డబ్బులు కూడా ఇచ్చేవాడు.

జయ గుర్తొచ్చి మనసంతా మళ్ళీ దిగులుగా అయిపోయింది. తను కనిపించకపోతే నాకు పిచ్చెక్కినట్టుంది. మరి కిరీటికి లేదా? అనుకుంటూ జయకోసం కలవరిస్తూనే ఉన్నాను.

తర్వాత కూడా నాకు జయ కనిపించలేదు. ఆ కొరత నా మనసులోనే కాదు. మొహంలో కూడా కనిపిస్తోంది. కిరీటీ రకరకాలుగా నచ్చచెప్తున్నాడు. పెళ్ళి నాలుగురోజులందనగా కూడా మేం కలిసి తిరుగుతూనే ఉన్నాం. ఎవరెన్ని రకాలుగా కామెంట్ చేసినా.

ఆరోజు పొద్దున్నే పనిపిల్ల చంద్రి ఆయాసపడుతూ ఓ వార్త మోసుకొచ్చింది.

మా రైతు రామరాజు కోడలు ఆత్మహత్యాప్రయత్నం చేసిందట. సమయానికి రామరాజుగారు చూసి రక్షించడం మూలంగా బతికిందేగానీ లేకపోతే ఈపాటికి ఉరితాడుకి వేలాడేదట.

"ఆ పిల్లకదేం రోగమే! పార్వతీపరమేశ్వరుళ్లాంటి అత్త మామలు, శ్రీరామచంద్రుడిలాంటి భర్త, లవకుశుల్లాంటి ఇద్దరు కొడుకులు, తిండికీ, బట్టకీ లోటులేని సంసారం! ఆత్మహత్య చేసుకునేంత కష్టం ఏం వచ్చిందీ?" దీర్ఘం తీస్తూ అంది బామ్మ.

"ఆc అదే! ఆ శ్రీరామచంద్రుడిలాంటి భర్త కాబట్టే, ఇన్నేళ్ళు కాపురం చేసిన పెళ్ళాంమీద అనుమానపడి సాధించాడు. ఆ అవమానం భరించలేక ఆ తల్లి చావబోయింది!" కోపంగా అంది చంద్రి.

"అర్థం అయేలా చెప్పి చావ్వే!" విసుగ్గా

అంది బామ్మ.

"అర్థం కావడానికేం ఉందమ్మా. ఆ అమ్మకి మేనరికం ఉందట. తాంబూలాలూ అవీ కూడా పుచ్చుకున్నాక పెద్దల మధ్య తగూ వచ్చి పెళ్ళి ఆగిపోయిందట. తర్వాత మన రామరాజుగారబ్బాయితో పెళ్ళి జరిగిందట. మేనత్త మేనమామ పిల్లలు కదా మన యమునమ్మ, కిరీటిబాబులాగే సరదాగా తిరిగేవారంట. ఈ మధ్య పెద్దల మధ్య తగాదాలు పోయి ఒకటైపోయారట. పట్నంలో ఉన్న ఆ బాబు మరదల్ని చూడాలని ఒకటి రెండుసార్లు రామరాజుగారింటి కొచ్చాడంట. ఇంకేం ఉందీ, బావామరదళ్ళ కబుర్లు విన్న రామరాజుగారి కొడుకు పెళ్ళాంని సాధించడం మొదలెట్టాడుట. అది రానురాను ఎక్కువవడంతో ఆ ఇల్లాలు భరించలేక ఉరేసుకోబోయిందంట. సమయానికి రామరాజుగారు చూసి, ఆమెని రక్షించి, జరిగింది తెలుసుకుని, కొడుకుని నానా తిట్లూ తిట్టారండి!" అంటూ హరి కథంత ఉత్సాహంగా చెప్పింది చంద్రి.

బామ్మ విస్తుపోయింది. బామ్మనేమిటి అందరం విస్తుపోయాం. రామరాజు కొడుకుని తిట్టిపోశాం.

అయితే అదక్కడితో ఆగలేదు. నా బుర్రలో ఓ అనుమానం మెరిసి, అది కొండలా పెరిగిపోయింది.

నేనూ, జయ అంతకన్నా ఎక్కువ చనువుగా తిరిగాం. పెళ్ళి కూడా చేసుకుందామనుకున్నాం. అతను కనిపించలేదని నేను శోకాలు కూడా పెట్టాను. అది చాలదన్నట్టు జరిగినవన్నీ కిరీటితో చెప్పాను. ఇప్పుడు ఏం అనకపోయినా, పెళ్ళయ్యాక కిరీటి నన్ను రామరాజు కొడుకులా కాల్చుకుతినడని గ్యారంటీ ఏమిటి?

తల్చుకుంటేనే నా గుండె దడదడలాడింది.

"బామ్మా! నేనీ పెళ్ళి చేసుకోను!" అన్నాను అరిచినట్టు.

తుళ్ళిపడ్డారంతా.

"ఏ పెళ్ళి!" అర్థం కానట్టు చూసింది బామ్మ.

"నేను కిరీటిని చేసుకోను!

"నీకేమైనా మతి పోయిందా? ఓ మూల రేపు పెళ్ళికూతుర్ని చెయ్యబోతుంటే ఇప్పుడు పెళ్ళొద్దంటావా! పిచ్చి పిచ్చి వాగుడు వాగావంటే నాలుగంటించి కూర్చోపెడతాను!" అంది అమ్మ ఎన్నడూ లేనంత కోపంగా.

అయినా నేనేం తగ్గలేదు.

"నేను నిజంగానే చేసుకోను. రేపు ఈ కిరీటిగాడు ఆ రామరాజుగారబ్బాయిలా నన్ను సాధిస్తే? " అన్నాను కోపంగా.

"వాడు నిన్నెందుకు సాధిస్తాడే? " బామ్మకేం అర్థం కాలేదు.

"అదే... నేనూ డాక్టర్ మామయ్య వాళ్ళ జయ సరదాగా తిరిగాం కదా. అదంతా కిరీటికి తెలుసు కదా. ఇప్పుడు సరదాకి పెళ్ళి చేసుకుని, రేపు జయతో మాట్లాడావో, జయని కలుసుకున్నావో" అంటూ సాధిస్తే? అమ్మో! నేనా ఉరులూ అదీ వేసుకోలేను బాబోయ్!" అన్నాను కళ్ళూ చేతులూ తిప్పుతూ.

ముందు నా మాటలకి తెల్లబోయి, తర్వాత పకపక నవ్వేశారు.

"ఓసి పిచ్చి మొహమా? నీకు ఏళ్ళొచ్చాయిగానీ బుద్ధి రాలేదే! కిరీటేమిటి నిన్ను సాధించడం ఏమిటి చిన్నప్పుడు అందరం సరదాగానే గడుపుతాం. వాడెవడో మూర్ఖుడు ఏదో చేశాడని అందరూ అలా అనుకుంటే ఎలాగే! ఇదిగో చూడు! కిరీటికి నువ్వంటే ప్రాణం. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. నాది హామీ!" అంది అత్తయ్య నన్ను పొదివి పట్టుకుంటూ.

"అవును యమునా! నిన్నెపుడూ చిన్న మాట కూడా అన్ను!" అప్పుడే వచ్చిన కిరీటి నమ్మకంగా అన్నాడు.

"నిజమేనా? "

"నీమీదొట్టు!"

ఇతి

"అయితే సరే!" అని నవ్వేశాను.

"హుఁ! ఇదెలా బతుకుతుందో!" భారంగా అంది అమ్మ అదోలా నిట్టూరుస్తూ.

"బ్రహ్మాండంగా నూరేళ్ళూ బతుకుతుంది. నువ్వేం దిగులుపడకు!" అంది బామ్మ.

"అది కాదమ్మగారూ! అసలా రామ రాజు..." అంటూ ఏదో చెప్పబోయిన చంద్రి బామ్మ గద్దింపుతో నోరు ఠక్కున మూసేసింది.

"అసలదంతా నీమూలంగానే వచ్చింది. అయినా ఎక్కళ్ళేని వార్తలూ మోసుకురాక పోతే, ఆ గొడ్లపాక శుభ్రం చెయ్యొచ్చుగా!" అంది అకారణంగా విరుచుకుపడుతూ.

చంద్రి ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపో యింది. మరి కాస్సేపటికి డాక్టర్ మామయ్య వచ్చి బామ్మని పరీక్షచేసి-

"ప్రస్తుతం బానేవుంది. కానీ మీరు మరీ పసిపిల్లలా పరుగులు పెట్టకూడదు. కాస్త రెస్ట్ తీసుకోండి!" అన్నాడు చనువుగా.

బామ్మ హాయిగా నవ్వేసింది.

"నా గుండెకేం పర్లేదయ్యా! నా మనవ రాలి పెళ్ళి అయ్యేదాకా అది ఆగమన్నా ఆగదు. అదిసరే! మన జయకి సంబంధం కుదిరిందటగా!" అంది కుతూహలంగా.

"కొత్తగా కుదిరేదేంవుందీ: మా బావమ రిది కూతురు వైదేహి తెలుసుగా. దాన్ని వీడి పెళ్ళాంగా ఏనాడో నిర్ణయించేసింది మా ఆవిడ. ఇంక ఆవిడ మాటకి తిరుగేం వుందీ!" నవ్వాడు మామయ్య.

"అయితే త్వరలో పప్పన్నం వుందన్న మాట!"

"అబ్బే! పెళ్ళి చదువయ్యాక!... ఎంగేజ్ మెంట్ మాత్రం ఇప్పుడు చెయ్యాలనుకుం టున్నాం!"

"బావుంది నాయనా! జయని బాగా చది వించు" అంది బామ్మ ఆప్యాయంగా.

"నేను చదివించడం ఏవిఁటి. వాణ్ణి గురించి ఇంక అన్నీ వాళ్ళ అత్తమామలే చూసుకుంటారు. అన్నట్టు మీకు తెలియదు కదూ? వాణ్ణి తీసికెళ్ళి తనదగ్గరే వుంచు కుని చదివిస్తాడట మా బావ. ఫారన్ పంపి పెద్ద డాక్టర్ని చేస్తాట్ట. అందుకే మామా అల్లుళ్ళు వెళ్ళి టి.సి. తెచ్చేసుకు న్నారు!" అన్నాడు డాక్టర్ మామయ్య కాస్త ఆనందంగానూ, కాస్త బాధగానూ-

నేను తుళ్ళిపడ్డాను.

"జయ ఢిల్లీ వెళ్ళిపోతాడా? " అన్నాను అప్రయత్నంగా.

"మరి వెళ్ళాలిగా! ఎల్లుండే ప్రయాణం. ఇంట్లో అంతా హడావిడిగా వుంది!... బామ్మగారెలా వున్నారో ఓసారి చూసి వెళ్దా మని వచ్చాను!" అంటూ ఆవిడకి మరికొన్ని జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడాయన.

ఎందుకో నామనసంతా భారంగా అయి పోయింది. జయకి పెళ్ళయినట్టు, తర్వాత ఆ వైదేహి జయని నానా హింసలూ పెట్టి నట్టూ ఆ బాధలు పళ్ళేక జయ రైలుకింద తలపెట్టినట్టూ రకరకాల దృశ్యాలు కళ్ళ ముందు నిల్చాయి.

నా అనుమానాలన్నింటినీ బామ్మ ఒంట రిగా వున్నప్పుడు ఆవిడ ముందుంచాను.

ముందునన్నో పిచ్చిదానిలా చూసి, తర్వాత నవ్వేసింది బామ్మ.

"పిచ్చితల్లీ! ఏవేవో వూహించుకుని ఎందుకు మనసు పాడుచేసుకుంటావ్! ఇప్పుడు నువ్వు తెగ అల్లరి చేస్తున్నావ్! ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావ్. రేపిలా వుంటావా! అలాగే వైదేహీను. కలవారిపిల్ల, అందులోనూ కలెక్టరు గారి ఏకైక సంతానం. గారాబంగా పెరిగింది. కాబట్టి కాస్త రాలుగాయితనం వున్నమాట నిజమే. కానీ ఆ పిల్లకి జయంటే చాలా ఇష్టంట. అతన్ని వదిలి క్షణంకూడా వుండలేనని గొడవచేస్తుందట. వాళ్ళమ్మ చెప్పిందోసారి! అందుకే నువ్వేం దిగులు పడకు!" అంది అనునయంగా.

అప్పుడు నా మనసు కాస్త తేలికపడింది. ఇల్లంతా బంధుమిత్రులతో నిండిపో



యింది. వీధి చివరిదాకా పచ్చని తాటాకులతో పందిళ్ళు వేశారు. మామిడి తోరణాలు కట్టారు. రంగురంగుల లైట్లు అమర్చారు. కొత్తగా వేయించిన రంగుల వాసన, పచ్చి ఆకుల వాసన, అత్తరు పన్నీరు వాసన కలిసి చిత్రమైన సువాస నలు వెదజల్లుతున్నాయి పరిసరాలు.

అయిందింటికే లేచి గాడిపొయ్యి దగ్గర చేరిపోయారు వంటవాళ్ళు. అమ్మలక్క లంతా హడావిడిగా తిరుగుతున్నారు ఈ పెళ్ళిభారమంతా తామే మోస్తున్నట్టు.

నేను మాత్రం నిద్ర నటిస్తున్నాను. ఈ పెళ్ళి వేడుకంతా నాకు ఆనందాన్నిస్తున్నా, నా పెళ్ళికి జయ రాడన్న విషయం మాత్రం నా గుండెల్లో కలుక్కుమంటోంది.

ఆరోజు ఉదయం తొమ్మిది గంటలకి పెళ్ళి కూతుర్ని చేసేది. కిరీటినీ అదే సమయానికి వాళ్ళ ఇంట్లో పెళ్ళి కొడుకుని చేస్తారు.

పెళ్ళితంతుకి బాగా అలసిపోతాననేమో నన్ను లేపలేదెవరూ.

ఢిల్లీ వెళ్ళేలోగా ఓసారి జయని కలవా లన్న కోరిక ఇంతై వటుడింతై అన్నట్లు పెరి గిపోయింది. కానీ ఎలా? ఈ టైములో నేను గడపదాటితే చంపేస్తారు!

ఆలోచించి, ఆలోచించి

"చంద్రీ!" అంటూ ఓ గావుకేక పెట్టాను.

చంద్రిరాలేదు గానీ అమ్మ వచ్చింది. "లేచావా?' అంటూ

"నాకు కాస్త తలనొప్పిగా వుంది. ఓ గంట దాకా నన్ను లేపకండి!" అన్నాను బద్ధకంగా ఆవులిస్తూ.

"అయ్యో నాతల్లీ! ఇప్పుడు తలనెప్పేవిటే! తలంటుకుని, పట్టుపరికిణి కట్టుకుని ఒంటెడు నగలూ పెట్టుకుని బైటికెళ్ళావు... దిష్టి తగిలి వుంటుంది!" అంటూ ఇంత ఉప్పు, మిరపకాయలూ తెచ్చి దిష్టితీసి-

"పడుకోతల్లీ!" అంటూ తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయింది అమ్మ.

అంతే! ధన్‌మంటూలేచి తలుపు గడి యేసి మరో తలుపు తెరుచుకుని బైటప డ్డాను.

తలమీద పైటచెంగు కప్పుకోవడం వల్లా, ఎవరి హడావిళ్ళో వాళ్ళుండడంవల్లా నన్నె

వరూ గమనించలేదు.

జయ ప్రతిరోజూ జాగింగ్ కెళ్తాడని నాకు తెలుసు.

నా ప్రయత్నం ఫలించింది.

అప్పుడే బయల్దేరుతున్నాడు జయ.

"మృత్యూ!" అన్నాను ఆదుర్దాగా.

పరుగెత్తబోతున్న వాడల్లా వెనక్కి తిరిగి చూశాడు.

అతని కళ్లలో విస్మయం లాంటిది తొంగి చూసింది. "నువ్వా!" అన్నాడు జాగింగ్ చేస్తూనే.

"నేనేగానీ క్షణం ఆగు!" అంటూ అతని చెయ్యి పట్టుకుని ఓ పక్కకి లాక్కెళ్లాను.

"ఏమిటిది!... ఇవాళ నిన్ను పెళ్లికూతుర్ని చేస్తున్నారని అమ్మ చెప్పింది. నువ్వేమిటిలా ఊరిమీద పడ్డావ్?" అన్నాడు సన్నగా నవ్వుతూ.

అతని నవ్వు చూశాక నాక్కాస్త ధైర్యం వచ్చింది.

"మృత్యూ!.. నువ్వు ఢిల్లీ వెళ్లిపోతున్నావా!" అన్నాను దీనంగా.

"యా!" అన్నాడతడు ఉత్సాహంగా.

ఇప్పుడతని మొహంలో ఎలాంటి దిగులూ లేదు.

"నా పెళ్లికుండవా!"

"కుదరదు మున్నీ! అయినా నేనెక్కడున్నా మీ పెళ్లి దృశ్యం సినిమాలా నాక్కనిపిస్తూనే ఉంటుందిగా!" మళ్లీ నవ్వాడు జయ.

ఈ జవాబు నాకు తృప్తిని కలిగించలేదు.

"నామీద కోపం పోలేదు కదూ?" అన్నాను.

"నీమీద కోపమా? ఎందుకు?"

"అదే.. నిన్ను చేసుకోకుండా..."

జవాబుగా పెద్దగా నవ్వాడు జయ.

నేను వింతగా చూశాను.

"పిచ్చి మున్నీ! నేనేదో సరదాగా అన్నాను. నువ్వు అదే పట్టుకూర్చున్నావా? అయినా మనం ఎన్ని కబుర్లు చెప్పుకోలేదు! అవన్నీ నిజాలవ్వాలని ఆశించామా! ఇదీ అంతే! అయినా నాకు ఆల్ రెడీ వైదేహితో మ్యారేజ్ ఫిక్సయిపోయిందిగా... తనంటే నాకిష్టం కూడా!" అన్నాడు జయ నిర్మొహమాటంగా.

నేను భారంగా నిట్టూర్చాను.

"ఏమిటిలా వున్నావ్! కొంపతీసి నీకు నన్ను చేసుకోవాలనుందా?" అన్నాడు జయ.

"ఛ! ఛ! అదేంకాదు. నాకు కిరీటినే చేసుకోవాలనుంది. కానీ నా పెళ్లికి నువ్వు ఉండవంటేనే దిగులుగా ఉంది!" అన్నాను. జయ పక పక నవ్వేశాడు.

అతని నవ్వు చూశాక -

"హమ్మయ్యా! జయ మామూలు మనిషైపోయాడు" అనుకున్నాను తృప్తిగా.

"నేను రాకపోయినా నా ఆశీస్సులు మీకెప్పుడూ ఉంటాయి. వెళ్లు! ఎవరైనా చూస్తే బావుండదు!"

"మనం ఏమైనా కొత్తవాళ్లమా? కొత్తగా మాట్లాడుకుంటున్నామా?" అన్నాను మొహం చిన్నబుచ్చుకున్నట్టు.

మరోసారి పెద్దగా నవ్వి-

"ఓసి పిచ్చిమొహమా! ఎవరైనా చూస్తే బావుండనిది మనిద్దర్నీ చూసి కాదే! కాస్సేపట్లో పెళ్ళికూతురిని చేయబోతున్న నువ్వు ఇలా చెట్లంటా, పుట్టంటా తిరగడం చూస్తే బావుండదంటున్నాను" అన్నాడు.

"నిజమే" అనిపించింది నాక్కూడా.

"సరే! నేను వస్తాను. ఢిల్లీ వెళ్లాక ఉత్తరాలు రాస్తావా!" అన్నాను.

"తప్పకుండా!"

"ప్రామిస్" అంటూ చెయ్యి చాచాను.

ఓ క్షణం నా కళ్లలోకి చూసి నాచేతిలో చెయ్యివేసి-

"ప్రామిస్" అన్నాడు.

"నన్ను మర్చిపోవుగా?"

"నిన్నేకాదు, మన బాల్యాన్నే మర్చిపోను. మన స్నేహం రైలు ప్రయాణంలో కలిసే ప్రయాణికుల స్నేహం లాంటిది కాదు. ఒకే ఇంట్లో నాలుగు పోర్షన్లలో

ఉండే కాపురాల మధ్య నుండే స్నేహం లాంటిదీ కాదు. ఇదో మధురమైన మరపు రాని పవిత్రమైన స్నేహం. దీన్ని ఎవరు మాత్రం మర్చిపోతారు" అంటూ పరుగు మొదలుపెట్టాడు జయ.

నేను నీరసంగా వెనక్కి తిరిగి ఎలాగో ఇల్లు చేరుకున్నాను.

అనుకున్న టైమ్‌కి మా పెళ్ళి అంగరంగ వైభవంగా జరిగిపోయింది. అందరూ తెలిసినవాళ్ళే. అందరూ దగ్గరి బంధువులే. పెళ్ళికొడుకైతే ఇంక చెప్పక్కర్లేదు! ఇంక పెళ్లిలో థ్రిల్ ఏంవుంటుంది? పట్టు పరికిణీలు, నగలూ చూసి మురిసిపోవడంతప్ప!

నన్ను ఓ మహారాణిలా చూసినా దిక్కులు చూస్తున్న నా తలని ఓసారి బలవంతంగా వంచి పోయేవాళ్లు అమ్మలక్కలు.

డాక్టర్ మామయ్య పెళ్లామైతే -

"ఈ నాలుగు రోజులైనా కాస్త సిగ్గుపడవే తల్లీ!" అంటూ సున్నితంగా నానెత్తిన మొట్టిందికూడా.

నాకు పిచ్చికోపం వచ్చింది.

"అసలు నేనెవర్ని చూసి సిగ్గుపడాలి? పెళ్లికొడుకు కొత్తా? అత్తమామలు కొత్తా!? బంధువర్గం కొత్తా? ఏమిటో ఈ పెద్దవాళ్ల ఆంక్షలు!" అని మనసులోనే విసుక్కున్నాను.

పెళ్లయ్యాక గృహప్రవేశమూ అదే ఊళ్లో! కాకపోతే మరో వీధిలో! కానీ చుట్టపక్కాలంతా వీళ్లేగా. అందుకే ఈ పెళ్లి నాకు పెద్ద ఆనందాన్నివ్వలేదనే చెప్పాలి.

"అయినా పెళ్లిలో ఏంవుందిలే! తర్వాత వుంది నూరేళ్ల జీవితం!" అనుకున్నాను. ఎప్పుడో బామ్మ అన్నమాటల్ని మననం చేసుకుంటున్నట్టు.

గుమ్మాల దగ్గర పేర్లు చెప్పమన్నప్పుడు నాకు చచ్చే నవ్వొచ్చింది. పెళ్లిపీటల మీద కూడా.

"కిరీటీ! ఆ నీళ్లిలా ఇవ్వు! కిరీటీ ఈ జడ కాస్త సర్దు!' అంటుంటే పురోహితులు సున్నితంగా మందలించారు. ఏమిటో ఈ పెద్ద వాళ్ల మనస్తత్వాలు! అనుకున్నాను

"చెప్పవే! నీ మొగుడి పేరు చెప్పు!" అందో పండు ముత్తైదువ బోసి నోటితో నవ్వుతూ.

"కిరీటిగాడు!" అన్నాను తిక్కరేగి.

ముందు బిత్తరపోయి, తర్వాత నవ్వేశారంతా.

కిరీటి తల మాత్రం సిగ్గుతో వంగిపోయింది. పాపం నేనన్న తీరు వాణ్ణి ... సారీ! ఇంక వాణ్ణి, వీణ్ణి అనకూడదు కదా... బాధ పెట్టినట్టుంది. నిజంగానే నాకు జాలేసింది.

"కిరీటిగారూ, నేనూ వచ్చాం తలుపుతియ్యండి" అన్నాను. అంతకుముందు ఓ ఇల్లాలు చెప్పమన్న విధంగా కిరీటి మొహంలో రవంత వెలుగొచ్చింది. బామ్మయితే నన్ను పట్టుకుని ముద్దులతో ముంచేసింది. తర్వాత రకరకాల వినోదాలతోనూ, సరసోక్తులతోనూ 'పెళ్లి వైభవం ముగిసిపోయింది. బామ్మ మాత్రం పొన్నకాయలా తయారయింది.

నాలో మార్పు పెద్దగా ఏంలేదు. అంతకుముందు మెళ్లో ఓ గొలుసు మాత్రం ఉండేది. ఇప్పుడు మంగళసూత్రాలూ, కాళ్లకి మట్టెలూ చోటుచేసుకున్నాయి.

అయితే కిరీటిలో మాత్రం చాలా మార్పొచ్చింది. ప్రతిదానికీ "నువ్వు నా పెళ్లానివి! నేను చెప్పినట్టు వినాలి!" అనేవాడు దబాయింపుగా. నాకు తిక్కరేగింది.

"పోవోయ్ బోడి! నీమాట వినేదేంటి. నాకు తోచింది నేను చేస్తాను" అనేదాన్ని నిర్లక్ష్యంగా. అసలు 'పోరా' అనాల్సింది. కానీ వాడు. సారీ!.... అతను నాకు మొగుడై కూర్చున్నాడుగా. అలా 'రారా, పోరా' అని పెళ్లయ్యాక పిలవనని బామ్మా వాళ్లకి మాట కూడా ఇచ్చానాయె!

ఒక రోజు నేను చెరువులో ఈతకొడుతుంటే వీరావేశంతో వచ్చాడు కిరీటి. తనకి చెప్పకుండా చెరువులోకి దిగినందుకు మండి

పడ్డాడు. నేనూరుకుంటానా? అంతకన్నా మండిపడ్డాను.

అంతే నా చెంపమీద ఒక్కటిచ్చాడు కిరీటి. "ఎంత ధైర్యం? నామీదే చెయ్యి చేసుకుంటావా? " అంటూ కిరీటి జుట్టుపట్టుకుని వంచి వీపుమీద నాలుగు పిడిగుద్దులు కొట్టాను. తను బిత్తరపోయి నన్ను చితక బాదాడు. అలా ఇద్దరం రెచ్చిపోయి కాట్ల కుక్కల్లా పోట్లాడుతున్నాం.

అప్పుడే అటుగా వస్తున్న పూజారిగారు మమ్మల్ని విడదీసి.

"ఛ! ఏవిటఁర్రా ఇది? ఇంతకుముందు వూరికే పోట్లాడుకునేవారు. పెళ్లయ్యాక ఏకంగా కొట్టుకునేదాకా వచ్చారా? " అన్నాడు మందలిస్తూ.

నాకు దుఃఖం వచ్చేసింది.

"మా అమ్మా నాన్నా కూడా నన్నెప్పుడూ కొట్టలేదు. అసలు వీడెవడు నన్ను కొట్టడానికి? " అన్నాను రోషంగా కళ్లు తుడుచుకుంటూ.

"ఎందుకురా కిరీటి! దానిమీద చెయ్యిచేసుకున్నావు? " నా చెంప నిమురుతూ అన్నారు పూజారిగారు.

"ఎందుకంటే తాతగారూ! ఇంత పొద్దుపోయాక చెర్లో ఈతలు కొట్టచ్చా! అదేం అంటే పిచ్చిపిచ్చిగా వాగుతుందా? అందుకే ఒక్కటిచ్చా. తనుమాత్రం ఊరుకుందా? మగాణ్ణని కూడా చూడకుండా బాదేసింది! దీని పని ఇంటికెళ్లాక చెప్తాను!" అంటూ క్రాఫ్ సరిచేసుకుంటూ వెనక్కి తిరిగాడు కిరీటి.

"ఏంట్రా నువ్వు చెప్పేది? నేనే చెప్తాను నీపని" అంటూ పళ్లు నూరాను. నిస్సహాయంగా చూశారు పూజారిగారు. తర్వాత నా తల నిమురుతూ-

"చూడుతల్లీ! ఏమైనా నువ్వతన్ని అలా కొట్టకూడదు. అంతేకాదు. వాడు వీడు అనకూడదు. ఎంతైనా అతను నీకు తాళికట్టిన భర్త కదా!" అన్నారు అనునయంగా. అక్కడితో నాకింకా కోపం వచ్చేసింది.

"ఏంటి భర్తా గోంగూర! నాకు తిక్కరేగిందంటే ఈ తాళి కాస్తాతీసి అవతల పారేస్తాను!" అంటూ మంగళసూత్రం మీద చెయ్యేశాను. పూజారిగారు హడలిపోయినట్టున్నాడు. కంగారుగా నా చేతిని తీసి, బుజ్జగించి ఏవేవో చెప్పారు. ఆయన మాటలు నాకు నచ్చకపోయినా, చెప్పే తీరు నచ్చి మౌనంగా ఉండిపోయాను.

"సరే! ఇంక వెళ్లు! మళ్లీ ఎప్పుడూ ఇలా పోట్లాడుకోకూడదు. సరేనా? " అన్నారాయన బతిమాలుతున్నట్టు. నేను అయిష్టంగానే తల ఊపి ఇంటికేసి నడిచాను.

నా కోపం కిరీటి మీంచి, పూజారిగారి మీంచిపోయి బామ్మమీదికెళ్లింది.

"అవును. అసలిదంతా బామ్మ మూలంగానే జరిగింది. 'చస్తాను, చస్తాను' అంటూ నాకు పెళ్లి చేసింది. తనకేం దుక్కలా ఉంది. నేనే అన్యాయమైపోయాను!" అనుకున్నాను. ఆ కోపంతోనే విసురుగా ఇంటికెళ్లాను. అప్పటికే కిరీటి విషయం చెప్పేసినట్టున్నాడు. అందరూ హాల్లోచేరి నాకోసం చూస్తున్నారు.

"ఏమిటే నువ్వు చేసిన పని!" అంటూ జబ్బపట్టుకుని ఒక్కగుంజు గుంజింది అమ్మ.

"నేనేం చేశాను ఆ కిరీటిగాడే! ముంగిమొహం వాడూను! ఎలా చూస్తున్నాడో" అంటూ ఓ పక్కగా నిల్చున్న కిరీటికేసి కోపంగా చూశాను.

"అదిగో మళ్లీ! కట్టుకున్న మొగుణ్ణి వాడు, వీడు అనకూడదని చెప్పానా? " గద్దించినట్టు అంది బామ్మ. నాకు మరింత కోపం వచ్చింది.

"ఛీ! అసలిదంతా నీవల్లే జరిగింది. నేనసలు కిరీటిగాణ్ని చేసుకోను మొర్రో అని మొత్తుకున్నాను. నువ్వే బలవంతంగా నా మెడలు వంచి తాళి కట్టించావు!" అన్నాను అచ్చం సినిమాల్లో వాళ్లు అన్నట్టు. బామ్మ ముందు బిత్తరపోయి, తర్వాత నా దగ్గరగా వచ్చి తల నిమురుతూ -

"ఇప్పుడేమయిందమ్మా, వాణ్ణి చేసుకో

వడం నీకిష్టమన్న తర్వాతేగా పెళ్లిచేసింది? " అంటూ ఏదేదో చెప్పబోయింది. నేనావిడ మాటలు వినిపించుకోకుండానే విసురుగా దూరం జరిగి-

"నేనేం అన్లేదు! అసలు నేను జయనే ప్రేమించాను. వాణ్నే చేసుకుందామనుకున్నాను. కానీ మీరందరూ కలిసి నా ప్రాణం తీసి నాచేత సరే అనిపించారు. అసలు నాకీమొగుడేవద్దు!" అంటూ అరిచాను.

"ఓహో... జయనే చేసుకుందామనుకున్నావా! అయితే వాణ్నే చేసుకోకపోయావా? " మరింత అరిచాడు కిరీటి.

"ఆ చేసుకుంటాను. నీకు విడాకులిచ్చేసి వాణ్నే చేసుకుంటాను!" అన్నాను విసురుగా.

"ఆc వాడు నీకోసం రెడీగా ఉన్నాడు చేసుకోవడానికి. నువ్విలా పిచ్చివాగుడు వాగితే డాక్టరు మామయ్యా అత్తయ్యే కాదు, ఆ వైదేహి కూడా కాళ్లు విరగ్గొడుతుంది? "

కోపంగా అంది బామ్మ.

"అదెవత్తి నా కాళ్లు విరగ్గొట్టడానికి? నేనే దాని కాళ్లూ చేతులూ విరగ్గొడతాను" అన్నాను అరుస్తూ.

"చూశారా దీని వాగుడు. ఇది బాగుపడదు!" ఆవేశం, ఆవేదన నిండిన గొంతుతో అంది అమ్మ. అయితే బామ్మ ఊరుకోలేదు.

"ఏంచెడిపోయిందది. బాగుపడకపోవడానికి, అసలు ఆడపిల్ల మీద వీడు చెయ్యెందుకు చేసుకోవాలి? " అంది నన్ను వెనకేసుకొస్తూ.

నాకు చాలా సంతోషం వేసింది.

"అదీ! అలా చెప్పు! నేను చెర్లో ఈతకొడితే వీడికెందుకు, చెట్లెక్కి దూకితే వీడికెందుకు? " అన్నాను ఆవిడపక్కన చేరుతూ.

నన్ను తిట్టి లాభం లేదనుకున్నారేమో. అందరూ తగ్గిపోయారు.

"అదికాదమ్మా! కిరీటి తొందరపడి చెయ్యి చేసుకున్నాడే అనుకో. వచ్చి మాతో చెప్పాలిగానీ, వాడిమీద పడి కొట్టడం తప్పుకదూ? " అంది అత్తయ్య.

"అంటే నువ్వూ వాణ్ణే వెనకేసుకొస్తున్నావా? అవున్లే వాడు నీకొడుక్కదా! ఏంచేసినా బానే ఉంటుంది" అన్నాను.

"చిన్నితల్లీ! కిరీటిని బావ అనకపోయినా పరవాలేదుగానీ, వాడు, వీడు అనకే! నీకు పుణ్యం ఉంటుంది!" నిస్సహాయంగా అంది బామ్మ.

"అవునే యమునా!... ఎంతైనా వాడు నీ మొగుడు. అలా ఏరా, పోరా అని పిలిస్తే నలుగురూ నవ్వుతారు! ఇవాళ రోడ్డునపడి సివంగిలా వాడిమీద పడ్డావు కదా! అంతా నీగురించి ఏమనుకుంటారు!" నా గురించి తెలిసిన అత్తయ్య పూర్తిగా తగ్గిపోయి అనునయంగా అంది.

"వాణ్ని గురించి మాత్రం అనుకోరా!"

"అదికాదే! వాడు మగాడు" అంటూ ఏదో చెప్పబోయింది అత్తయ్య. కానీ నేను వినిపించుకోలేదు.

'అయితే ఏంటి? మగాడైతే నలుగుర్లో చెంపచెబ్బ కొట్టవచ్చా? " అన్నాను కోపంగా.

"కొడతానే! మళ్లీ కొడతాను! ఎవరితో చెప్పుకుంటావో చెప్పుకో! నాకేం భయం లేదు! పరువుపోయేది నీకే!" కసిగా అన్నాడు కిరీటి. మళ్లీ ఇద్దరం దారుణంగా పోట్లాడుకున్నాం. పెద్దలు ప్రతినిధుల్లా నిల్చుండిపోయారు. బామ్మ మాత్రం -

"హోరి భగవంతుడా ఉద్దాలకుడు, చండికల్లా ఉన్న వీళ్లు రేపు కాపురం ఎలా చేస్తారు!" అంటూ తలబాదుకుంది.

"సరే. జరిగిందేదో జరిగిపోయింది. ముందు వెళ్లి ఆ తడిగుడ్డలు మార్చుకురా!" అంది అత్తయ్య నీరసంగా. నేను విసురుగా లోపలికెళ్లగానే కిరీటి బామ్మమీద, అత్తయ్య మీదా ఇంతెత్తున లేచాడు, నన్ను మందలించలేదని. దానికి అత్తయ్య మండిపడుతూ-

"అది చిన్నపిల్ల! ముందూ వెనక చూడకుండా చెయ్యి చేసుకోవడమేనా? దాన్ని

**తప్పులెన్నటం మొదలుపెడితే చుట్టాలంటూ ఎవరూ ఉండరు. - రాబర్ట్ ఫ్రాస్ట్**

మందలించడానికి పెద్దవాళ్లం మేం లేమా? " అంటూ దులిపేసింది. కిరీటి మొహం ముడ్చుకున్నాడు గానీ నాకు మాత్రం భలే ఆనందమేసింది.

"తిక్క కుదిరింది. లేకపోతే ఇప్పట్నించే నామీద పెత్తనం చెలాయించాలనుకుంటు న్నాడు!" అనుకున్నాను కసిగా. అంతేకాదు, జయని కాదని కిరీటిని చేసుకున్నందుకు బాధ పడ్డాను కూడా.

నిజంగా జయ చాలా మంచివాడు. ఈ కిరీటిలా ఎప్పుడూ రుసరుసలాడడు! అను కుంటే జయ రూపం కళ్లముందు కదలా డింది.

జయ ఇప్పుడేం చేస్తున్నాడో! పాపం! "నాగురించే ఆలోచిస్తూ ఉండివుంటాడు. అయినా అమాయకుడైన జయ రాక్షసి లాంటి ఆ వైదేహిని చేసుకుని ఏం సుఖప డతాడు? ఆమెని చేసుకున్నందుకు నాలా తనూ బాధపడుతూ కాలం గడుపుతాడు!" అనుకుంటేనే నా మనసంతా దిగులుగా అయిపోయింది.

బట్టలు మార్చుకుని మళ్లీ హాల్లోకొచ్చాను. అందరూ ప్రతిమల్లా కూర్చున్నారు. మాటా పలుకూ లేకుండా. నేనేం పట్టించుకోకుండా తంపటకాయలు తినడంలో పడిపోయాను.

నాలుగు రోజులు గడిచిపోయాయి. గానీ నేనూ, కిరీటి రాజీకి రాలేదు. ఎడమొహం పెడమొహంగానే ఉన్నాం. మా వాళ్లంతా కలిసి మాకు ఎన్నో రకాలుగా సర్దిచెప్పాలని చూశారు. కిరీటి కాస్త తగ్గాడుగానీ నేను మాత్రం తగ్గలేదు. నడివీధిలో నన్ను చెంప దెబ్బ కొట్టడాన్ని నేను సహించలేకపో యాను.

మరో రెండు రోజులు గడిచాయి. కిరీటికి నామీద కోపం పూర్తిగా పోయింది. నాతో మాట కలపాలని ప్రయత్నించి చిత్తుగా ఓడిపోయాడు. నాకు మాత్రం భలే గర్వంగా అనిపించింది.

"ఆడపిల్లకి అంత అహం, అదిరిపాటూ పనికిరావు" అంటూ అమ్మ సాధింపు మొద లయింది. నాన్న, మామయ్యా కూడా నాకు నచ్చచెప్పాలని ప్రయత్నించారు. బామ్మ, అత్తయ్యా సరేసరి. చివరికి కిరీటి నాకు సారీ చెప్తే మాట్లాడతానన్నాను. అంతేకాదు జీవి తంలో మళ్లీ ఎప్పుడూ నామీద చెయ్యి చేసు కోనని మాట ఇవ్వాలన్న షరతు కూడా పెట్టాను.

కిరీటి అయిష్టంగానే నాకు సారీ చెప్పాడు. ఇంకెప్పుడూ చెయ్యిచేసుకోను అని కూడా అన్నాడు.

"అదీ! అలారా దారికి!" అంటూ గర్వంగా తలెగరేశాను. కిరీటికది బాధ కలిగించినా, ఏమైనా అంటే నేను మళ్లీ మాట్లాడను అను కున్నట్టున్నాడు. మౌనంగా వెళ్లిపోయాడు.

పాపం! కిరీటి మొహం చూస్తే ఈసారి నాకు జాలేసింది. "ఛ! నేనే తప్పుచేశాను. తనేదో తెలియక చెంపదెబ్బ కొట్టాడే అను కోండి. తిరిగి నేను జుట్టుపట్టుకుని వంచి పిడిగుద్దులు గుద్దడమే? " అనుకున్నాను. నా ముఖకవళికలు గమనించిందేమో.

"ఇంక సత్యభామ శాంతించినట్టేనా? " అంది బామ్మ ముసిముసిగా నవ్వుతూ. ఇంతలో పాలేరొచ్చి కర్రావు ఈనిందమ్మా కోడెదూడ!" అంటూ ఆనందంగా చెప్పాడు.

అంతే! నాకు వెర్రి ఆనందం వచ్చేసింది. జరిగిందంతా మర్చిపోయి-

"బామ్మా! నేను కిరీటి దగ్గరికెళ్తున్నాను. వెంటనే తనని తీసుకొచ్చి బుజ్జి గిత్తదూడని చూపించాలి! అన్నట్టు కిరీటికి జున్నంటే చచ్చే ఇష్టం. ఎంచక్కా మిరియాలు, యాల కులు వేసి జున్ను చెయ్యండి" అంటూ పరి గెత్తాను.

"ఓసి నీ అసాధ్యం కూలా? " అని బామ్మ విస్తుపోవడాన్ని గమనించినా గమనించనట్టే ఒక్క అంగలో అత్తయ్యా వాళ్ళిల్లు చేరాను. వీధి అరుగు మీద ఒంటరిగా కూర్చున్న కిరీటి నన్ను చూసి గభాల్న లేచాడు.

"కిరీటీ! మన కర్రావు ఈనింది. కోడె

దూడ పుట్టింది. తొందరగా రా!" అంటూ చెయ్యి పట్టుకున్నాను. కిరీటి మొహం వెలిగిపోయింది. అది కర్రావు ఈనినందుకో, లేక నేను తనతో మునుపట్లా మాట్లాడినందుకో అర్థం కాలేదు.

"నువ్వు చూశావా? దూడ బావుందా? " అన్నాడు ఉత్సాహంగా నాతో నడుస్తూ.

"నీకు చూపించకుండా నేనెలా చూస్తాను? తొందరగా పద!" అంటూ అతన్ని లాక్కెళ్తున్నట్టు పశువుల కొట్టం దగ్గరికి తీసికెళ్లాను.

అప్పుడే సంజీవి ఆవుకి వడ్లు, బెల్లంలాంటివి తినిపిస్తున్నాడు. పక్కనే ముద్దులు మూట కడుతున్నట్టున్న ఆవు దూడ లేవడానికి ప్రయత్నిస్తోంది. ఇద్దరం దాన్ని చూసి మురిసిపోయాం. దాని అందచందాలని, చలాకితనాన్ని మెచ్చుకున్నాం.

అయితే మా వాళ్ళంతా ఆవుకేసి గానీ, దూడకేసి గానీ చూడ్డం లేదు. విస్మయంగానూ, ఆనందంగానూ మా ఇద్దరికేసే చూస్తున్నారు.

"ఏమే అమ్మడూ! ఇప్పుడను. ఆ జయనే చేసుకుంటే బావుండేదని!" అంది బామ్మ సవాల్ చేస్తున్నట్టు.

"ఛీ! జయనెందుకు చేసుకుంటాను? నాకు కిరీటంటే ఇష్టం" అన్నాను ప్రేమగా కిరీటికేసి చూస్తూ.

"నువ్వు అలా అన్నా జయకన్నా నేనంటేనే నీకు ఎక్కువిష్టం అని నాకు తెలుసు!" అన్నాడు కిరీటి ఆనందంగా

"మరైతే ఇంకెప్పుడూ ఆ జయని గురించి అలా మాట్లాడకూ? " అంది అత్తయ్య.

"మరి కిరీటిని నన్నెప్పుడూ కొట్టద్దని చెప్పు!" అన్నాను.

"నిజంగా ఇంకెప్పుడూ కొట్టను" అన్నాడు కిరీటి నమ్మకంగా. నేనూ జయని గురించి మాట్లాడను!" అనేశాను.



## పన్నెండుసార్లు

భర్త వదిలేశాడని చెప్పి ఒకావిడ కోర్టుకెక్కింది. ఆవిడకు పదమూడు మంది పిల్లలున్నారు. వాళ్ల వయసులు ఏడాదినుంచి పదమూడేళ్లున్నాయి.

**జడ్జి:** మీ ఆయన నిన్నెప్పుడు వదిలేశాడు?

**ఆమె:** పన్నెండేళ్లక్రితం..

**జడ్జి:** (ఆశ్చర్యంగా) మరి ఇంతమంది పిల్లలేమిటి?

**ఆమె:** ఆయన మళ్లీమళ్లీ వచ్చాడయ్యా.

ఆ రోజంతా ఆవు దగ్గరే వున్నాం, నేనూ, కిరీటి, సంజీవి ఆవుపాలు తీసి అమ్మకివ్వగానే ఓ గంటలో అమ్మ చక్కని జున్ను తయారుచేసింది. అందరం కబుర్లు చెప్పుకుంటూ తిన్నాం.

జున్ను మొదటిరోజు పాలతో చేస్తేనే బావుంటుంది. గట్టిగా వున్న ఆ జున్నంటే నాకూ కిరీటికీ కూడా ఇష్టం. పాపం జయక్కూడా ఇష్టమే. ఆ మాటే అందామంటే, జయ మాట ఎత్తితే మళ్ళీ వీళ్ళందరికీ ఎక్కడ కోపం వస్తుందో అని మాట్లాడ లేదు.

"బామ్మా! ఢిల్లీలో జున్ను దొరుకుతుందా? " అన్నాను ఏదో ఆలోచిస్తూ.

"ఏమోనే! అయినా ఇప్పుడు ఢిల్లీ గురించి

ఎందుకు? " అంది బామ్మ కళ్ళు చిట్లించి.

"నాకు తెలుసులే" నవ్వాడు కిరీటి. ఏమి టన్నట్టు తలెగరేశాను.

"పాపం! మన జయక్కూడా జున్నంటే చాలా ఇష్టం కదా. ఆ విషయం గుర్తొచ్చిన ట్టుంది. అవునా మున్నీ? " అన్నాడు కిరీటి ఆప్యాయంగా. అవునన్నట్టు తలూపాను.

"దొరుకుతుందేమోలే! అయినా ఢిల్లీలో కలెక్టర్ గారింట్లో వుండే జయకి ఇప్పుడు మనం, మన పల్లె గుర్తుండదు. ఇంక జున్ను గురించి ఏం ఆలోచిస్తాడు!" అంది బామ్మ అదోలా.

"ఛ! జయ అలాంటివాడు కాదమ్మమ్మా! పాపం వాడికెప్పుడూ మేమంటే ప్రాణమే. ఈ పల్లె అంటే కూడా చాలా ఇష్టం. మన పల్లెలాం టిది ఎక్కడా వుండదు అనేవాడు ఎప్పుడూ!" అన్నాడు కిరీటి జయని వెనకేసుకొస్తూ. అతని మాటలు నాకెంతో ఆనందాన్నిచ్చాయి.

"కిరీటి! నిజంగా నువ్వు చాలా మంచివా డివి" అన్నాను చెయ్యి పట్టుకుని నొక్కుతూ



★ ★ ★

నేనూ, కిరీటీ నాలుగు రోజులు సఖ్యతగా వున్నట్టే వుండేవాళ్ళం. మళ్ళీ చిన్న చిన్న విషయాలకే తగూలాడుకునేవాళ్ళం. ఒకళ్ళ మీద ఒకళ్ళం అరుచుకునేవాళ్ళం. "వీళ్ళది మార్జాల దాంపత్యమే అయ్యేలా వుందే" అంటూ బామ్మ తలబాదుకునేది. అమ్మకీ, అత్తయ్యకీ కూడా మా గురించి తెగ దిగులు పట్టుకుంది. నాన్న, మామయ్య అసలవి పట్టించుకునేవారే కాదు. అమ్మా వాళ్ళు నిలేస్తే.

"పెద్దయ్యాక వాళ్ళే కుదురుగా వుంటార్లే!" అనేసేవారు.

మళ్ళీ ఓరోజు బామ్మకి రోగం తిరగబెట్టింది. నా మూలంగానే ఆవిడ మంచం ఎక్కిందేమో అనిపించేది. 'బామ్మ చచ్చిపోతుందేమో' అన్న వూహనే భరించలేకపోయే దాన్ని. బామ్మ కూడా నన్ను తన పక్కనే కూర్చోబెట్టుకుని మొగుడితో ఎలా వుండాలో, ఎంత అపురూపంగా చూసుకోవాలో బోధిస్తూండేది.

ఇదంతా చూసిన నేనూ, కిరీటీ అత్యవసర సమావేశం జరిపి, ఇద్దరం కలిసి బామ్మ దగ్గరికెళ్ళి ఇంకెప్పుడూ పోట్లాడుకోం. నువ్వు మాత్రం చచ్చిపోవద్దని బతిమాలాం. బామ్మ తృప్తిగా నవ్వేసి.

"అదే తల్లీ! నాక్కావల్సింది. మీరు చక్కగా పాలు నీళ్ళలా కలిసిమెలిసి వుండాలి. కుదురుగా కాపురం చేసుకోవాలి' అంది.

"చెప్పానుగా. మేం చక్కగా కాపురం చేసుకుంటాం. బోలెడుమంది పిల్లల్ని కంటాం. నువ్వు మాత్రం చచ్చిపోకు!" అన్నాను. మళ్ళీ నవ్విందావిడ. ఆవిడ నవ్వు చూశాక మా ఇద్దరికీ ధైర్యం వచ్చింది.

అయితే ఆ ధైర్యం ఎంతో కాలం వుండలేదు. బామ్మకి జబ్బు ముదిరిపోయింది. అయితే అది మా గురించిన బెంగవల్ల కాదట. ఆవిడకి హార్ట్ ట్రబుల్ వుందట. అసలావిడ ఎప్పుడో పోవల్సిందట. నా పెళ్ళయిన ఆనందమే ఆవిణ్ని ఇంతకాలం బతికించిందట' ఇంక ఏ క్షణాన్నైనా ఆవిడ పోవచ్చుట. ఇవన్నీ బామ్మకి ట్రీట్‌మెంట్ ఇచ్చే మామయ్య చెప్పాడు.

బామ్మ పోతుందంటే ఏడుపొచ్చినా నా

వల్లపోవడం లేదు కదా అని తృప్తి పడ్డాను.

"యమునా! నిజంగా ఇంకనుంచీ అస్సలు పోట్లాడుకోవద్దు" అన్నాడు కిరీటి మర్నాడు పెరట్లో కూర్చుని జామకాయలు తింటూ,

"అవును, మనం పోట్లాడుకుంటే బామ్మ గుండాగి చచ్చిపోతుంది. అప్పుడు మనల్ని వెనకేసుకొచ్చేవాళ్లెవరూ ఉండరు" అన్నాను. నిజంగానే మా అమ్మ, అత్తయ్య ఎప్పుడైనా మమ్మల్ని మందలిస్తే బామ్మే వెనకేసుకొస్తుంది. వీధిలో ఎవరితో తగూలాడినా, తప్పు మాదే అయినా అవతల వాళ్లనే తిట్టిపోస్తుంది. ఆవిడ నోటికి భయపడి చాలా మంది మా జోలికి రారు.

అనుకున్నట్లే ఒకళ్ల మీద ఒకళ్లకి కాస్త కోపం వచ్చినా పోట్లాడుకునే వాళ్లం కాదు. అదీగాక ఎంతసేపూ మమ్మల్ని తనదగ్గరే కూర్చోపెట్టుకునేది. నీరసంగా ఏదేదో మాట్లాడేది. డాక్టర్ మామయ్య ఎక్కువగా మాట్లాడవద్దని చెప్పినా వినేది కాదు.

"ఏమవుతుందయ్యా, గుండె ఆగుతుంది అంతేగా! ఇంక నాకేం జరిగినా పరవాలేదయ్యా. నామనవల పెళ్లి కళ్లారా చూశాను. వాళ్లు అనోన్యంగా ఉండడం చూశాను. ఇంకేం కావాలి" అనేది తృప్తిగా మాకేసి చూస్తూ.

"మీకేం పర్లేదు! మీరింకా పదేళ్లు హాయిగా బతుకుతారు. ముని మనవలతో ఆడుకుంటారు కూడా!" నవ్వుతూ అనేవాడు మామయ్య ఎప్పటిలాగే.

బామ్మ కళ్లు తళుక్కుమన్నా, మళ్లీ ఏదో దిగులుగా అయిపోయేవి.

"మీ డాక్టర్లు అలాగే చెప్తారయ్యా! కొన్ని క్షణాల్లో ప్రాణాలు పోతాయని తెలిసినా 'వందేళ్లు బతుకుతావని' హామీ ఇస్తారు," అనేది నిర్లిప్తంగా.

నాన్న, మామయ్య మిగతా వాళ్లూ కూడా ఆవిడకేం ఢోకా లేదన్నట్టే మాట్లాడేవారు.

"అవును బామ్మా! నాకు బొల్డంత మంది పిల్లలు పుట్టేదాకా నీకేం కాదు!" అనేదాన్ని నేను కూడా.

"నా తల్లే!, నాతల్లే!" అంటూ నన్ను ముద్దు పెట్టుకునేది. నన్నేం అనద్దని, చక్కగా చూసుకోమని కిరీటికి పదే పదే చెప్పేది. తనూ అంగీకరంగా తలూపేవాడు.

అయితే అందరూ అన్నట్టు ఆవిడ బతక లేదు.

పదిరోజుల తర్వాత ఓ అర్ధరాత్రి శాశ్వతంగా కన్నుమూసింది. ఎప్పుడూ నాలా గలగల మాట్లాడే బామ్మ శవంగా మారిపోవడంతో నాకు దుఃఖం ఆగలేదు. నన్ను అత్తయ్య, అమ్మ కన్నా కిరీటే ఎక్కువగా ఓదార్చాడు.

బామ్మ మరణం ఊరివారందర్నీ విచారంలో పడేసింది. నాన్న, అత్తయ్య పసిపిల్లల్లా ఏడ్చారు. అమ్మ కళ్లు ఏడ్చి ఏడ్చి వాచిపోయాయి.

'పెద్దవాళ్ల బాధ పెళ్లితో సమానం అంటారు. ఆవిడ కోరిక మేరకు పసితనం వదలకుండానే కూతురి పెళ్లి చేశావు. ఆవిడ తృప్తిగా కన్నుమూసింది. నువ్వింకతేరుకుని జరగాల్సింది చూడు.' అంటూ నాన్నని ఓదార్చారు డాక్టరు మామయ్య.

నిజమే! పెళ్లయిన మమ్మల్ని చూసి చాలామంది నవ్వుకునేవారు. కొందరు పిల్లలైతే "వీళ్లద్దరూ మొగుడూ పెళ్లాలా" అంటూ గేలిచేసేవారు. అయినా మేం బాధ పళ్లేదు. ఎందుకు! బామ్మకోసం అని తృప్తి పడ్డాం నేనూ, కిరీటి.

ఓ పక్క ఏడుస్తూనే బామ్మ కర్మకాండలు వైభవంగా జరిపించారు నాన్న. గోదానం, భూదానం, సువర్ణదానం. ఒకటనేమిటి రవంత లోపం లేకుండా శాస్త్రోక్తంగా చేశాడు.

"అమ్మే పోయాక నాకు ఇక పుట్టింటితో పనేమిటి? " అంటూ ఏడుస్తున్న అత్తయ్యని ఎన్నో విధాల ఓదార్చింది అమ్మ.

"ఏమిటోనమ్మ! ఎన్ని చెప్తే మాత్రం తల్లి సాటి వస్తుందా! పాలున్నపుడే పరమాన్నం




# భలే కుస్తీపోటీ!

ఈ ఫొటో చూస్తుంటే, సింహంతో ఓ చిట్టెలుక పోరాడుతున్నట్లు అనిపిస్తోంది గదూ? ప్రపంచ వ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు పొందిన సుమోరెజిలర్లుచేత ఏటా జపాన్‌లో కుస్తీపోటీలు ఘనంగా జరుగుతాయి. వేలాదిమంది ఆ పోటీలు తిలకిస్తారు. ఈమధ్య జరిగిన ఆ కార్యక్రమంలో, పోటీల నిర్వాహకులు ముక్కుపచ్చలారని ముగ్గురు బాలురను ఓ మహాకాయుడైన సుమోరెజిలర్ పైకి ఉసిగొలిపారు! ఇద్దరు పిల్లలను సునాయాసంగా ఒకేసారి గాలిలోకి లేపాడు సుమో. మరొక బాలుడు సుమో స్తంభంవంటి కాలుతో తంటాలు పడుతున్నాడు.

తల్లి ఉన్నపుడే పుట్టిల్లు' అంటూ సన్నాయి నొక్కులు నొక్కారు కొంతమంది అమ్మలక్కలు.

నాకైతే ఒళ్లు మండి పోయిందాన్నంత పని. "ఏమిటి మా బామ్మపోతే మేం లేమూ అత్తయ్యకి? అసలు మేమంతా ఒకే ఇంట్లో వుంటాం. నేనావిడికి మేనకోడల్నే కాదు. కోడల్ని కూడా!" అన్నాను ఆరిందిలా.

ఆ మాటలు విని అత్తయ్య నన్నుపట్టుకుని మరోసారి బావురుమంది.

ఎవరి సాధక బాధకాలతోటే తనకి నిమిత్తం లేదన్నట్లు కాలం కరిగిపోతూనే ఉంది.

కిరీటికి ఇంజినీరింగ్ సీటొచ్చి హైదరాబాద్ వెళ్లిపోయాడు. ఒక్క అన్నపూర్ణకి తప్ప మిగతా ఆడపిల్లల పెళ్లిళ్లయి వెళ్లిపోయారు. బుజ్జి పై చదువులకి మెద్రాస్ వెళ్లాడు. నాకు లోకమంతా శూన్యంగా అనిపించసాగింది. నిజమే! నన్ను అతి గారాబంగా చూసే బామ్మలేదు. బైట తిరిగి అల్లరి చెయ్యడానికి ఫ్రెండ్స్ లేరు. మా మాష్టారుకూడా రిట్టైరై వెళ్లిపోయాడు. పోనీ మిగిలిన అన్నపూర్ణతో కలిసి తిరుగుదామంటే దాని బొంద! అది ఒట్టిపిరిగొడ్డు! బల్లిని చూసి కూడా హడలి మంచం పట్టే బాపతు.

ఇక నాకు మిగిలింది ధర్మచెరువు ఒడ్డు, వేణుగోపాల స్వామి ఆలయం, కబుర్లు చెప్పి నవ్వించే పూజారి తాతగారు.

అందుకే తోచనప్పుడల్లా వెళ్లి అక్కడ కూర్చునేదాన్ని. ఆ పరిసరాలు చూస్తుంటే నాఫ్రెండ్స్, ముఖ్యంగా జయా గుర్తొచ్చేవారు. మనసంతా దిగులుగా అయిపోయేది.

నా పరధ్యానం, దిగులు మొహం చూసిన పూజారిగారు గుడి మండపంలోకి తీసికెళ్లి ప్రసాదాలు పెట్టి ఎన్నో కబుర్లు చెప్పేవారు. ఆప్యాయంగా మాట్లాడి దిగులుని మరిపించాలని ప్రయత్నించేవాడు. అయినా నా పెదవులు నవ్వడం మానేశాయి. కళ్లలో దిగులు గూడు కట్టుకుని కాపురం పెట్టుకుంది. అది భరించలేని పూజారిగారు "ఏమిటమ్మా మున్నీ! ఎప్పుడూ గలగల పారే సెలయేరులా నవ్వుతూ నవ్విస్తూ ఉండే నువ్వు ఇలా అయిపోయామేమిటి? బామ్మ పోయిన దిగులు ఇంకా పోలేదా? ఎప్పుడో ఒకప్పుడు అంతా పోవల్సిన వాళ్లమేనమ్మా! కాకపోతే కాస్తముందు వెనక, అంతే!" అనేవారు అనునయంగా.

"నాకిక్కడ ఏంబాగా లేదు తాతయ్యా మాటి మాటికీ కిరీటి గుర్తొస్తున్నాడు" అన్నాను కళ్లు తుడుచుకుంటూ.

ఆయన చల్లగా నవ్వాడు.

"అయితే ఆలస్యం ఎందుకు? ... అతని దగ్గరికి వెళ్ళిపో!" అన్నాడు.

"కానీ మావాళ్ళు కిరీటి చదువయ్యేదాకా పంపనంటున్నారే!" అన్నాను దిగులుగా.

"అయితే ఓ పనిచెయ్యి! నువ్వు చక్కని రచనలు చేస్తున్నావుగా... ఇంకా ఇంకా మంచి రచనలు చెయ్యి. ఇటు నువ్వు పెద్ద రచయిత్రివైపోతావ్. అటు కిరీటి చదువు అయిపోతుంది!" అన్నాడాయన నవ్వుతూ.

"రచనలా? "

"అవునమ్మా! నీకు లోకజ్ఞానం కాస్త తక్కువ గానీ నీకు చాలా తెలివి తేటలున్నాయి. మంచి మంచి పుస్తకాలు చదువు. చక్కని రచనలు చెయ్యి. నీది స్వచ్ఛమైన పాల లాంటి మనసని నాకు తెలుసు. నిన్ను దేవుడు చల్లగా చూస్తాడు!" అన్నాడు ఆయన నా తల నిమురుతూ.

ఆయన మాటలు నా మీద బాగా పనిచేశాయి. అప్పట్నించీ ఎన్నో పుస్తకాలు తెచ్చుకుని చదవడం మొదలుపెట్టాను. రచనలూ

అయుధాల మధ్య చట్టాలు మౌనం వహిస్తాయి. – అబ్రహాం లింకన్

ప్రారంభించాను. అనతికాలంలోనే 'మంచి రచయిత్రి' అని పేరు సంపాదించుకున్నాను.

నా రచనలు చదివి మా నాన్న మురిసి పోయేవాడు.

"ఇంత పిచ్చిదానిలా వుంటావే! ఇన్ని ఆలోచనలు నీ బుర్రలోకి ఎలా వస్తున్నాయే యమునా? " అని విస్తుపోయేవాడు డాక్టర్ మామయ్య. నేను మురిసిపోయేదాన్ని.

కానీ నా రచనల గురించి గానీ, నా గురించిగానీ ఒక్క ఉత్తరం రాయలేదు జయ. అదే ఆయనతో అంటే-

"ఢిల్లీలో తెలుగు పుస్తకాలంతగా దొరక వమ్మా! అదీగాక వాడు చదివేది మెడి సినా? అవన్నీ చదవడానికి వాడికి టైమెక్క డిదీ!" అనేవాడు.

"నిజమే! డాక్టర్ చదువంటే మాటలా? " అనుకునేదాన్ని.

రోజులు, వారాలు, నెలలు, సంవత్స రాలూ దొర్లిపోతున్నాయి. కిరీటి ఆఖరి సంవత్సరంలోకొచ్చేశాడు. శలవుల్లో తనొచ్చి నపుడు నాకు ప్రాణం లేచొచ్చినట్టుండేది. హాస్టలు తిండి తిని అతను చిక్కిపోతే బాధ పడేదాన్ని.

అతను వెళ్ళాక శూన్యం!.

ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టు మౌనంగా తిరిగేదాన్ని.

"ఛ! జయవున్నా బావుండేది. ఎంచక్కా బోలెడు కబుర్లు చెప్పుకునేవాళ్ళం!" అనేకునే దాన్ని.

"ఏమిటే పిల్లా? ఒక్కసారిగా అంత బుద్ధి మంతురాలివైపోయావ్! నీకోసం తోటలూ, దొడ్లు, చెరువులూ, దొరువులూ తెగ బెంగప డిపోతున్నాయి. అటుకేసైనా వెళ్తున్నట్లు లేదు" అంది ఓసారి మునసబుగారి భార్య.

ఆవిడకెప్పుడూ నా గురించే కావాలి. అయినా వీళ్ళంటో తోట్లంట దొడ్లంట తిరి గితే మగరాయుడంటారు. కామ్‌గావుంటే ఇలా అంటారు!" అనుకున్నాను ఎప్పటిలాగే.

అయితే ఆవిడ అంతటితో సరిపెట్ట లేదు...

"మీ బావమీద బెంగా ఏమిటే మరీ చిక్కి సగం అయిపోయావ్? మీ బావతో చెప్పి నిన్ను అతని దగ్గరికి పంపమంటావా? " అంది ముసిముసిగా నవ్వుతూ.

"నువ్వు పంపమన్నా పంపదావిడ" అన్నాను చిరాగ్గా.

"ఏమే? ఎందుకు పంపదు? "

"మాకింకా శోభనం కాలేదుగా!" చాలా మామూలుగా అన్నాను. ఆవిడ నవ్వేసి.

"పేరుకి శోభనం కాకపోయినా అన్నీ అయిపోయాయిగా!" అంది 'అన్నీ' అన్న చోట వత్తిపలుకుతూ.

"అన్నీనా? అన్నీ ఏమిటి? " సూటిగా అడిగేశాను.

"అదేనే... వాడు... నిన్ను ముట్టుకో కుండా వున్నాడా? వాడేం ముట్టుకుంటాళ్ళే. అమాయకప్పక్షి. ఏ చొరవచేసినా నువ్వే చెయ్యాలి" అంటూ కిసుక్కున నవ్వింది.

"ఆ చొరవేంటో చెప్పు. చేసేస్తాను" అన్నాను. ఆవిడకీ తెలియదేమో-

"ఏంలేదు వెళ్ళు" అనేసింది. అప్పటికి ఊరుకున్నా రానురానూ కిరీటి దగ్గరికెళ్ళిపో వాలన్న ఆరాటం పెరిగిపోయింది.

ఓసారి వారం రోజుల శలవులకని కిరీటి వచ్చాడు. వచ్చినప్పుడల్లా నాకేసి అదోలా చూసేవాడు. ఆ చూపు మునుపటి చూపులా అనిపించేది కాదు. కళ్ళలో ఏదో కాంతి, ఆరాటం కొట్టొచ్చినట్టు కనిపించేవి.

ఓసారైతే ఎవరూ లేనప్పుడు నా బుగ్గ పట్టుకుని గట్టిగా నొక్కేశాడు. నేనూరుకుం టానా? బుగ్గ పట్టుకుని గట్టిగా గిల్లేశాను. కెవ్వుమన్నంత పనిచేశాడు కిరీటి.

కంగారుగా పరిగెత్తుకొచ్చారు అమ్మా, అత్తా. "ఏంజరిగిందే!" అంటూ.

"చూడత్తయ్యా! కిరీటి నా బుగ్గలు నొక్కే శాడు. అందుకేనేను అంతకన్నా గట్టిగా గిల్లే శాను!" అన్నాను గర్వంగా. నాగోళ్ళు పెద్దవి. పాపం కిరీటి బుగ్గన రవంత రక్తం

కూడా చిమ్మింది.

అమ్మా, అత్తయ్యా మొహాలు చూసుకున్నారు. కిరీటి తల వంగిపోయింది.

"హూం! బానేవుంది సరసం! తమలపాకుతో తానొకటంటే, తలుపుచెక్కతో నే రెండిచ్చా" అందట నీలాంటిదే!" అంది అత్తయ్య.

కిరీటి మెల్లగా అక్కణ్నించి జారుకున్నాడు.

"పాపం!" అనిపించింది నాకు.

ఆ రాత్రి అనౌన్స్ చేసేశాను.

నేను కిరీటితో పాటు హైదరాబాద్ వెళ్ళిపోతానని. మొహాలు చూసుకున్నారంతా.

"అదేవి టే! వాడి చదువింకా పూర్తికాలేదు. ఇప్పుడు నువ్వెళ్తే... ఈ జన్మకి పూర్తవుతుందా!" అంది అత్తయ్య నవ్వుతూ.



## ప్రకటన

ఒక పేపర్లో వచ్చిన ప్రకటన ఇలా ఉంది: 'మీరు నిరక్షరాస్యులా? చదవడంకానీ.. రాయడం కానీ తెలియనివారా? అయితే మాకు రాయండి.. ఎక్స్ ఎక్స్ ఎక్స్..'

ఏం! నేనేమైనా అతని చదువుకి అడ్డుపడతానా! హాస్టలు కూడు తినకుండా, ఎంచక్కా నేనే స్వయంగా వండిపెడతాను. నిజం అత్తయ్యా! నాకు అన్నం వండడం వచ్చు" అన్నాను గర్వంగా.

"అది కాదు తల్లీ! ఈ ఏడాదాగితే... నాన్న ఏదో చెప్పబోయాడు. అయితే నేను వినిపించుకోలేదు.

"నేను వెళ్ళి తీరాల్సిందే!" అన్నాను.

"నిజం నాన్నా! కిరీటి చదువుకి ఎలాంటి ఇబ్బందీ కలిగించను. తను చదువుకుంటుంటే, టీ కాచి ఫ్లాస్క్‌లో పోసుంచుతాను. ఇల్లంతా సర్ది పెడతాను. సమయానికి అన్నీ అమరుస్తాను!" అంటూ బతిమాలాను.

నా మాటలు కిరీటికి కూడా నచ్చినట్టున్నాయి.

"అవును మామయ్యా! హాస్టల్ తిండి తిన్లేక పోతున్నాను. ఆరోగ్యం బావుంటేనే కదా చదువు సక్రమంగా సాగేది!" అన్నాడు ధైర్యంచేసి.

"అయితే కొన్నాళ్ళపాటు మీ అమ్మని తీసికెళ్ళు. అన్నీ అమర్చి పెడుతుంది!" అన్నాడు మామయ్య.

కిరీటి మొహం మాడిపోయింది. నేను తనతో రావడం కిరీటిక్కూడా ఇష్టమేనని గ్రహించాక నాకు మరింత ధైర్యం వచ్చేసింది.

"ఏమైనాసరే! నేను కిరీటితోపాటు వెళ్తాను!" అన్నాను మొండిగా. నిస్సహాయంగా చూశారంతా.

"పోనీ అలాగే చేద్దాం బావా! పెళ్ళయ్యాక కూడా ఎన్నాళ్ళీ బ్రహ్మచర్యం!" అన్నాడు మామయ్య కొడుక్కేసి ప్రేమగా చూస్తూ.

"నిజమే అనుకో! కానీ అక్కడ ఇల్లూ అదీ చూడాలిగా... అదీగాక పిచ్చిమొద్దు! దీనికి కంచం కడగడం కూడా చేతకాదు. వంటా వార్పూ ఇదేం చూడగలదు!" అన్నాడు నాన్న ఏదో ఆలోచిస్తూ.

"కిరీటికన్నీ తెలుసు. తను నేర్పుతాళ్ళే!" అన్నాను ప్రేమగా కిరీటికేసి చూస్తూ.

"మరింక ఆలస్యం ఎందుకు! ఆ ముచ్చట

కూడా కానిచ్చేద్దాం. వాళ్ళే కిందా మీదా పడతారు!" అంది అత్తయ్య.

"ఇంకా ఏముచ్చట? " అన్నాను విసుగ్గా.

"అది తర్వాత తెలుస్తుందిలే- ముందు మీరు శాస్త్రుల్లుగారిని పిల్చి ముహూర్తం పెట్టించండి!" అంది అమ్మ.

"అలా చెయ్యి బావా! హైదరాబాద్‌లో మా ఫ్రెండొకాయనున్నాడు, వీళ్ళకి తగిన ఇల్లు చూడమని ఉత్తరం రాస్తాను!" అన్నాడు మామయ్య.

"హమ్మయ్య! ఎలా అయితేనేం ఒప్పుకున్నారు. నేను ఎంచక్కా ఇంక కిరీటిదగ్గరే వుండచ్చు!" అనుకున్నాను.

అందరూ వెళ్ళిపోయాక నా చెయ్యి పట్టి లాగుతూ-

"థ్యాంక్స్ యమునా!" అన్నాడు కిరీటి.

అతని కళ్ళలోని భావానికి విస్తుపోయాను.

★ ★ ★

ఆరోజే మా శోభనం.

ఎవరూ చూడకుండా వెళ్ళి అన్నపూర్ణకి చెప్పేశాను.

"ఏమిటీ ఇవాళ మీ శోభనమా? చెప్పావుకాదేం!" అంటూ జరిగేది తన శోభనమే అన్నంత ఆనందపడిపోయింది అన్నపూర్ణ.

"ఎక్కడా! కిరీటి వున్నాడు కదా. ఎంత సేపూ ఏవో కబుర్లతోనే గడిచిపోయింది. ఇప్పుడైనా చెప్పకపోతే బాధపడతావని చెప్పాను!" అన్నాను.

"ఇవాళ రాత్రి గదిలో ఏంజరిగిందో అక్షరం పొల్లుపోకుండా చెప్పాలి!"

"ఓస్! అంతేకదా! రేపుద్దున్నే వచ్చి చెప్తాను! ఇంకనేనొస్తాను. అమ్మ తిట్టిపోస్తుంది!" అంటూ ఇంటికేసి పరుగుతీశాను.

అదృష్టవశాత్తూ నన్ను ఇంట్లోవాళ్ళెవరూ గమనించలేదు.

అమ్మ, అత్తయ్య కలిసి నాకు, కిరీటికీ హారతిచ్చి తలంట్లుపోశారు. పీటలమీద కూర్చోబెట్టి పురోహితుడు ఏవేవో మంత్రాలు చదివాడు.

"ఇలా మంత్రాలు చదవడం ఏ సినిమాలోనూ చూసినట్టులేదే!" అనుకున్నాను. కానీ అడగలేదు. ఎందుకంటే, ఆరోజు పిచ్చి పిచ్చి ప్రశ్నలు వెయ్యొద్దని మా అమ్మ నాకు ముందే వార్నింగ్ ఇచ్చింది. నా ప్రశ్నలు ఆవిడ దృష్టిలో పిచ్చిప్రశ్నలన్నమాట.

రాత్రి పది గంటలదాకా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారంతా.

భోజనాలయ్యాక నాకు పూలజడవేసి తెల్ల జరీచీర కట్టారు. సెంట్లు పూశారు. నాకళ్ళు కిరీటికోసం వెతికాయి. అయితే అతనెక్కడా కనిపించలేదు.

నాకు నిద్ర ముంచుకొస్తోంది. నడుముకి వడ్డాణం పెడుతున్న అత్తకేసి చూస్తూ-

"ఇంకా ఎంతసేపత్తయ్యా? పదిన్నర దాటిపోయింది!" అన్నాను ఆవలిస్తూ.

"ఏమిటి అంత తొందరగా వుందా? " కిసుక్కున నవ్విందావిడ.

"తొందరేమిటి... ఓసారి గతాన్ని గుర్తు చేసుకో!" అంది అమ్మ కొంటెగా అత్తయ్యకేసి చూస్తూ. ఆవిడ సిగ్గుపడిపోయింది.

"ఇవాళ నీకు నీతులు చెప్తోంది. ఆరోజున తనేం చేసిందో అడుగమ్మా!" అన్నాడు నాన్న ఓరగా అమ్మకేసి చూస్తూ.

ఈసారి ఆవిడ సిగ్గుపడిపోయింది.

"ఆడవాళ్ళ గొడవల్లో మీరెందుకర్రా తల దూరుస్తారు! ముందు మీరు వరండాలోకెళ్ళండి" అంది ఓ ముసలావిడ నాన్నని ముద్దుగా విసుక్కుంటూ.

మామయ్య, నాన్న ముసిముసిగా నవ్వుకుంటూ బైటకెళ్ళిపోయారు. తర్వాత అందరూ ఏవేవో మాట్లాడుకున్నారు.

నాకైతే ఒళ్ళు మండిపోయింది.

"అసలు శోభనం మీకా, నాకా? నేను బానేవున్నాను. మధ్య మీరంతా ఎందుకూ మెలికలు తిరిగిపోతారు!" అన్నాను చిరాగ్గా.

అంతా పకపకలాడారు.

పదకొండవుతుండగా నన్ను అందరూ

కలిసి దక్షిణంవైపున్న గదిలోకి తీసికెళ్ళారు. చేతిలో పాలగ్లాసిచ్చి

నా మొహం! వాళ్ళు తీసికెళ్ళేదేమిటి. నేనే వాళ్ళని లాక్కెళ్ళాను.

అందరూ కలిసి నాకర్థంకాని ఏవేవో మాటలు మాట్లాడుకుంటూ నన్ను గదిలోకి, ఖైదీని పోలీసులు తోసినంత విసురుగా తోసి తలుపులు మూసేశారు. కాస్తుంటే పడిపోయేదాన్నేమోకూడా.

నాకు పిచ్చికోపం వచ్చేసింది. అయినా అరవడానికిది సమయం కాదన్నట్టు తలెత్తి గదిని, గది అలంకరణనీ చూశాను.

నా కళ్ళు తళుక్కుమన్నాయి.

నిజంగా సినిమాల్లోని శోభనం గదికన్నా అందంగా అలంకరించారాగదిని. మంచం మధ్యలో దర్జాగా కూర్చుని వున్నాడు కిరీటి చిరునవ్వులు చిందిస్తూ.

"ఏమిటీ నువ్విక్కడున్నావా! మహాను భావా! నీకోసం ఇల్లంతా వెతికాను. అడిగితే తిడతారని అడగలేదుగానీ చెప్పాపెట్టకుండా హైదరాబాద్ చెక్కేశావేమో! నువ్వులేకుం డానే శోభనం చేసుకోవాలేమో అని కంగా రుపడిపోయాను. హమ్మయ్యా! వున్నావు కదా!" అంటూ ఒక్క అంగలో వెళ్ళి పాల గ్లాసు అతనికందించి-

"అన్నీ తాగెయ్యకు. కాసిని నేనూ తాగా లిట! ఎంగిలి తాగడం నాకిష్టంలేదు. అయినా తాగాలని అమ్మ, అత్తయ్య కూడా చెప్పారు!" అన్నాను గడగడ మాట్లాడేస్తూ.

కిరీటి నవ్వాడు.

నేనూ నవ్వాను. అలా నవ్వాలని అమ్మ చెప్పింది.

కిరీటి నన్ను తన పక్కన కూర్చోపెట్టుకు న్నాడు. ఎప్పుడూ పేంటు, షర్టులో వుండే కిరీటి తెల్లని పంచ, లాల్చీలో కనిపించేసరికి కాస్త కొత్తగా అనిపించినా, పెళ్ళిలోని అతని వేషం గుర్తొచ్చి మాట్లాడలేదు.

"భయంగా వుందా?" మృదువుగా అన్నాడు కిరీటి.

"భయమా! ఎందుకూ?" అన్నాను ఆశ్చ ర్యంగా

అతనికేం చెప్పాలో అర్థంకాలేదులా ఉంది. క్షణం మౌనంగా ఉండి పోయాడు. ఓ మూల నాకు నిద్ర ముంచుకొచ్చేస్తోంది.

"కిరీటీ! ఆశోభనం ఏదో తొందరగా కాని చ్చెయ్యి. నేను పడుకోవాలి" అన్నాను ఆవ లిస్తూ

బిత్తరపోయాడు కిరీటి.

అతన్ని చూస్తుంటే నాకు నవ్వొచ్చింది.

"నా సంగతేమోగానీ నువ్వు భయపడు తున్నట్టున్నావ్. మొహంనిండా ఆ చెమటలే మిటి. చేతులూ ఒణుకుతున్నాయెందుకు!" అన్నాను. పెద్దగా నవ్వుతూ.

"...ష్! అంత పెద్దగా మాట్లాడకు బైటి వాళ్ళు వింటారు?" కంగారుగా అన్నాడ తను.

"విన్నీ! వింటే ఏం? ఎంచక్క వాళ్ళు శోభనం చేసుకుంటున్నారని ఆనందిస్తారు!" అన్నాను కాళ్ళూపుతూ.

"భగవంతుడా!" అంటూ తలపట్టుకు న్నాడు కిరీటి.

"ఏవిటి కిరీటీ! నేనేమైనా తప్పుగా మాట్లా డానా!" అన్నాను కంగారుగా. అతనిక్కాస్త ధైర్యం వచ్చినట్టుంది. మెల్లగా నాచేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ-

"అసలు శోభనం అంటే ఏవిటో తెలుసా నీకు?" అన్నాడు గుసగుసగా.

"ఎందుకు తెలియదు, బోలెడు సినిమాల్లో చూశాను. తెల్లచీర, మల్లెపూలు, పాల గ్లాసు... పూలతో అలంకరించిన మంచం. ఇంకా.. ఆc.. స్వీట్లు, పళ్ళు..

"స్టాప్!" విసుగ్గా అన్నాడు కిరీటి

ఈసారి నేను బిత్తరపోయాను. నా మొహం చూసి జాలేసిందేమో

"అదికాదు యమునా! శోభనం అంటే... ముందు లైట్ తీసెయ్యి" అన్నాడు మృదు వుగా

"అయ్యో, నాకు చీకటంటే భయం.

పర్లేదు లైట్లలోనే శోభనం చేసుకుందాం!" అన్నాను.

"అలాకాదు యమునా! లైటుండకూడదు!..." అంటూ బుజ్జగించి లైటార్పేశాడు కిరీటి. నేను కెవ్వున అరవబోయి తమాయించుకున్నాను. ఓ బంగారునగ నా కొంగున కట్టి -

"ఈ నగలేంటి.. ఈ ఒడ్డాణం తీసెయ్యి!' అన్నాడు నా చెంపమీద సున్నితంగా ముద్దు పెట్టుకుంటూ.

"ఛ! ఎంగిలి!" కంపరంగా చెంప తుడుచుకుంటూ అన్నాను. అతను నవ్వాడు.

"చూడు! ఇవాళ నేనేం చేసినా నువ్వు కాదనకూడదు." అన్నాడు నా చుట్టూ చేతులు పెనవేస్తూ.

"ఏంచేస్తావ్!" కంగారుగా అన్నాను.

"చెప్తానుగా" అంటూ పెద్దపెద్ద నగలన్నీ తనే తీసి పక్కనే వున్న బల్లమీద పెట్టాడు.

నేను మాట్లాడలేదు. అమ్మా, అత్తయ్యా కూడా చెప్పారు. కిరీటి ఏం చేసినా కాదన కూడదని, అందుకే అతి ప్రయాసతో నోరు మూసుకున్నాను.

తర్వాత అతని చేతులు నా ఒంటిమీద ఎక్కడెక్కడో పాకాయి. నేను కెవ్వున అరవబోతుంటే నా నోరు మూసేశాడు కిరీటి. చేతులతో కాదు. తన పెదవులతో.

నాకంతా అయోమయంగా అనిపించింది. పారిపోదామన్నా వీల్లేని పరిస్థితి!

గంట తర్వాత

"ఛ! శోభనం అంటే ఇదా! నాకేం బాగా లేదు!' అన్నాను చిరాగ్గా.

"ఇప్పుడలాగే అంటావ్... ముందు ముందు కిరీటీ శోభనం కావాలి అని నువ్వే నా దగ్గరికొస్తావ్" అన్నాడు. నా నడుం చుట్టూ చేతులు వేసి మృదువుగా గుండెలకి హత్తుకుంటూ.

నేనూ మాట్లాడలేదు.

తెల్లవారు ఝామున అమ్మ తలుపు తట్టే సరికి నేను కిరీటి గుండెల మీద పడుకుని నిద్రపోతున్నాను.

"యమునా! లే!" అన్నాడు కిరీటి కంగారుగా.

నేను గభాల్నలేచాను.

"ఏమిటి? " అన్నాను మత్తుగా

"తలుపు తడుతున్నారు!"

"ఇంకాస్సేపు పడుకుంటాను. నిద్రొస్తోంది! అంటూ అతని గుండెలమీదే తల పెట్టుకుని పడుకుని నిద్రలోకి జారిపోయాను.

నిద్రలోవున్నా మనుకున్నారేమో ఇంక ఎవరూ తలుపు తట్టలేదు.

ఆరుగంటలు దాటుతుండగా మెలకువవచ్చింది. అప్పుడు నేను కిరీటి కౌగిలిలో వున్నాను.

ఎందుకో అతని కౌగిలి ఎంతో హాయిగా అనిపించింది.

"గుడ్ మాణింగ్!" అన్నాడతను నా ముంగురులు సరిచేస్తూ.

"ఆఁ గుడ్ మాణింగేలే.. ఇంక" అన్నాను మూతి ముడుచుకుని. అతను పక పక నవ్వేశాడు.

నేను ఆలోచనలో పడ్డాను.

"ఏవిటాలోచిస్తున్నావ్" అన్నాడతను నా చెంపకి చెంప ఆనిస్తూ...

"అన్నపూర్ణేమో రాత్రి జరిగిందంతా తు.చ. తప్పకుండా చెప్పాలంది. నేను సరే అన్నాను. కానీ ఈ విషయాలన్నీ దానికి చెప్పడం ఎలా ఛ!" అన్నాను కందిపోయిన చెంపలతో.

అతను హడిలిపోయాడు.

"కొంపతీసి చెప్తావా? " అన్నాడు కంగారుగా

"మరి చెప్తానన్నానుగా."

"ఛ! ఛ! ఇక్కడ జరిగినవేం బైటికి చెప్పకూడదు."

సరేనా?

"సరే!" అయిష్టంగానే ఒప్పుకున్నాను.

"థాంక్ గాడ్' అన్నట్టు నిట్టూర్చాడు కిరీటి.

కాస్సేపు తర్వాత ఇద్దరం కాస్త తేడాలో



బైటికొచ్చాం.

"ఎలా వుందే శోభనం!" గుసగుసగా అంది అత్తయ్య నన్ను పరిశీలనగా చూస్తూ.

"నా మొహంలా వుంది. అసలా కిరీటి ఏం చేశాడో తెలుసా? లైటార్పేసి..."

"ఒద్దొద్దులే! ఎరక్కపోయి అడిగాను!" అంటూ పారిపోయినట్టు వెళ్ళిపోయింది అత్తయ్య.

ముసిముసిగా నవ్వింది అమ్మ.

"ఓహో ఈ శోభనం గురించి వీళ్ళందరికీ బాగ తెలుసు. అందుకే రాత్రి అంత సిగ్గు పడి పోయారు" అనుకున్నాను.

అమ్మ ఏం అడక్కుండానే నాకొంగున కట్టిన వజ్రపుటుంగరాన్ని తీసి అందరికీ చూపించడంలో పడిపోయింది. నేను మాత్రం అన్నపూర్ణ ఇంటి ఛాయలకే పోలేదు.

అటు మూడు నిద్రలూ, ఇటు మూడు నిద్రలూ అయిపోయాయి. నాకైతే ఎంచక్క హనీమూన్‌కెళ్లాలని ఎంతగానో అనిపించింది. అయితే కిరీటి చదువుకి ఆటంకం అని ఆపేశారు మా పెద్దవాళ్ళు. కిరీటి వెళ్ళిపోయాడు. మంచిరోజు చూసి నన్ను తీసి కెళ్లి దించాలని మావాళ్లు నిర్ణయించారు.

కిరీటి ఉన్నన్నాళ్లూ అన్నపూర్ణని తప్పించుకున్నానేగానీ తర్వాత దానికి దొరికిపోయాను. నన్ను బలవంతంగా మునసబుగారి తోటలోకి లాక్కెళ్లి నీ శోభనం అనుభవాలు చెప్తావా చస్తావా! అని కూర్చుంది. నాకేం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

"ఛ అవన్నీ బైటికి చెప్పకూడదే!" అంటూ తప్పించుకోబోయాను. అయినా అది వదిలేనా. క్లుప్తంగా చెప్పు అంటూ పీకలమీద కూర్చుంది. నాకు చెప్పాలనే ఉన్నా, కిరీటి అలాంటివి ఎవరికీ చెప్పకూడదన్నాడుగా. అందుకే ఆలోచనలో పడ్డాను.

"ఏమిటీ పోజు పెడుతున్నావ్. అప్పుడేమో అన్నీ వివరంగా చెప్తానని ప్రామిస్ చేసి, ఇప్పుడు క్లుప్తంగా చెప్పమన్నా చెప్పడానికి ఆలోచిస్తున్నావా? అలా అయితే రేపు నాకు పెళ్లై శోభనం జరిగితే ఒక్క విషయం కూడా చెప్పను" అంటూ మండిపడింది అన్నపూర్ణ.

నేను నవ్వాను.

"చెప్పాలనుకున్నా చెప్పలేవులే" అంటూ.

"ఏవిటి అంత క్రిటికల్ మేటరా?" అంది అన్నపూర్ణ వ్యంగ్యంగా. అంతేకాదు. ఇంకా చాలా నిష్టూరాలాడింది. చివరికి చెప్పాలనే నిర్ణయించుకున్నాను. లైటార్పడం దాకా చెప్పాను. ఇంక తర్వాతి సంగతులు చెప్పబోతుండగానే మునసుబుగారి భార్య స్థూలకాయాన్ని మోసుకొస్తూ...

"ఇద్దరూ ఇక్కడ కూర్చుని ఏం చేస్తున్నారే!" అంది గద్దించినట్టు. అన్నపూర్ణ హడలిపోయింది. కానీ నేనేం భయపడలేదు.

"ఏంలేదత్తయ్యా! నా శోభనం గురించి చెప్తున్నాను" అన్నాను గోళ్లు కొరుక్కుంటూ.

ఆవిడ క్షణం బిత్తరపోయి -

"ఏవిటి శోభనం గురించి చెప్తున్నావా?" అంది బుగ్గలు నొక్కుకుంటూ. నేను అన్నపూర్ణకి ప్రామిస్ చెయ్యడమూ, అది చెప్పమని వత్తిడి తేవడమూ అన్నీ కాళ్లు, చేతులూ తిప్పుతూ చెప్పేశాను.

ఈసారి ఆవిడ మరింత విస్తుపోయి

"సిగ్గు లేకపోతేసరి! శోభనం గురించి అది అడగడం, నువ్వు చెప్పడం! ఎవరైనా వింటే నవ్విపోతారు. వెళ్లండి" అంది గదిమినట్టు.

అన్నపూర్ణ మొహం మాడిపోయింది. నాకు మాత్రం ఆవిడ రావడం చాలా ఊరటనే కలిగించింది. కాదు మరీ. ఇదేమైనా బర్త్‌డే పార్టీ ఫంక్షనా, మేరేజ్ ఫంక్షనా అన్నీ విపులంగా చెప్పడానికి?

మరోసారి హెచ్చరించి, మేం అక్కణ్నించి కదిలాక లోపలికెళ్లిందావిడ. 'పిదప కాలం, పిదపబుద్ధులు!" అని గొణుక్కుంటూ. నేను అత్తయ్యా వాళ్లింటికేసినడిచాను.

"ఏవిటి తల్లీ! ఏ దేశాన్ని ఉద్ధరించి వస్తున్నావ్?" అంది అత్తయ్య. నేను నవ్వాను. అత్తయ్య వింతగా చూస్తూ.

ఏమిటే చెంపల్లో గులాబీలు పూస్తున్నాయి. సిగ్గులు మొగ్గలేస్తున్నాయి. ఏవిటి కథ?" అంది నవ్వేస్తూ.

"సిగ్గులా పాడా! నా శోభనం గుర్తొచ్చిందిలే" అన్నాను. అత్తయ్య తుళ్లిపడింది. తర్వాత తేరుకుని.

"ఏవిటి అప్పుడే కిరీటిమీద గాలి మళ్లిందా? మంచిరోజు చూసి పంపేస్తున్నాం కదే! ఇంతలో అంత తొందర పడితే ఎలా?" అంది ముసిముసిగా నవ్వుతూ.

అన్నపూర్ణ విషయం అత్తయ్యకి తెలియదుగా. అందుకే ఆవిణ్ణి లోపలికి లాక్కెళ్లి కూర్చోబెట్టి విషయమంతా చెప్పేశాను. "మునసబుగారి పెళ్లాం వచ్చింది కాబట్టి బతికిపోయానుగానీ, లేకపోతే అన్నీ దానికి చెప్పాల్సొచ్చేది!" అంటూ నిట్టూర్చాను. నవ్వాలో ఏడవాలో తెలియనట్టు మొహం పెట్టి, నన్ను రెక్క పట్టుకుని మా ఇంటికి తీసుకొచ్చింది. అప్పుడు అమ్మ తప్ప ఎవరూ లేరింట్లో. విషయమంతా అమ్మకి చెప్పేసింది. అమ్మ కూడా ముందు తెల్లబోయి తర్వాత కోప్పడింది. గదిలో జరిగినవి బైటివాళ్లకి చెప్పకూడదట.

"కిరీటి అదే అన్నాడు. కానీ అన్నపూర్ణ వదలందే!" అన్నాను గోముగా. మొహాలు చూసుకున్నారు అమ్మ, అత్తయ్య. ఆపై నాకో రెండు గంటలు క్లాసు తీసుకున్నారు.

"దీనికి వయసొచ్చిందిగానీ మనసు ఎదగలేదు!" అని ఎప్పటిలాగే బాధపడ్డారు. అంతేకాదు తొందరలో నన్ను చీరసారెలతో హైదరాబాద్ పంపెయ్యాలని నిర్ణయించుకున్నారు కూడా. నాకెక్కళ్లేని ఉత్సాహమూ వచ్చేసింది. ఈ విషయం తాతగారికి చెప్పాలంటూ పరిగెత్తాను.

అనుకున్నట్టే మా కొత్త కాపురం హైదరాబాదులో మొదలైంది. మాతోపాటు అత్తయ్య, మామయ్య, అమ్మానాన్నలు కూడా వచ్చారు. నాన్న, మామయ్యా వారం రోజులుండి వెళ్లిపోయారు. కానీ అమ్మ, అత్తయ్యా ఓ నెల్లాళ్లపాటు ఉండి నాక్కాస్త

పని పాటలు, వంటా వార్పులు నేర్పించారు.

ఎట్టి పరిస్థితిలోనూ కిరీటి చదువుకి ఆటంకం కలిగించవద్దనీ, అతన్ని అల్లరి పెట్టవద్దనీ వందసార్లు చెప్పి వెళ్లిపోయారు.

వాళ్లు చెప్పినట్టే నేను కిరీటికెలాంటి ఇబ్బందీ కలిగించలేదు. చేతనైనంతలో వంటి చేసి పెట్టేదాన్ని. పరీక్షలప్పుడు ఫ్లాస్క్ నిండా టీ పోసి గంట గంటకీ ఇచ్చే దాన్ని. ఇవన్నీ చూసి మురిసిపోయేవాడు. కిరీటి.

కానీ నాకు మాత్రం చాలా గిల్టీగా అని పించేది. ఎందుకంటే కూరలో కారం నషాళానికంటినా, పప్పులో ఉప్పు లేకపోయినా, అన్నం మాడిపోయినా "బ్రహ్మాండంగా వుంది"! అని మెచ్చుకుంటూ తినేవాడు. వాటిలోని లోపాలు నేను తిన్నప్పుడుగానీ తెలిసేది కాదు. అదే అతనితో అంటే

"డోంట్ .వర్రీ యమునా! ఏదైనా అందరూ పుడుతూనే నేర్చుకోరు. ఇన్నాళ్లూ నువ్వు అతి గారాబంగా పెరిగావ్. ఇప్పుడు వంటా వార్పేకాక మిగతా బాధ్యతలన్నీ ఒక్కసారిగా మీద పడితే తట్టుకోవద్దూ!" అని తేలిగ్గా నవ్వేసేవాడు.

అతని సహనానికి నాకు విస్మయం కలిగేది. ఎప్పుడూ చదువు తప్ప వేరే ధ్యాస ఉండేది కాదు. అయితే ఎంత పరీక్షల టైమైనా ఆదివారం సాయంత్రం నన్ను ఏ టాంక్‌బండ్‌కో, లుంబినీ పార్కుకో, సాలార్జంగ్ మ్యూజియమ్‌కో తీసుకెళ్తుండేవాడు. నగరాన్ని గురించి విపులంగా చెప్పేవాడు. నా రచనలకి సూచనలిస్తూండేవాడు.

ఒకే రకంగా చెప్పాలంటే కిరీటి సాన్నిధ్యం నాకు స్వర్గ తుల్యంలా ఉంది. ఎప్పుడైనా అమ్మ పోరుమీద పల్లెకెళ్లినా మూడో నాడే

"కిరీటి ఒంటరిగా వుంటాడు"! అంటూ తిరుగు టపా కట్టేసేదాన్ని.

"సరేలే వాడి చదువు పాడుచెయ్యకుండా నువ్వు కూడా ఏ పుస్తకాలో చదువుకో. కథలూ, కవితలూ రాసుకో" అనేవాడు నాన్న వచ్చి వెళ్తున్నప్పుడల్లా. అమ్మావాళ్ళూ, అత్తయ్యా వాళ్లూ కూడా తరచూ వచ్చి చూసెళ్తుండేవారు. నేను కిరీటిని కంటికి రెప్పలా చూసుకోవడం, గమనించినవాళ్ళు-

"ఉప్పు, నిప్పులా ఉండే వీళ్ళెంత ప్రాణంగా ఉన్నారు?" అని విస్తుపోయే వారు కూడా.

నిజంగానే నాకూ అర్థమయ్యేది కాదు. ఇంత సఖ్యత మా మధ్య ఎలా వచ్చిందీ అని.

కిరీటి కాలేజీకెళ్ళినప్పుడు నాకు లోకమంతా శూన్యంగా అనిపించేది. సాయంత్రం తనొచ్చేసరికి నా మొహం దివిటీలా వెలిగిపోయేది.

అన్నట్టు చెప్పడం మర్చిపోయాను. కిరీటికి ఇద్దరు మంచి స్నేహితులున్నారు. వాళ్ళిద్దరూ కిరీటికన్నా కాస్త పెద్దవాళ్ళే. వాళ్ళు తరచూ మా ఇంటిక్కూడా వచ్చేవారు. నన్ను 'చెల్లెమ్మా' అని పిల్చేవాళ్ళు. వాళ్ళని నేను గిరన్నయ్యా, రాజన్నయ్యా అని పిల్చేదాన్ని. వాళ్ళు కూడా నా రచనలు చదివి తెగ మెచ్చుకునేవారు. "పెద్ద రైటర్‌వైపోతావ్" అని నమ్మకంగా చెప్పేవారు. నాలో ఉత్సాహం పెరిగి తెల్లకాగితాల్ని నల్లకాగితాలుగా మార్చడానికి ప్రయత్నించే దాన్ని.

కిరీటి నాకు లైబ్రరీ నించి బోలెడు తెలుగు నవలలు తెచ్చిచ్చేవాడు. నాకు శరత్‌బాబు నవలలంటే చాలా ఇష్టం. రవీంద్రనాథ్ ఠాకూర్, గోపీచంద్ రచనలు కూడా చాలానే చదివాను. విశ్వనాథవారి రచనలు మాత్రం కొన్ని కొరుకుడు పడేవికాదు. అయినా కష్టపడి చదివేదాన్ని.

కిరీటి రాత్రులు చాలాసేపు చదువుకునేవాడు. తనో గదిలో చదువుకుంటే నేను మరో గదిలో చదువుకుంటూనో రాసుకుంటూనో ఉండేదాన్ని. ఒకోరోజు రాత్రి ఒంటి

గంటైనా పుస్తకం మూసేవాడుకాదు కిరీటి. నేను ఆవలిస్తూ వచ్చి తనెదురుగా నిల్చునే దాన్ని.

అతని వెనగ్గా వెళ్ళి కళ్ళు ముయ్యాలనీ, చిలిపిగా చెవిని కొరకాలనీ లైటార్పేసి అతన్ని చుట్టెయ్యాలనీ ఎంతగానో అనిపించేది. కానీ కిరీటి చదువుని దృష్టిలో పెట్టుకుని మౌనంగా ఉండిపోయేదాన్ని.

"ఏవిఁటి మున్నీ నిద్ర రావడంలేదా? " అని మృదువుగా అడిగేవాడు.

"ఉఁహు!"

"వెళ్ళి పడుకో! నిద్ర అదే వస్తుంది!"

నేను తల అడ్డంగా ఊపి అతని పక్కగా వెళ్ళి కూర్చునేదాన్ని. నువ్వు దగ్గర లేకపోతే నాకు నిద్రరాదు కిరీటి!" అనేదాన్ని బేలగా. వాలిపోతున్న నా కళ్ళని చూసి బాధపడే వాడు కిరీటి. తర్వాత పుస్తకాలతో సహా గది లోకొచ్చి మంచంమీద కూర్చుని, గోడకానుకుని కాళ్ళమీద నన్ను తలపెట్టి పడుకోమనే వాడు. నేను ఒళ్ళో పడుకుంటే తను చదువులో పడిపోయేవాడు. అతని వెచ్చని ఒడి నాకు అమ్మ ఒడికన్నా హాయినిచ్చేది. అలాగే నిద్రలోకి జారిపోయేదాన్ని. తను ఎప్పుడు పడుకునేవాడో, నన్ను ఎలా పొదివి పట్టుకున్నాడో నాకు తెలిసేది కాదు.

నాకిప్పటికీ ఆశ్చర్యంగానే ఉంటోంది. ప్రతి చిన్న విషయానికీ పోట్లగిత్తల్లా పోట్లాడుకునే మేమేనా ఇంత పాలూ నీళ్ళలా కలిసిపోయింది? అని. అసలు కిరీటి మీద ఇంత ప్రేమ ఉందని కూడా నాకు తెలియదు.

అలా అతని చల్లని నీడలో నిశ్చింతగా బతికేస్తున్నాను.

ఓరోజు సాయంత్రం ఆరున్నర దాటినా కిరీటి రాలేదు. ఎందుకో నాకు కంగారుగా ఉంది. ఇంట్లోకీ, బైటికీ తిరుగుతూనే ఉన్నాను. ఎనిమిది అవుతుండగా ఉసూరుమంటూ వచ్చాడు. అతను కనిపించగానే ప్రాణం లేచొచ్చినట్టైంది. వెంటనే దుఃఖం కూడా వచ్చేసింది.

"కిరీటీ!" అంటూ అతని గుండెలమీద వాలబోతూ అతని మొహం చూసి తుళ్ళిపడ్డాను.

కిరీటి మొహం వాడిపోయి ఉంది. కళ్ళు ఎర్రబారి రవంత వాచి ఉన్నాయి.

"ఏమిటి కిరీటీ? ఏమిటలా ఉన్నావ్!" అన్నాను ఆతృతగా- జవాబుగా అతను మొహం చేతుల్లో కప్పుకుని బావురుమన్నాడు.

నా గుండె ఆగినట్టయింది.

"ఏమైంది కిరీటీ? " అన్నాను అతన్ని పట్టి కుదిపేస్తూ

"మన డాక్టర్ మామయ్య... అత్తయ్యా...

"ఉఁ! డాక్టర్ మామయ్యా వాళ్ళకేమైంది? "

"ఇద్దరూ కార్లో వెళ్తుంటే లారీ గుద్దేసిందట. స్పాట్ డెడ్!" అన్నాడు కిరీటి దుఃఖాన్ని అతి ప్రయాసగా ఆపుకుంటూ.

నేనూ బావురుమన్నాను.

"కిరీటీ!... మనం వెంటనే వెళ్దాం పద" అన్నాను ఏడుస్తూనే.

"ఎక్కడికి! యాక్సిడెంట్ జరిగింది ఢిల్లీలో. అదీ వారంరోజుల క్రితం!" నిర్లిప్తంగా అన్నాడు కిరీటి.

నేను కుప్పకూలిపోయాను. దుఃఖం వెల్లువలా ఉబికింది. నేను మా బామ్మ పోయినప్పుడు కూడా ఇంతలా ఏడవలేదు. నా దుఃఖాన్ని కంట్రోల్ చెయ్యడానికి చాలా అవస్థలు పడ్డాడు కిరీటి.

ఆ రాత్రంతా ఏడుస్తూనే ఉన్నాను. ఇద్దరం భోంచెయ్యలేదు. చచ్చిపోయిన వాళ్ళని గురించి కన్నా తల్లిదండ్రులిద్దర్నీ ఒకేసారి కోల్పోయిన ప్రియ నేస్తం జయని గురించే ఎక్కువ బాధపడ్డాం.

"కిరీటీ! అసలు ఇన్నాళ్ళూ మనం జయని ఎలా మర్చిపోయాం! ప్రాణంలో ప్రాణంగా మసలిన అతన్ని మర్చిపోవడం కన్నా దారుణం మరోటుంటుందా? " అని నన్ను నేను తిట్టుకున్నాను.

"నిజమే మున్నీ! పాపం జయ ఏం చేస్తు

న్నాడో, ఎలా ఉన్నాడో" కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు కిరీటి.

"కిరీటి!... నేను ఓసారి పల్లెకెళ్తాను!" అన్నాను.

"పల్లెకా! కానీ అక్కడెవరున్నారు? జయ కూడా ఢిల్లీలోనే ఉన్నాడుగా!"

"కాదు, ఓసారి వెళ్ళి వివరాలు కనుక్కొస్తాను. జయ వాళ్ళ మామయ్య ఫోన్ నెంబరు అదీ తీసుకొస్తాను!" అన్నాను స్థిరంగా.

కిరీటి ఏమనుకున్నాడో అంగీకారంగా తల పంకించాడు.

ఆ రాత్రంతా రెప్ప మూతపడలేదు మా ఇద్దరికీ కూడా.

పూర్తిగా తెల్లవారకుండానే రాజన్నయ్యా, గిరన్నయ్యా వచ్చేశారు. వాళ్ళని చూసేసరికి మళ్ళీ దుఃఖం పొంగింది. ఇద్దరూ కలిసి ఎన్నోరకాలుగా నన్ను ఓదార్చారు. నా ప్రయాణం సంగతి విని తెల్లబోయారు.

"ఒద్దమ్మా! అక్కడికెళ్తే, వాళ్ళు నీకు మరింత గుర్తుకొస్తారు. వాళ్ళ ఫోన్ నెంబర్ మీ నాన్నగారికి ఫోన్‌చేసి కనుక్కుందాం," అన్నారు.

"అవును మున్నీ! ఈ టైమ్‌లో అక్కడికి వెళ్ళడం అంత మంచిది కాదు. మనమే ఎలాగో జయవాళ్ళ ఫోన్ నెంబర్ తెలుసుకుందాం." అన్నాడు కిరీటి అనునయంగా.

నేను మౌనంగా ఉండిపోయాను ఎటూ తేల్చుకోలేనట్టు. అయితే ఎనిమిది గంటలయేసరికి చిత్రంగా అమ్మా నాన్న దిగారు. వాళ్ళు లోపలికిరాగానే ఏడుస్తూ అడిగాను అమ్మని ఈ దారుణం 'ఎలా జరిగింది? ' అని.

"ఎవడో లారీవాడు బాగా తాగి డ్రైవ్ చేస్తూ వేగంగా వచ్చి వాళ్ళ కార్ని గుద్దేశాడట. పాపం ఇద్దరూ అక్కడికక్కడే పోయారట!" అంది అమ్మ కళ్ళు తుడుచుకుంటూ.

"అవునమ్మా' ఈ విషయం మీకు తెలిసే ఉంటుందనీ, నువ్వు మరింత బాధపడతావనీ పరిగెత్తుకొచ్చాం" అన్నాడు నాన్న.

"జయ ఫ్రెండొకతను చెప్పాడు మామయ్యా" - నీరసంగా అన్నాడు కిరీటి. తర్వాత జయని గురించి మాట్లాడుకున్నాం. అయితే జయావాళ్ల ఫోన్ నెంబర్ వాళ్ళక్కూడా తెలియదన్నారు అమ్మావాళ్ళు.

నాకు నీరసం వచ్చేసింది. దీనంగా, ఒంటరిగా ఉండి కుళ్ళికుళ్ళి ఏడుస్తున్న జయ మొహం కళ్ళముందు నిల్చి పుట్టెడు దుఃఖాన్ని తెచ్చిపెట్టింది. జయని చూడాలనే ఆరాటం పెరిగిపోయింది.

"ఏదీ మన చేతుల్లో లేదు తల్లీ! అంతా ఆ పైవాడి లీలలు. నీకెందుకు ఎలాగైనా జయని ఓసారి వెళ్ళిచూసొద్దాం" అంటూ ఓదార్చాడు నాన్న. అమ్మ కూడా ఎన్నో అనునయవాక్యాలు పలికింది.

నా మనసు బాగాలేదని ఆ సాయంత్రం అంధర్నీ బిర్లా మందిర్‌కి తీసికెళ్ళాడు కిరీటి. దైవదర్శనం చేసుకున్నాక కాస్త ప్రశాంతంగా అనిపించింది.

ఆ మర్నాడు నా కథకి అవార్డ్ వచ్చిందని ఓ పెద్ద పత్రికాఫీసునుంచి టెలిగ్రామ్ వచ్చింది. అందరూ పొంగిపోయారు. అయితే నాకు మాత్రం అది పెద్దగా ఆనందాన్నివ్వలేదు. కారణం పదేపదే జయ గుర్తురావడమే.

"కంగ్రాట్స్ యమునా!" అంటూ వచ్చారు రాజన్నయ్య, గిరన్నయ్యా. నేను థాంక్స్ కూడా చెప్పలేదు.

"ఏమిటి ఇంకా ఏడుస్తూనే వున్నావా? ఆంటీ వాళ్ళు కూడా వచ్చారు. అవార్డొచ్చింది. ఇంక నువ్వు కంటతడి పెట్టకూడదు" అన్నాడు రాజన్నయ్య.

"అదే నేనూ చెప్పేది ఇవాళ మా అందరికీ పార్టీ ఇవ్వాలి చెల్లాయ్!" అన్నాడు గిరన్నయ్య అమ్మావాళ్ళని పలకరించాక.

**ఎలాంటి బాధకైనా సహనమే సంజీవి. - ఫ్రాన్సిస్ బేకన్**

అప్పుడూ నేను మాట్లాడలేదు.

"ఒక్కడుగుతాను చెప్పు!" అన్నారు రాజన్నయ్య సీరియస్‌గా.

"ఏమిటి? " అన్నట్టు చూశాను.

"నీకు మృత్యుంజయ అంటే చాలా ఇష్టం కదూ? "

"అవును!"

"అతను క్షేమంగా ఉన్నందుకు సంతోషించు!"

"అంటే? " కళ్ళు చిట్లిస్తూ అడిగాను.

"అసలు కారు మీ జయే డ్రైవ్ చేస్తాడట ఎప్పుడూ. కానీ ఆరోజు మీ డాక్టర్ మామయ్య చేశారు. ఒకవేళ జయే చేస్తే అతనూ పోయేవాడుగా, అదృష్టవశాత్తూ అతను వేరేపనుండి వాళ్ళతోపాటు వెళ్ళలేదట" తను విన్న విషయం చెప్పాడు రాజన్నయ్య.

నా గుండె ఝల్లుమంది. చిత్రంగా దుఃఖం కాస్త తగ్గింది. పెద్ద దుఃఖం చిన్న దుఃఖాన్ని తగ్గిస్తుందంటారు ఇదేనేమో. 'సరిసరి ఇవాళ ఏ హోటల్‌కెళ్దాం!" హడావిడి చేశాడు గిరన్నయ్య.

నాలుగైదు రోజులుండి అమ్మావాళ్ళు వెళ్ళిపోయారు. ఎంత ప్రయత్నించినా జయ అడ్రస్‌గానీ, ఫోన్ నెంబర్‌గానీ దొరకలేదు.

"వాళ్ళ అడ్రస్ మనకి తెలియదుసరే. మన అడ్రస్ తనకి తెలుసుగా. ఓ లెటర్ రాసిపడెయ్యకూడదూ జయ? " అనుకున్నాను అసహనంగా.

యాంత్రికంగా రోజులు గడుస్తున్నాయి. కిరీటి చదువులో పడిపోయాడు. ఏవేవో జోక్స్ చెప్పి నవ్వించాలని ప్రయత్నించేవారు ఇద్దరన్నయ్యలూ.

నిజం చెప్పాలంటే నేనూ కాస్త తేరుకున్నాను. అత్తయ్యా మావయ్యా వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళారు. వాళ్ళున్నప్పుడు జయావాళ్ళ గురించే మాట్లాడుకునే వాళ్ళం. మామయ్య మాత్రం -

"చూడు యమునా! మీ ముగ్గురి స్నేహం ఎంత గొప్పదో నాకు తెలియంది కాదు. మీ ఫ్రెండు హాయిగా చదువులో పడిపోయాడు. అతను క్షేమంగా ఉన్నందుకు ఆనందించు" అన్నాడు కాస్త గంభీరంగా.

"అవునే మున్నీ! వీడికా పరీక్షలు దగ్గరికొస్తున్నాయి. నువ్వలా దిగులుగా వుంటే వాడు నిశ్చింతగా చదువుకోగలడా చెప్పు! పరీక్షలవగానే ఓసారి ఢిల్లీ వెళ్ళి మీ జయని చూసి పలకరించండి!" అంది అత్తయ్య.

"నువ్వలా వుంటే నాకు అక్షరం బుర్రకెక్కదు మున్నీ! ప్లీజ్ మామూలుగా, నవ్వుతూ నవ్విస్తూ ఉండవూ"! బేలగా అన్నాడు కిరీటి.

"నిజమే" అనిపించింది నాకు. భారంగా నిట్టూర్చి -

"అలాగే కిరీటీ! ఏదీ మన చేతుల్లో లేదు! నువ్వు చదువుకో, నేనో మంచి నవలకి ప్లాట్ ఆలోచిస్తాను!" అన్నాను మనస్ఫూర్తిగా.

ఆ మాటకే పొంగిపోయారంతా. అత్తయ్య మామయ్య వెళ్ళాక పూర్తిగా చదువులో పడిపోయాడు కిరీటి. అయితే తరచూ జయని గురించి చర్చించుకునే వాళ్ళం. డాక్టర్ మామయ్య వాళ్ళని తల్చుకుని బాధపడేవాళ్ళం. యాక్సిడెంట్ చేసిన లారీ డ్రైవర్ని దుమ్మెత్తిపోసేవాళ్ళం. కాస్త బెంగనిపించినప్పుడు పల్లెకెళ్ళొచ్చేదాన్ని. తిరిగి రాగానే డాక్టర్ మామయ్యావాళ్ళిల్లు పాడుపడ్డట్టుందని చెప్పి బాధపడేదాన్ని.

"ఢిల్లీ వెళ్ళి జయని చూస్తాంగా" అని తృప్తిపడే వాళ్ళం. పరీక్షలు భూతాల్లా తరుముకొస్తున్నాయి. కిరీటి తెగ చదివేస్తున్నాడు. ఒకోసారికి రాజన్నయ్యా వాళ్ళు మా ఇంటికే వచ్చి చదువుకునే వాళ్ళు. రాజన్నయ్యకి టీ కాచడమే కాదు, వంట చెయ్యడం కూడా వచ్చు. అసలు మావూళ్ళో చాలా మంది కాఫీలు తాగరు, పొద్దున్నే గ్లాసుడు గుమ్మపాలో, వేడిపాలో తాగుతారు. కొందరు చద్దన్నం, తరవాతే అన్నం తింటారు. తరవాతే అన్నం అంటే కందులు, ఉలవలూలాంటివి మూటకట్టి ఓ

పెద్దకుండలో గంజినీళ్ళు పోసి, ఆ నీళ్ళలో అన్నం పడేసే వారు. నాకు సరిగ్గా తెలియదుగానీ మజ్జిగ కూడా పోసేవారనుకుంటాను. అది పులిసి చక్కని వాసన వచ్చేది. ఆ తరవాతే అన్నం తింటే ఎంత వేసవిలోనైనా, గాడ్పుల్లో తిరిగినా వడకొట్టదట! బామ్మ చెప్పేది. మా ఇంట్లో కాఫీలు తాగే వాళ్ళం. పిల్లలం చద్దన్నాలు కూడా తినే వాళ్ళం. కానీ టీ అన్నది ఎవరూ తాగేవారు కాదు. ఇదిగో ఇప్పుడు కిరీటి కోసం 'టీ' కాచడం నేర్చుకున్నాను. నేను రాత్రులు లేచి టీ పెడుతుంటే గిరన్నయ్య-

"ఈ టీల సంగతి మేం చూసుకుంటాం చెల్లెమ్మా! నువ్వెళ్ళి పడుకో!" అంటూ నన్ను పంపేసే వాడు. వాళ్ళే ఓ పెద్ద ఫ్లాస్క్ నిండా టీ పోసుకుని నైటవుట్ చేసే వారు.

అప్పుడే అమ్మకి ఒంట్లో బాగాలేదని ఫోనొస్తే పల్లెకి బయల్దేరాను.

"అత్తయ్యకి జ్వరం తగ్గినా, కొన్నాళ్ళ పాటు నువ్వక్కడే వుండు, మేం ముగ్గురం కలిసి చదువుకుంటాం!" అన్నాడు కిరీటి. నాకూ అదే మంచిదనిపించింది.

నేను వెళ్లేసరికి అమ్మ వీధిలో ఉన్న నంది వర్ధనాలు కోస్తోంది పూజ కోసం. కాకపోతే కాస్త నీరసంగా వుంది. నన్ను చూసి ఇంత మొహం చేసుకుని, పొదివి పట్టుకుని లోపలికి తీసికెళ్ళింది.

"ఎలా వుందమ్మా?" అన్నాను అమ్మని నా పక్కనే కూర్చోపెట్టుకుని. అమ్మ నవ్వింది. "నాకేం లేదే. ఓ రోజు కాస్త ఒళ్ళు వెచ్చపడింది జలుబు చేసి. ఇంక అంతే! అదేదో కొంపలంటుకుపోయే విషయం అన్నంత హడావిడి చేసి నిన్ను కూడా రప్పించారు మీ నాన్న, మీ అత్తయ్య కలిసి!" అంది కోపం నటిస్తూ.

"అవునే! ఉన్న ఒక్కగానొక్కకూతురూ చిన్నతనంలోనే అత్తవారింటికెళ్ళిపోయిందని మీ అమ్మ దిగులు పడుతోంది. అందుకే నిన్ను పిలిపించాను. పైకలా అంటోందిగానీ మీ అమ్మ మొహం చూడు నిన్ను చూడగానే ఎంత వెలిగిపోతోందో!" అంటూ వచ్చింది అత్తయ్య.

"నేనెళ్ళింది అత్తారింటిక్కాదు. మొగుడింటికి! అది సరేగానీ చిన్నపిల్లల్ని మమ్మల్నిలా వదిలేసి దిగులు పడకపోతే నువ్వో, అమ్మో మా దగ్గరికొచ్చి వుండచ్చు కదా?" అన్నాను ఆరిందలా.

"మేం వస్తే మాత్రం నువ్వు మా దగ్గర క్షణం వుంటావా? ఎంతసేపూ 'కిరీటీ! కిరీటీ' అంటూ వాడి చుట్టూనే తిరుగుతుంటావ్! వాడూ నిన్ను వదలడు, ఇంక మేమెందుకు మధ్య" అంది అత్తయ్య నాకు కాఫీ అందిస్తూ.

నేను నవ్వాను. జవాబు దొరక్కపోతే అలా నవ్వెయ్యడం నాకలవాటే.

"మీ నాన్న మామయ్య కలిసి పొలం వెళ్ళారు. ఇవాళ అందరం కలిసి ఇక్కడే భోం చేద్దాం" అని, అత్తయ్యతో శాకపాకాలేం చెయ్యాలో ఏకరువు పెట్టింది అమ్మ.

వచ్చి ఇంతసేపైనా కిరీటిని గురించి ఒక్క మాట అడగని వాళ్ళ మీద పిచ్చ కోపం వచ్చింది నాకు. అదే అంటే వాళ్ళు తేలిగ్గా నవ్వేసి-

"మాకన్నా అపురూపంగా నువ్వు వాణ్ని చూసుకుంటుంటే ఇంక వాడి గురించి మాకు దిగులెందుకే!" అన్నారు. ఆ మాట రవంత గర్వాన్ని తెచ్చిపెట్టింది నాకు.

ఇంతలో నాన్న మామయ్య వచ్చారు. నాన్న నన్ను పొదివి పట్టుకుని తలమీద ముద్దు పెట్టుకుని ఆప్యాయంగా పలకరించాడు. మామయ్య నవ్వుతూ-

"ఇది మా అల్లరి మున్నీయేనా?" అన్నాడు. తర్వాత కిరీటి గురించి, అతని చదువు గురించి అడిగారు. నేను అన్నీ వివరంగా చెప్పాను.

"వాడి పరీక్షలయేదాకా ఇక్కడే వుండిపోవే!" అంది అత్తయ్య.

"కిరీటీ అదే అన్నాడు. కానీ పాపం! తనొ

క్కడూ ఎలా వుంటాడు. హాస్టల్ తిండి అస్సలు పడదు!" అన్నాను దిగులుగా.

"నీవంటే తింటున్న వాడికి హాస్టల్ తిండి తినడం పెద్ద కష్టం కాదే!" అన్నాడు మామయ్య. ఓసారి నావంట తినే భాగ్యం ఆయనక్కలిగింది. మాడిపోయిన కూర, ఉప్పులేని పప్పు బలవంతంగా మింగుతుంటే నాకే సిగ్గేసింది. అందుకే అత్తయ్యా, అమ్మ ఎవరైనా వున్నప్పుడు వంటింటి ఛాయలక్కూడా పోయేదాన్ని కాదు.

"సరేలెండి! పసిపిల్ల దానికా వంటలూ వార్పులూ ఏం తెలుసు గనక! అమ్మ చూడాలనే కోరికతో చేశాంగానీ, లేకపోతే పెళ్ళీడే రాలేదు!" అంది అత్తయ్య నన్ను వెనకేసుకొస్తూ.

తర్వాత వరండాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు నాన్న, మామయ్య. అమ్మ, అత్తయ్య వంటలో పడ్డారు. నేను ఏదేదో వాగేస్తున్నాను.

"అది సరేనే మున్నీ! మీరు జాగ్రత్తగా వుంటున్నారా? " గొంతు తగ్గించి మెల్లగా అంది అత్తయ్య.

"జాగ్రత్తగానా? "

"అదేనే! మీ ఇద్దరూ... ఒకే చోట పడుకుంటారు కదా..."

"ఒకే చోటేంటి, ఒకే మంచం మీద, కిరీటి చదువుకునేటప్పుడు తన ఒళ్ళో పడుకుని నిద్రపోతాను కూడా!" గర్వంగా అన్నాను. మొహాలు చూసుకున్నారు అమ్మావాళ్ళు.

"అది కాదమ్మా, మీరింకా చిన్నపిల్లలు కదా... అదీగాక కిరీటి చదువు పూర్తి కాలేదు, ఇప్పుడే మీకు పిల్లలు పుడితే..." నీళ్ళు నమిలింది అమ్మ. నేను ఫక్కున నవ్వాను.

"ఓ! మీరడిగేది ఆ జాగ్రత్తల గురించా! అబ్బో! చాలా తీసుకుంటున్నాం. రోజూ కిరీటి రాత్రులు..." అంటూ ఉత్సాహంగా ఏదో చెప్పబోతుంటే నానోరు మూసేసిందత్తయ్య. నేను తేరుకునేంతలో పక్కింటి పార్వతమ్మగారు ఆయాసపడుతూ వచ్చి పలకరించింది. బోలెడు కబుర్లు చెప్పి ఆవిణ్ని ఆశ్చర్యపరిచేశాను.

"ఇన్ని చెప్పావ్! ఏదైనా విశేషం వుందా లేదా? అది చెప్పు!" అందావిడ నన్ను పరిశీలనగా చూస్తూ. "విశేషాలకేం చాలానే వున్నాయి. ఓసారి హైదరాబాదు రాకూడదూ! బోలెడు విశేషాలు, వింతలూ చూపిస్తాను" అన్నాను అమాయకంగా. ఆవిడ నవ్వి ఏదో అనబోతుంటే అమ్మే ఏదో సర్దిచెప్పింది. నేను ఆలోచనలో పడ్డాను.

"ఏమిటే ఒక్కసారిగా సైలెంటయిపోయావ్? " అంది అత్తయ్య విస్మయంగా.

"ఏంలేదు. ప్రతి సినిమాలోనూ పెళ్ళనగానే వాళ్ళ అత్తలూ, అమ్మలూ "వచ్చే ఏడాది రోజులకల్లా గుమ్మడిపండు లాంటి బిడ్డను మా చేతులో పెట్టాలి. అంటారు కదా. మీరేంటి నాకు పిల్లలెక్కడ పుడతారో అని కంగారుపడతారు? " అన్నాను దబాయించినట్టు. నేనడిగిన తీరుకి బిత్తరపోయారు అమ్మ, అత్తయ్య. నేనే ఫామిలీప్లానింగ్ గురించి ఏదో చెప్పబోతుంటే.

"ఎరక్కపోయి అడిగాను తల్లీ! ఇంకెప్పుడూ ఆమాటెత్తను. ఇంక ఆ విషయం వదిలెయ్యి!" అంది. అత్తయ్య కంగారుగా నేను నవ్వేశాను.

వారం రోజులు నవ్వుతూ తుళ్ళుతూ తిరిగాను. కానీ కిరీటి మీద బెంగ నానాటికీ పెరిగిపోయి వెళ్ళిపోతానని గోలచేసి అత్తయ్యతో కలిసి హైదరాబాద్ చేరుకున్నాను. పైకి అన్లేదుగానీ కిరీటికూడా నామీద బెంగ పెట్టుకున్నట్టున్నాడు. నన్ను చూడగానే ఇంతమొహంచేసుకున్నాడు.

కుశల ప్రశ్నలయ్యాక-

'జయావాళ్ళ గురించి ఏమైనా తెలిసిందా? తనిక్కడికి వచ్చాడా? " అన్నాడు ఆత్రుతగా. నా మొహం వెలవెలపోయింది. నేనసలా విషయమే అడగలేదు. అత్తయ్యే చెప్పింది జయ మళ్ళీ అటుకేసిరాలేదని.

నాకు మళ్ళీ దిగులు మొదలయింది.



జయ రూపం కళ్ళముందు నిల్చింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అది గమనించిన కిరీటి మాటమార్చి ఏవో జోక్స్ చెప్పి నవ్వించాడు.

పరీక్షలైపోయాయి. రాజన్నయ్య, గిరన్నయ్య వాళ్ళు ముంబాయికి ఒకళ్ళు కలకత్తాకు ఒకళ్ళు వెళ్ళిపోయారు. కన్నీటితో వీడ్కోలు తీసుకుంటూ. మాకు దుఃఖం వచ్చింది. ఆ తర్వాత అత్తయ్యతో కలిసి పల్లెకి వెళ్ళిపోయాం. ఢిల్లీ వెళ్ళాలనే కోరిక మనసులో మెదులుతూనే ఉంది.

★ ★ ★

కాలచక్రం దొర్లిపోతోంది. మేం ఢిల్లీ వెళ్ళనేలేదు. క్రమేపీ జయని, జయకి వచ్చిన కష్టాన్నీ పూర్తిగా మర్చిపోయాం. అసలు జయ ఇండియాలోనే లేదని ఎవరో అనగా విన్నాం కూడా. నాన్న, మామయ్య కిరీటిని అడిగారు. కావాలంటే విదేశాలకెళ్ళమని. కానీ కిరీటికి విదేశాల మీద మోజులేదు. అందుకే పి.జి.కూడా ఇక్కడే చేశాడు. జయలా కిరీటి కూడా వెళ్తానంటాడేమో అని భయపడ్డ మావాళ్ళంతా తేలిగ్గా ఊపిరి తీసుకున్నారు. మాటవరసకి అడిగారే గానీ మమ్మల్ని అంత దూరం పంపడం మావాళ్ళెవరికీ ఇష్టంలేదు. నిజం చెప్పాలంటే నాకూ ఇష్టంలేదు.

కిరీటి పి.జి. పూర్తిచేసిన వెంటనే మంచి ఉద్యోగం వచ్చింది. మా పేరెంట్సు, కిరీటి పేరెంట్సు కూడా మురిసిపోయారు. ఉద్యోగంలో చేరేముందు మా ఊరెళ్లాం. పూజారి తాతగారు స్వయంగా వచ్చి అభినందనలు చెప్పి ఆశీర్వదించారు.

"అంతా మన మున్నీ అదృష్టం!" అంది మునసబుగారి పెళ్ళాం. పూజారి తాతగారు అదే అన్నారు.

"అంటే నా గొప్పతనం ఏంలేదంటారా తాతగారూ? " నవ్వుతూ అన్నాడు కిరీటి.

"నీ గొప్పతనమా? రాలుగాయి, అల్లరి పిల్ల అయిన మున్నీ తల్లిని ఇంత బుద్ధిమంతురాలిగా మార్చావ్, అంతకన్నా ఏంకావాలి" అన్నాడు పూజారి తాతయ్య. అంతే కాదు. ఆనాడు మేమిద్దరం కాట్లకుక్కల్లా పోట్లాడుకోవడం అవన్నీ గుర్తుచేశాడు.

ఈసారి నాకు సిగ్గేసింది.

కాస్సేపు కూర్చుని అందరూ వెళ్ళిపోయారు. నాన్న, మామయ్య వరండాలో కూర్చుని మాట్లాడుకుంటూంటే మేం హాల్లో కూర్చున్నాం.

"ఏవిటర్రా. రాత్రింబవళ్ళు కష్టపడి మావాడు పెద్దచదువులు చదివి మంచి ఉద్యోగం సంపాదించుకుంటే ఆ ప్రజ్ఞ అంతా మీ కూతురిదే అంటారు? " అంది అత్తయ్య కోపం నటిస్తూ.

"మా పిల్లే దగ్గరుండి చదివించిందనే సంగతి మర్చిపోకు. ఇంక అసలు ప్రజ్ఞంతా ముందుముందు మీవాడే చూపించాలి" అంది అమ్మ నవ్వుతూ.

"ఏవిటి చూపించిన ప్రజ్ఞ చాలదా? "

"ఉఁహూ! వచ్చే ఏడీరోజుకల్లా గుమ్మడి పండులాంటి మనవణ్ని కని మన చేతుల్లో పెట్టాలి!"

"ఏవిటి? నవమాసాలూ మోసి వాణ్నే కనీయమంటావా కొడుకుని? " కిసుక్కున నవ్వింది అత్తయ్య. కిరీటి సిగ్గుపడిపోయాడు. బైటికెళ్ళబోతుంటే అత్తయ్యే ఆపేసింది.

"అత్తయ్యకు జవాబు చెప్పి వెళ్ళరా!" అంటూ.

"ఏంచెప్పనూ? " బుర్ర గోక్కున్నాడు కిరీటి.

"అదే! నీ చదువు అదీ పూర్తయ్యాయి. మంచి ఉద్యోగస్థుడి వయ్యావు. ఇక ఆలస్యం చెయ్యకుండా అత్తయ్య ముచ్చట తీర్చే ప్రయత్నంలో ఉండండి!" అంది అత్తయ్య.

"మనవణ్నెత్తుకోవాలని నీకు మాత్రం లేదా? " అంది అమ్మ.

"ఎలా వుంటుందమ్మా! ఆవిడగారికి అప్పుడే బామ్మగా మారడం ఇష్టంలేదు." ఎప్పుడూ లేనంత సరదాగా అంటూ లోపలికి వచ్చాడు మామయ్య, నాన్నతో కలిసి.

"మీకుందేమో తాతయ్య అనిపించుకోకూడదని!" కోపం నటించింది అత్తయ్య.

"అయితే ఇంక మీదే ఆలస్యంరా!" అన్నాడు మామయ్య. మరింత సిగ్గుపడిపోయాడు కిరీటి.

"ఇదిగో మీరేం వాదించుకోకండి. త్వరలో మీకు మనవణ్నో, మనవరాల్నో కని ఇచ్చే బాధ్యత నాది!" అంటూ హామీ ఇచ్చేశాను.

"ఏవిటేవ్. కొంపతీసి అప్పుడే నెలతప్పావా? " అంది అత్తయ్య ఆశ్చర్యం నటిస్తూ.

"హయ్యో! నెలతప్పడమా నా బొందా! కిరీటి పి.జి. అయిపోగానే చెప్పాను. ఇంక మనం ఫామిలీ ప్లానింగ్ మానేద్దాం అని. నీ కొడుకు వింటేగా. రాత్రి బెడ్‌రూమ్‌కెళ్ళి పడుకోగానే..."

"ఇక వివరాలొద్దులే, మాకర్థమైపోయింది" కంగారుగా అంది అమ్మ. కిరీటి సిగ్గుపడుతూనే, నాకేసి కోపంగా చూశాడు. నేను ఎప్పట్లా నవ్వేశాను.

"సరి! సరి! రేపు సత్యన్నారాయణ వ్రతానికి అన్ని ఏర్పాట్లూ చేశాను. మనవాళ్ళందర్నీ పిలవండి!" అన్నాడు నాన్న మాటమారుస్తూ.

మర్నాడు అందరం కలిసి సత్యనారాయణ వ్రతం చేసుకున్నాం. తరువాత తిరుపతి వెళ్ళి తిరిగి హైదరాబాదు చేరుకున్నాం. ఎంత బతిమాలినా అమ్మావాళ్ళు ఎక్కువ రోజులు మా దగ్గర ఉండలేదు. పానకంలో పుడకల్లా మీ దంపతుల మధ్య మేమెందుకే అంటూ, వంద జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళాక చూడాలి కిరీటి అల్లరి! ఎప్పుడూ ఏదో ఓ చిలిపి పని చేస్తూ నా చుట్టూ తిరిగేవాడు. నాకు సినిమాలంటే ఇష్టమని తరచూ ఏదో ఓ సినిమాకి తీసికెళ్ళేవాడు. ఓసారి కిరీటి...

అరె! ఇదేవిటి జయ "మన బాల్యం గురించి రాయమంటే నేను ఏదేదో రాస్తున్నాను". ఛ! ఛ! మా గురించిన వివరాలు రాయకూడదు. బాల్యం అయిపోయిందిగా.

ఇక వర్తమాన కాలంలోకి వద్దాం.

మంచి రచయిత్రిగా పేరుపొందిన నేను రెండు చేతులతోనూ రాస్తున్నట్టు ఎన్నో రచనలు చేశాను. మరెన్నో అవార్డ్లు అందుకున్నాను.

ఆర్నెల్ల క్రితం రాత్రి పన్నెండింటిదాకా మంచం మీద పడుకుని గాఢనిద్రలోకి వెళ్ళి, ఎవరో తట్టి లేపినట్టు తుళ్ళిపడి లేచాను. అయోమయంగా అనిపించింది. కలో, నిజమో తెలియని పరిస్థితి!

గుండెల మీద ఏదో బండరాయి పెట్టినట్టు, నల్లని మబ్బులాంటి ఆకారం నన్నావహించినట్టు, భయంకరమైన అనుభూతి. గట్టిగా అరవాలనుకున్నాను. కానీ నోరు పెకల్లేదు. కళ్ళు చూస్తున్నా, శరీరం స్వాధీనంలో లేదు. ఒళ్ళంతా చమటలు పట్టాయి.

కొన్ని క్షణాల తర్వాత నాలో చలనం వచ్చింది. కాళ్ళూ చేతులూ స్వాధీనంలోకొచ్చాయి. గట్టిగా అరిచినట్టు పిలిచాను కిరీటిని.

మంచి నిద్రలో ఉన్న కిరీటి తుళ్ళిపడి లేచి నన్ను పొదివి పట్టుకున్నాడు. నిలువెల్లా ఒణికిపోతున్న నన్ను చూసి హడలిపోయాడు. నన్ను కుదుపుతూ ఏదేదో అడుగుతున్నాడు. చెప్పాలని నాకూ వుంది. కానీ 'కిరీటీ' అన్న పిలుపు తప్ప మళ్ళీ నోరు పడిపోయినట్టయింది. తర్వాత ఏదో మగత ఆవహించింది. మరో నిమిషానికల్లా స్పృహ కోల్పోయాను.

నేను మళ్ళీ కళ్ళు తెరిచేసరికి హాస్పిటల్లో వున్నాను. జరిగిందంతా గుర్తొచ్చి మళ్ళీ ఒళ్ళంతా చెమట పట్టింది. వెన్నులోంచి ఒణుకు మొదలయింది. నా స్థితి చూసి కిరీటికి దుఃఖం వచ్చేస్తోంది. కిరీటిని ఓదార్చాలన్నా ఓదార్చలేని పరిస్థితి.

కిరీటి డాక్టర్ని ఏదో అడుగుతున్నాడు మెల్లగా. డాక్టర్ చెప్తుంటే ఆతృతగా వింటున్నాడు. నేనలా కళ్ళు మూసుకున్నాను. మరో అయిదు నిమిషాలకి నేను మామూలు స్థితికి వచ్చినట్టయింది. మెల్లగా కిరీటిని పిల్చాను, కిరీటి, డాక్టర్ కూడా నా దగ్గరికొచ్చారు. నా పల్స్ చూస్తూ-

"ఏమైందమ్మా?" అన్నాడు డాక్టర్ మృదువుగా. ఆయన్ని చూస్తుంటే మా డాక్టర్ మామయ్య గుర్తొచ్చాడు. అచ్చం అలాగే వున్నాడీయన కూడా. నేను మాట్లాడకపోవడంతో మరోసారి అడిగాడు డాక్టర్. నేను నా అనుభవం చెప్పాను. నాక్కనిపించిన ఆకారాన్ని వర్ణించాను.

ఆయన సన్నగా నవ్వాడు. ఆ నవ్వు చూస్తుంటే నా మాటలు ఆయన నమ్మడం లేదనిపించింది. నేనేం పసిపిల్లనా అబద్ధం ఆడడానికి?

"పీడ కలొచ్చిందంతే" అన్నాడు కిరీటి.

"ఎస్! నిజంగా మీకు పీడకలే వచ్చింది!" తేల్చేశాడు డాక్టర్ కూడా. నేను మాట్లాడలేదు.

"మీరు ఫేమస్ రైటర్. ఎన్నో నవలలు రాశారు. ఎంతమంది చరిత్రలో రాశారు. అలాంటిది ఓ కలకి ఇంత భయపడుతున్నారంటే... చాలా ఆశ్చర్యంగా ఉంది!" అన్నాడాయన మళ్ళీ నవ్వుతూ.

"అది కల కాదు!" అని అరవాలనిపించింది. అలా అరిస్తే 'పిచ్చిది' అన్న ముద్ర కూడా వేస్తారేమో అని భయపడి మౌనంగా ఉండిపోయాను.

నాకు డాక్టర్లంటే ఒక రకమైన బెరుకు. చిన్నప్పట్నించీ జలుబు చేసి కూడా ఎరగను. ఒక్క తుమ్ము తుమ్మితే చాలా డాక్టర్ మామయ్య మందులిచ్చేవాడు. లేకపోతే బామ్మ మిరియాల కషాయం తాగించి, పసుపు నీళ్ళలో వేసి ఆవిరి పట్టించేది. అందుకే నాకు డాక్టర్లన్నా, ఇంజక్షన్లన్నా భయం.

**తన దేశాన్ని ప్రేమించలేనివాడు దేన్నీ ప్రేమించలేడు. – సిసిరో**

కిరీటి కోరిక మేరకు టెస్టులు రాశాడు. డాక్టర్

"మీ తృప్తి కోసం చేస్తున్నాను. కానీ ఆవి డకేం లేదు. కేవలం నిద్రలో లేచి భయప' డ్డారు. ఒకోసారి ఆ కలలు అతి ధైర్యస్తుల్ని సైతం కలవరపెడతాయి. యు డోంట్ వర్రీ", అని కిరీటికి ధైర్యం చెప్పాడు.

నాతోనూ అదే చెప్పాడు. పైగా "మీ కలం నుంచి ఎన్నో రచనలు రావాలి. మీరు మరిన్ని అవార్డ్స్ అందుకోవాలి. ఈ మాత్రానికే అస్త్రసన్యాసం చేసినట్టు కలం సన్యాసం చేసేస్తే ఎలా!" అంటూ తన జోక్‌కి తనే నవ్వాడు.

నిజం చెప్పద్దూ. నాకు ఆయన మీద చాలా కోపం వచ్చింది. అయినా బైటపళ్ళేదు.

"ఓ పని చెయ్యకూడదూ? " మృదువుగానే అన్నాడాయన. నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"అంటే? " తీక్షణంగా అన్నాను.

"సారీ! మిమ్మల్ని బాధపెట్టాలని కాదు. ఈ కలలూ, భయాలూ, మనల్ని నీడలా వెంటాడి, భయపెడుతుంటాయి ఒకోసారి. మీరు లోకాన్ని చదవగలిగిన మంచి రచయిత్రి. పదిమందికి ధైర్యం చెప్పాల్సిన మీరు ఇలా అయిపోతే ఆలోచించి చూడండి. మీదంతా భ్రమ. మీరెప్పుడూ ఊహాలోకాల్లో విహరిస్తుంటారు. ఆ ఊహలే మిమ్మల్ని భయపెట్టవచ్చు" అంటూ ఓ గంట క్లాస్ తీసుకున్నాడు డాక్టర్

"అంటే ఊహించకుండా రాయమంటారా? " అన్నాను రవంత వ్యంగ్యంగా. ఆయన నవ్వాడు.

"లేదు, ఊహించండి. మీ ఊహల్ని కాగితం మీద పెట్టండి. పది మందిచేతా చదివించండి. అంతేగానీ మీ ఊహలకి మీరే భయపడకండి" అని చెప్తున్నాను. అన్నాడు శాంత గంభీరస్వరంతో.

నేనేదో అనబోతుంటే కిరీటి వారించాడు. డాక్టర్‌తో ఏదో మాట్లాడి నన్ను తీసుకుని వచ్చేశాడు.

"ఏవిటీ డాక్టర్లు! నా మాటలు కిరీటికూడా నమ్మడం లేదేమిటి? " అనుకుంటే నాకు అందరిపైనా కోపం పెరిగిపోతోంది. కిరీటిని అనవసరంగా తిట్టిపోశాను. అయినా కిరీటి బాధ పళ్ళేదు. నా మనసుకి నచ్చిన విధంగా ప్రవర్తించాలని ప్రయత్నిస్తూనే వున్నాడు.

ఓ రోజు ఏదో మేగజైన్ తిరగేసి రాత్రి పది గంటలకల్లా నిద్రలోకి జారిపోయాను.

మంచి నిద్రలో ఉండగా హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఎవరో రెండు చేతులతోనూ నా గొంతు పట్టుకుని నులుముతున్న అనుభూతి!

ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోయింది. శరీరం నిస్సత్తువుగా అయిపోయింది. కళ్ళు తెరిచి చూడాలంటేనే భయంగా ఉంది.

నో! నాకేదో అయింది... తెలియని శక్తి నన్ను పట్టి పీడిస్తోంది... ఇంక ఈ భూమ్మీద నాకు నూకలు చెల్లినట్లే... అనిపించ సాగింది.

అయిదు నిమిషాల తర్వాత నాకు స్పృహ పోతున్నట్టనిపించింది. మళ్ళీ ఎప్పుడు మెలకువ వచ్చిందో తెలియదుగానీ కళ్ళు తెరిచేసరికి, ఆత్రుతగా నా మొహంలోకి చూస్తున్న కిరీటి కనిపించాడు.

"ఏమైంది కిరీటీ? " అన్నాను నీరసంగా.

అంతవరకూ ఆత్రుతగా ఎదురు చూస్తున్న కిరీటి.

"ఏమైందో నువ్వు చెప్పాలి. నేను చూసేసరికి మంచంమీద నిశ్చలంగా పడుకున్నావ్. పిలిస్తే పలకలేదు. కంగారేసి డాక్టర్ని పిల్చాను" అన్నాడు సన్నగా నవ్వుతూ.

కిరీటి నవ్వు చూడగానే నాకు ధైర్యం వచ్చింది. నాకు కలిగిన అనుభూతిని విప్పి చెప్పాను. ఈసారి కిరీటి నవ్వలేదు.

"అయితే అన్ని టెస్టులూ చేయిద్దాం!"

అన్నాడు ఏదో ఆలోచిస్తూ.

"కానీ డాక్టర్ నాకే జబ్బా లేదన్నాడు?" అన్నాను అనుమానంగా.

"నేనూ అదే అంటున్నాను. నీ తృప్తి కోసం. నేనేం చెయ్యడానికైనా సిద్ధమే." అన్నట్టు చూశాడు కిరీటి.

నా మొహంలోకి కొండంత వెలుగొచ్చింది. కిరీటి మీద మరింత ప్రేమ పెరిగింది.

లేచి అతని చెంపలు రెండు చేతుల్లోనూ పట్టుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాను.

మళ్లీ డాక్టర్ల చుట్టూ తిరిగాం.

ఆ తర్వాత అన్ని టెస్టులూ జరిగాయి.

కానీ అన్నీ నార్మల్! నార్మల్! నార్మల్!

"అయితే నేను నిజంగానే కలకి భయపడ్డానా? లేకపోతే బామ్మ చెప్పినట్టు ఎవరైనా చేతబడి లాంటిది చేయించారా? ... మంత్రాలూ మాయలూ, చేతబడులూ లాంటివంటే నాకు నమ్మకం లేదు. కానీ నేను చూసిన నల్లని ఆకారం ఏమిటి? అది కల కాదే!"



## అక్కడికి వెళ్తారు

'అమృత్‌సర్‌లో కూడా రెడ్‌లైట్ ఏరియా ఉందా?'

'అబ్బెబ్బే.. అలాంటిదేం లేదు. 1947 నుంచి పంజాబ్‌లో వ్యభిచారం అనేదే లేదు'

'అలాగా.. అయితే మీ పంజాబీ యువకులంతా తమ సరదాలు ఎలా తీర్చుకుంటారు? లేక నిజంగానే అంత మంచివాళ్లా?'

'అబ్బెబ్బే.. అదేంలేదు. వాళ్ల సరదా తిరుగుళ్ల కోసం ఢిల్లీ, ముంబాయి నగరాలకు వెళ్తుంటారు అంతే.'

అంతా అయోమయంగా ఉంది. నాలుగు రోజుల తర్వాత నేను ఇంటికొచ్చేశాను. కానీ మామూలు మనిషిని మాత్రం కాలేదు.

ఎవరో వెంటాడుతున్నట్టు, ఏదో శక్తి నా గుండెల్ని పిండేసినట్టు, శరీరంలోని శక్తినంతటినీ బలవంతంగా లాగేస్తున్నట్టూ అనుభూతి!

ఈ విషయంలో కిరీటిని ఎన్నో రకాలుగా ఇబ్బంది పెట్టాను. పాపం. విసుగు విరామం లేకుండా నన్ను పిల్లి పిల్లని తిప్పినట్టు ఎన్నో ఊళ్లు తిప్పాడు. ఎంతో మంది స్పెషలిస్ట్‌లకి చూపించాడు.

"నీకేం జబ్బూ లేదు. ధైర్యంగా ఉండు!" అంటూ ఎన్నో రకాలుగా ధైర్యం చెప్పాడు.

"కిరీటీ! పోనీ ఓసారి సైకియాట్రిస్ట్‌ని కలుద్దామా?" అన్నాను.

అంతే! వెంటనే ఓ పేరు పడ్డ సైకియాట్రిస్ట్ దగ్గరికి తీసికెళ్లాడు కిరీటి.

అతగాడు వెయ్యి ప్రశ్నలు వేసి-

"మీకేం జబ్బూ లేదు. ఎప్పటిలా రచనలు చేసుకోండి!" అని సలహా ఇచ్చాడు.

"పోనీ అమెరికా వెళ్దామా?" భయం భయంగా అన్నాడు కిరీటి. నాకు అక్కడికెళ్లడం ఇష్టం లేదని కిరీటికి తెలుసు.

"ఉఁ హుఁ! నీకు కుదిరితే ఎక్కడికైనా సైట్ సీయింగ్‌కి వెళ్దాం!" అన్నాను.

వెంటనే కిరీటి దానికి కావల్సిన ఏర్పాట్లు చేశాడు.

ఎన్నో ఊళ్ళు తిరిగాం. ఎన్నో హాస్పిటల్స్ సందర్శించాం. లెక్కలేనన్ని జరిగాయి. ఎంతో మంది డాక్టర్లు... టెస్టులుచేసి ఏవో మందులిచ్చేవాళ్ళు. దిగులుగా ఇంటికొచ్చేసే వాళ్లం. కొన్నాళ్ళు బానే ఉండేది. మళ్ళీ మామూలే!

"మళ్లీ రచనలు చెయ్యి. ఊహా లోకంలో కెళ్తే ఇక నీకే దిగులూ ఉండదు" అనేవాడు కిరీటి. నేను పేలవంగా నవ్వేదాన్ని. అసలు ఏ థాటైనా వస్తేగా కలం కదిలేది?

ఎంతసేపూ నాకేమైంది? నేనెందుకిలా అయ్యాను. ఈ స్థితి ఏ హిస్టీరియా రోగి కిందో మార్చెయ్యదు కదా? అన్న భయం నన్ను వెంటాడుతుండేది.

నా మీద నాకే చిరాక్కలిగేది. ఇకే డాక్టర్ని కలవకూడదు అనుకునేదాన్ని. కానీ కిరీటి వదిల్తేనా? కల్పనా వ్యాసంగానికి సుందర ప్రదేశాలు ఉపయోగిస్తాయని నాకే కాదు, కిరీటిక్కూడా తెలుసు. అందుకే నన్ను ఆనందపరచడానికి, నేను సంతోషంగా ఉండడానికీ, అందంగా, ప్రశాంతంగా ఉంటాయన్న ప్రదేశాలన్నింటికీ తిప్పుతున్నాడు. ఆర్థిక ఇబ్బందులేం మాకు లేవు.

ఆ తిరగడంలోనే ఈ ఊరొచ్చాం. నేను కల్లో కూడా ఊహించని విధంగా జయని చూశాం.

అతన్ని చూశాక నాలో నిద్రాణమైన భావాలెన్నో పురులు విప్పుకున్నాయి. ఇన్నాళ్ళూ జయని చూడకుండా ఎలా ఉండ గలిగానో నాకర్థంకావడం లేదు.

నిజంగా జయది ఎంత మంచి మనస్సు! ఎంత ఉదార హృదయం? మేం తనని తల్చుకోవడమే లేదని తెలిసినా పెద్దగా పట్టించుకోలేదు. సరికదా. మమ్మల్ని అత్యంత ఆత్మీయులుగా భావించి ఆదరించాడు. తన పన్లన్నీ మానుకుని నా ఆనందం కోసం, నన్ను ఎన్నో చోట్లకి తీసి కెళ్ళాడు. తన 'ష్టం లేకపోయినా నా సంతోషం కోసం ఎన్నో పన్లు చేశాడు.

అంతేనా... నా రచనలన్నీ గుండెల్లో దాచుకున్నట్టు బీరువాల్లో దాచుకున్నాడు. నా రచనల్లోని మంచి చెడ్డల గురించి చర్చించాడు. తన మాటలతో నన్ను వినీలాకాశంలో విహరింప చేశాడు.

అన్నింటికన్నా ముఖ్యం నా బాల్యం. బాల్యాన్ని గురించి రాయలేదని నిష్టూరాలాడాడు. మాటల్లోనూ, చేతల్లోనూ అదే ఆప్యాయత! అదే చిరునవ్వు! అదే స్నేహభావం!

అలాంటి నేస్తాలు ఎంత మంది ఉంటారు? రియల్లీ అయామ్ వెరీ లక్కీ! నా మనసు బాగుండక పోవడం కూడా నాకో వరం అయింది. లేకపోతే జయని చూసే భాగ్యం కలిగేది కాదుకదా!

ఏది ఏమైనా జయ మనసంత స్వచ్ఛమైన మనసులు మావి కావని చెప్పడానికి సిగ్గుపడను.

నిజంగా జయ అన్నట్టు అంత మధురమైన బాల్యాన్ని నేనెలా మర్చిపోయాను? ఎన్నో రచనలు చేసిన దాన్ని నా బాల్యాన్ని గురించి జయ చెప్పేదాకా ఎందుకాలోచించలేదు?

ఈ విషయంలో కూడా నేను చాలా సిగ్గు పడుతున్నాను. జయ చెప్పాక ఆలోచించాను.

రాయాలి! నా నేస్తం కోసం రాయాలి? కరిగిపోయిన నా తియ్యని బాల్యపు రోజుల్ని కళ్లకి కట్టినట్టు రాయాలి?

అలా నిర్ణయించుకున్న తర్వాత నాకెంతో ఊరట కలిగింది. ఆర్నెల్ల తర్వాత జయకోసం మళ్లీ కలం పట్టుకున్నాను. అతను కోరినట్టు మా బాల్యం గురించి, మేం చేసిన అల్లర్ల గురించి, ఆటపాటల గురించి, చిన్ననాటి నేస్తాల గురించి గుర్తున్నంతవరకూ రాశాను. గత స్మృతుల్లోకి వెళ్ళగానే అంతకుముందు కదలనని మొరాయించిన నాకలం చకచక అక్షరాలని పేర్చుకుపోవడమే చిత్రం.

జయ సరదాగా అన్నా, కిరీటికి, నాకూ మధ్య జరిగిన స్వీట్ నథింగ్స్ ఏం రాయలేదు. అయినా నేను చిన్నారి యమునని

కాదు కదా. శోభనపు గదిలో జరిగినవి కూడా అన్నపూర్ణ లాంటి వాళ్లందరికీ చెప్ప డానికి సిద్ధపడ్డానికి!

అసలు మా కిరీటీకీ, నాకూ వున్న అను బంధం గురించి రాయాలంటే పెద్దగ్రంథమే అవుతుంది. ఆ అనురాగబంధాన్ని నాగుండె ల్లోనే పదిలపరచుకుని మా బాల్యాన్ని గురించి మాత్రం రాయడం పూర్తి చేశాను.

హమ్మయ్య. ఎలాగో జయ కోరినట్టుగా చిన్ననాటి ముచ్చట్లు రాశాను. అది ఓ మంచి నవల అవుతుంది. అన్ని పేపర్లూ ఫైల్‌లో పెట్టాను. చివరి పేజీలో అందమైన అక్షరాలతో అంకితం మేటర్ రాశాను.



నా ప్రియమైన నేస్తం,
డాక్టర్ మృత్యుంజయకి
ప్రేమాభిమానాలతో
హృదయ స్పందనలతో
ఎటో వెళ్లిపోతోంది
మనసు నిజగాథ
అంకితం, మున్నీ

ఇంక ఇది జయకివ్వాలి. చదివాక ఎలా ఫీలవుతాడో చూడాలి. వైదేహి చేత కూడా చదివించమనాలి అనుకుంటూ తృప్తిగా ఫైల్‌ను సర్దేసి మంచం మీద వాలాను.

చాలా రోజుల తర్వాత మనసు పెట్టి రాయడం వల్లేమో ఒక్కసారిగా నీరసం ఆవరించింది. అయినా దానికి మించిన తృప్తి కలిగింది.

★ ★ ★

**ఆ** రోజు కిరీటి ఏదో పనుందని, సాయంత్రం దాకా రాననీ బైటికెళ్లాడు. నేను కాస్త బాగున్నాననగానే కిరీటికి ఎక్కళ్లేని ధైర్యం వచ్చింది.

నా కళ్ళు జయ కోసం ఆతృతగా ఎదురు చూడసాగాయి.

జయతో నాకెంత చనువున్నా మనసులో ఓ బాధ కలుక్కుమంటూనే ఉంది.

జయ మాకు రాచమర్యాదలు చేస్తున్నాడు. లంకంత భవంతిని మాకు ఏర్పాటు చేశాడు. కానీ ఒక్కసారి తమ ఇంటికి ఆహ్వానించడంగానీ, వైదేహిగానీ, అతని పిల్లలుగానీ వచ్చి నన్ను చూడడం జరగలేదు. వైదేహిని గురించి నాకు తెలిసినా మరీ ఇంత అమర్యాదగా ప్రవర్తిస్తుందని ఊహించలేదు. ఆ విషయం నేను జయని అడగలేదు.

నేనీ ఆలోచనల్లో ఉండగానే జయ వచ్చాడు. అతన్ని చూడగానే నా కళ్లలో కొత్త కాంతి వచ్చేసింది.

"ఏమిటి మున్నీ! తీరిగ్గా కూర్చున్నావ్. మన కథ పూర్తయిందా? " నవ్వుతూ అన్నాడు జయ.

"అయిపోయింది!" గర్వంగా అన్నాను.

"కంగ్రాట్స్! ఏదీ!" ఆతృతగా అన్నాడతను.

"అమ్మా! అంత తేలిగ్గా ఇస్తానా? " అన్నాను.

అతను నవ్వాడు.

జయ ఎంత మధురంగా నవ్వుతాడు? అనుకున్నాను.

"కిరీటి లేడా మున్నీ!" అన్నాడు జయ ఏదో పుస్తకం తిరిగేస్తూ.

"లేడు మృత్యు! నేనే నీ కోసం కళ్లు కాయలు కాచేలా చూస్తున్నాను!" అన్నాను అతన్ని లాక్కొచ్చి సోఫాలో కూర్చోపెట్టి పక్కనే కూర్చుంటూ.

"ఎందుకు? "

"నీ ధర్మమా అని చిన్ననాటి సంఘటన

లన్నీ ఇవాళ జరిగినట్టు అనిపిస్తున్నాయి మృత్యూ! నా ఆనందాన్ని నీతో పంచుకోవాలని నా ఆరాటం. మనం హాయిగా మాట్లాడుకోవచ్చు కిరీటిక్కూడా లేడు!" అదోలా నవ్వుతూ అన్నాను. అతను నవ్వాడు.

"చిన్ననాటి సంగతులు స్మృతులు నీకంత ఆనందాన్నిచ్చాయా మున్నీ? " అన్నాడు నవ్వుతూనే.

"ఆనందమా! స్వర్గలోకంలో. విహరిస్తున్నంత ఆనందంగా ఉంది. పండువెన్నెల్లో, మల్లె తోటలో పరుగులు తీస్తున్నట్టుంది. ఏటిగలగలలు వింటూ, గిరిశిఖరాలు చూస్తూ ప్రియుని ఎదలో ఒదిగి గుసగుసలాడినట్టుంది." తన్మయత్వంగా అన్నాను.

"అయ్యబాబోయ్. నువ్వు మళ్లీ ఊహాప్రపంచంలోకెళ్లి పోయినట్టున్నావ్. ఇంతకుముందే చెప్పాను. నేను డాక్టర్నేగానీ,, రచయితని, కవినీ కాదని! నీ బాధపరంపరలు నా మీదికి వదిల్తే తట్టుకోలేను," భయం నటించాడు జయ.

నేను గలగల నవ్వేశాను పసిపాపలా. నానవ్వుని అలా చూస్తుండిపోయాడతను.

"ఏమిటిలా చూస్తున్నావ్" అన్నాను దబాయిస్తున్నట్టు.

"చిన్ననాటి నా మున్నీని."

"నేనింకా చిన్ననాటి మున్నీలాగే కనిపిస్తున్నానా మృత్యూ? " బేలగా అన్నాను.

"నా కెప్పుడూ నువ్వలాగే కనిపిస్తావని వందసార్లు చెప్పాను. ఇప్పుడూ, ఎప్పుడూ అదే చేప్తున్నాను!" అన్నాడు జయ.

"థ్యాంక్స్ మృత్యూ."

"నేనే నీకు థ్యాంక్స్ చెప్పాలి. చాలాకాలం తర్వాత మనసులో ఎన్నో మధురభావాలని తట్టి లేపినందుకు."

"నారాక నీకు అంత ఆనందాన్నిచ్చిందా? "

"మరి? అయినా నా మొహం చూస్తూంటే నీకు అర్థం కావడం లేదా? " నిష్టూరంగా అన్నాడు జయ.

"అయింది. ఇవాళ నువ్వు మరీ ఆనందంగా కనిపిస్తున్నావ్!"

"నువ్వు నాకు మధురమైన కానుక ఇవ్వబోతున్నావుగా!" ఓరగా చూస్తూ అన్నాడు జయ.

"అది నీ ప్రోత్సాహం వల్లే సాధ్యమైంది! ఇప్పుడు నాకూ వెర్రి ఆనందంగా వుంది. కిరీటి రాకుండానే మనం ఎన్నో విషయాలు మాట్లాడుకోవాలి!" అన్నాను ఏదో ఆలోచిస్తూ.

"కిరీటి ఉంటే మనకేం? " అంటూ నవ్వాడు జయ.

క్షణం నేను మాట్లాడలేదు.

"మున్నీ, నీకు శ్రమ ఇచ్చానా? " నీరసంగా ఉన్న నా మొహాన్ని చూస్తూ ఆందోళనగా అన్నాడు జయ.

"శ్రమా? ఏ విషయంలో? "

"అదే... రాయనన్న నీచేత గతాన్ని తవ్వించి మరీ రాయించడం, నువ్వు నీరసంగా అయిపోవడం.."

'ఛ!ఛ! అదేంలేదు. ఇంకా చెప్పాలంటే నాకు వెర్రి ఆనందంగా ఉంది" అతని మాట పూర్తికాకుండానే అన్నాను.

"మరి చాలా వీక్‌గా కనిపిస్తున్నావ్!"

"అది రాయడం వల్ల కాదు!"

"మరి? "

"హృదయస్పందన"

"వ్వాట్? "

"గుండెల్లో ఉన్న అలజడివల్ల నీరసంగా అయిపోయాను" నా గొంతు సన్నగా కంపించింది.

అతను కళ్లు చిట్లించాడు.

"నీరసించిపోయేంత అలజడి ఏం ఉందట ఈ గుండెల్లో? " అన్నాడు తమాషాగా నవ్వుతూ.

"గుండెకి మనసుకీ సంబంధం ఉంటుంది"

"అమ్మో! నేను డాక్టర్ని, రైటర్ని కాదు నీ భావపరంపరలు నామీద ప్రయోగం చేయకు!" భయం నటించాడు జయ.



నేను నవ్వేశాను.

అతను విస్మయంగా చూశాడు.

"ఏమైంది మున్నీ అప్పుడే బాధపడతావు. అప్పుడే నవ్వుతావు! ఇదంతా మన బాల్య కథ మహాత్మ్యమా? " అన్నాడు నవ్వుతూ.

"కావచ్చు" భారంగా అన్నాను.

"నిజమే. నాలో ఏదో అలజడి పెరిగిపోతోంది. జయ నా కళ్లలోకి సూటిగా చూశాడు. అప్రయత్నంగా నా కళ్లు వాలిపోయాయి.

"అమ్మో! నిజంగానే మా మున్నీ అలనాటి చిన్నపిల్లైపోయింది. కానీ నేను మాత్రం వానపాములా ఉండే అమాయకపు జయని కాదు!" అన్నాడు అల్లరిగా.

"నిజం! నువ్వు ఆనాటి జయవి కాదు. అదే అయితే నా మనసేంటో తెలుసుకోవాలని ప్రయత్నించవు" అనుకున్నాను మనసులో.

జయ ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వా!" అతని చేతుల్ని నా చేతుల్లోకి తీసుకుంటూ అన్నాను.

"ఉఁ" అన్నాడతను. ఎప్పటిలా మధురంగా నవ్వుతూ.

"నాకిక్కడే ఉండిపోవాలనుంది!"

"ఉండు!"

క్షణం అతని కళ్లల్లోకి చూస్తూండిపోయాను.

"ఏవిటి కొత్తగా చూస్తున్నావ్!" అన్నాడతను ఇబ్బందిగా కదులుతూ.

ఎందుకో అతని మొహంలో ఏదో చెప్పలేని ఆరాటం ఉందనిపించింది నాలాగే.

"వైదేహి ఎలా వుంది? " అన్నాను లోగొంతుతో.

"తనకేం! బ్రహ్మాండంగా వుంది!" నవ్వాడతను.

"పిల్లలెందరు? "

"ఓ బాబు, ఓ పాప"

"అదృష్టవంతుడివి!" అన్నాను భారంగా.

అతను మాట్లాడలేదు.

నా మనసులో ఎన్నో ఆలోచనలు కందిరీగల్లా ముసిరేస్తున్నాయి.

"ఓ మాటడుగుతాను. నిజం చెప్తావా? "

**సత్యాన్వేషికులకు మానసిక శాంతి అవసరం. - రమణ మహర్షి**

అన్నాను సూటిగా.

"నీతో అబద్ధం ఎప్పుడైనా చెప్పానా?" ఎదురు ప్రశ్న వేశాడతను.

"వైదేహి ఏమైనా మారిందా?"

"అంటే?"

"అంటే... అదే చిన్నప్పట్లా పెడసరంగా మాట్లాడుతోందా? లేక సౌమ్యంగా ఉండడం నేర్చుకుందా?"

నా ప్రశ్నకి అతను పకపక నవ్వేశాడు.

"ఎందుకా నవ్వు?" ఉడుక్కుంటూ అన్నాను.

"లేకపోతే ఏం ప్రశ్న మున్నీ! నువ్వు అప్పుడున్నట్టున్నావా? అసలు ఎప్పుడైనా ఇంత కుదురుగా కూర్చున్నావా! విచారం అన్నది నీ మొహంలో కనిపించేదా? అలాగే కాలంతోపాటు కొన్ని మార్పులు సహజం! తనిప్పుడు చాలా మంచిగా, అంటే అచ్చం ఉత్తమ ఇల్లాలిగా మారిపోయింది"

"నేనంటే కోపంగా వుందా?"

"నువ్వంటే తనక్కోపం ఎందుకు?" చిత్రంగా చూస్తూ అన్నాడతను.

"అదే... ఇక్కడికొచ్చి నీకు నిద్రాహారాలు లేకుండా చేస్తున్నానని!"

"నాకు నిద్రాహారాలు లేవని నేను చెప్పానా?"

"లేదు. కిరీటి చెప్పాడు. నేనిలా మూడ్‌గా తయారవడానికి కారణాలు వెతుకుతున్నావట. రాత్రింబవళ్లు పుస్తకాలు తిరిగేస్తున్నావట. నా గురించే ఆలోచిస్తున్నావట! మరి ఇదంతా ఏ భార్యకైనా ఇబ్బందిగా ఉంటుంది. దానికి వైదేహి భిన్నం కాదుగా!"

"అలాంటిదేం లేదు మున్నీ! నువ్వే ఏవేవో ఊహించుకుని బాధపడతావు. ఎదుటివారిని బాధ పెడతావు!" అన్నాడు జయ.

"మరి వైదేహి నన్ను చూడ్డానికి ఒక్కసారైనా ఎందుకు రాలేదు?" నిలదీసినట్టు అన్నాను.

క్షణం తడబడ్డాడతను.

"అదే... తనెప్పుడూ బిజీగా ఉంటుంది. అయినా నేనొస్తున్నానుగా!" అన్నాడు బలవంతంగా నవ్వుతూ.

"పోనీ నాకు మీ ఇల్లు గానీ, హాస్పిటల్ గానీ చూపించావా?"

'ఏమిటీ? నీకు హాస్పిటల్ అవీ చూడాలనుందా? అయితే నిన్ను తప్పకుండా తీసుకెళ్తాను సరే... ఈ గొడవలకేంగానీ మన బాల్యం గురించి ఏం రాశావో చెప్పు మున్నీ!" పసివాడిలా అన్నాడు జయ.

"మనందరి గురించీ!" ఉత్సాహంగా అన్నాను.

"థాంక్స్! నా కోసం చాలా శ్రమ తీసుకున్నావ్!"

"కాదు. నేను నీకు థ్యాంక్స్ చెప్పాలి. ఆర్నెల్ల తర్వాత మళ్లీ నా బుర్రకి పని కల్పించినొందుకు!" నవ్వాను.

"నువ్వే ఏదేదో ఊహించుకుంటున్నావు గానీ నీకేం కాలేదు! నువ్వు ఇంకా మంచి మంచి నవలలు ఎన్నో రాస్తావు!"

"నిన్ను చూశాకే ఆ నమ్మకం వచ్చింది. మృత్యూ: నాకు నువ్వు చిన్ననాటి నా మృత్యులాగే అనిపిస్తున్నావ్! మరుగుపడిపోయిన ఆ మధుర స్మృతులన్నింటినీ తట్టి లేపావు. మనం మళ్లీ ఆ కాలంలోకెళ్లిపోతే ఎంత బావుండు!" నన్ను నేను మరిచినట్టు అన్నాను. అతను నవ్వాడు.

"మృత్యూ!"

"చెప్పు! నా చేతిని మృదువుగా నొక్కుతూ అన్నాడతను.

"నీకు నా హృదయ వేదన చెప్పుకోవాలనుంది మృత్యూ!" పసిపిల్లలా అన్నాను.

"చెప్పు!"

"ఇప్పుడు కాదు... కిరీటి ఏ క్షణానైనా రావచ్చు నీతో ఒంటరిగా మాట్లాడాలి!"

"అలాగే! కానీ నువ్విలా డల్‌గా వుంటే నేను మాట్లాడను. మునుపటి మున్నీలా

చెదరని ధైర్యంతో, పకపక నవ్వుతూ మాట్లా డాలి!" కండిషన్ పెట్టాడు జయ.

నేను నవ్వేశాను.

"దట్స్ గుడ్. అది! మా మున్నీ అలా, పసిపాపలా నవ్వుతూ తుళ్ళుతూ ఉండాలి!" నా ముంగురులు సవరిస్తూ అన్నాడతను.

నా మనసు అదోలా అయిపోయింది. గుండెల్లో ఏదో బాధ! మనసులో చెప్పలేని ఆవేదన!

కిరీటి ఎదురుగా చెప్పలేని నిస్సహాయ స్థితీ! కిరీటికి తెలిస్తే ఏమవుతుందో అన్న ఆందోళన!

అన్నీ కలిసి నన్ను ఒణికించేశాయి. ఒక విధంగా కిరీటికి నేను ద్రోహం చేస్తున్నాన నిపించింది కూడా.

నిజం, కిరీటి నన్ను ప్రేమించినంతగా తన తల్లిదండ్రుల్ని కూడా ప్రేమించలేదు!

"ఏమిటి మున్నీ! మళ్ళీ ఆలోచనలో పడ్డావ్? " రెండు చేతులతో నన్ను కుదు పుతూ అన్నాడు జయ.

"అది కాదు మృత్యూ!... నాకు..."

నా మాట పూర్తి కానేలేదు. కిరీటి వస్తున్న అలికిడి అయింది. నా మాట పెద వులు దాటిరాలేదు.

"కిరీటి వచ్చినట్టున్నాడు!" లోగొంతుతో అన్నాను.

"అవును. నువ్వెళ్ళి రెస్ట్ తీసుకో!" అనేసి జయ మెట్లకేసి నడిచాడు.

నేను ఉసూరుమంటూ లేచి బెడ్‌రూమ్ లోకెళ్ళి మంచం మీద వాలిపోయాను.

హాల్లోంచి కిరీటి, జయ మాట్లాడుకునే మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

ఎందుకో నాగుండెలు వేగంగా కొట్టుకు న్నాయి. ఒళ్ళంతా చిరుచెమటలు పట్టాయి అంత చలిలోనూ.

'...ఎన్నాళ్ళిలా? ... ఊరు కాని ఊళ్ళో? కిరీటికి నా మీదున్న ప్రేమని అలుసుగా తీసుకుని తనని అనేక రకాలుగా బాధపెడు తున్నాను. దీన్ని దేవుడు క్షమిస్తాడా? కానీ ఏం చెయ్యను? నా మనసు నామాట వినడం లేదే!" అనుకున్నాను తపనగా.

★ ★ ★

రాత్రి పదకొండు గంటలైంది.

ఊరంతా నిశ్శబ్దంగా వుండడం వల్ల సముద్రపు హోరు మరింత ఎక్కువగా విని పిస్తోంది. వాచ్‌మన్ రామయ్య పగలంతా శ్రమపడడం వల్ల కావచ్చు పదింటికే నిద్ర పోతాడు. అసలతన్ని వాచ్‌మన్ అంటారు కానీ అక్కడ అన్ని పనులూ చేసేది అతనే!

కిరీటి ఆదమరిచి నిద్రపోతున్నాడు. కానీ నాకు మాత్రం రెప్పలు మూత పడ్డంలేదు.

ఆ రోజు జయతో మాట్లాడాక కాస్త ఉత్సాహం వచ్చిన మాట నిజమే. అందుకే సాయంత్రం అయ్యేసరికల్లా ముగ్గురం కలిసి బీచ్‌కెళ్ళడం, తడి ఇసుకతో గూళ్ళు కట్టడం, ఒడ్డున నడుస్తూ గవ్వలు, అంద మైన రాళ్ళు ఏరడం చేసే వాళ్ళం.

మా పనులు చూసి చాలా మంది ముసి ముసిగా నవ్వుకునే వారు. కొందరు వింతగా చూసేవారు. మరికొంతమంది అల్లరిమూక మమ్మల్ని చూడగానే-

"వచ్చాయి రా ఓ చిలక, రెండు గోరిం కలు!" అంటూ ఏవేవో పాటలు పాడేవారు. అన్నింటికీ నవ్వుకునే వాళ్ళం గానీ, కోపం తెచ్చుకునే వాళ్ళం కాదు, కిరీటి మాత్రం అప్పుడప్పుడు వాళ్ళకేసి కోపంగా చూసే వాడు.

"పోన్లే కిరీటీ! మనల్ని చూస్తుంటే వాళ్ళ కలా పాడాలనిపిస్తోందేమో!" అనే వాడు జయ.

"ముఖ్యంగా మనిద్దర్నీ చూసి!" గుసగు సగా జయ చెవిలో అనే దాన్ని అతను పక పక నవ్వేసేవాడు.

"పాపం! జయ ఎంత బిజీ డాక్టరు! అయినా నాకోసం తన పనులన్నీ మాను కుని గంటలు గంటలు నాతో గడుపుతు న్నాడు!" అనుకుంటే నా మనసంతా అతని

పట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయేది.

రోజురోజుకీ అతనితో ఏకాంతంగా మాట్లాడాలన్న నాకోరిక పెరిగిపోతోంది. ఆ కోరిక మూలంగానేనేమో నేను మళ్ళీ డల్‌గా అయిపోయాను. రాత్రులు నిద్రకి దూరం అయ్యాను.

ఇప్పుడు కూడా అందరూ నిద్రపోతున్నా నాకు మాత్రం నిద్ర రాలేదు.

నా పక్కనే, విశాలమైన బెడ్ మీద బ్లాంకెట్ కప్పుకుని ముడుచుకుపడుకు న్నాడు కిరీటి. చెదిరిన క్రాపు నుదుటి మీద పడి తన అందాన్ని మరింత పెంచింది.

నిన్న బీచ్‌లోని అమ్మాయిలు కొందరు కిరీటికేసి కన్నార్పకుండా చూస్తూ-

"ఓహ్! అతనెంత హేండ్‌సమ్‌గా వున్నాడు! ఇతని ముందు ఏ సినీ హీరో పనికొస్తాడు!" అని గుసగుసలాడుకోవడం నేను విన్నాను. నాకు గర్వంగా అనిపించింది.

"నిజంగా నా కిరీటి నవమన్మధుడు!" అనుకున్నాను. అమాయకంగా పడుకుని నిద్రపోతున్న తన మీద నాకు వెర్రిప్రేమ కలిగింది. మెల్లగా జుట్టు సవరించి, నుదుటి మీద సున్నితంగా ముద్దు పెట్టుకున్నాను. తర్వాత మెల్లగా మంచం మీంచి లేచి, తలుపు తీసి బాల్కనీలోకొచ్చాను.

చలిగాలి రివ్వున విసిరింది. పైటకొంగు నిండుగా కప్పుకుని అలాగే ఎగసిపడే సముద్రాన్ని చూస్తుండిపోయాను.

నిండు చందమామ తన వెన్నెలని విరజిమ్ముతూ సముద్రుడికి మరింత అందాన్ని తెచ్చిపెట్టింది.

తదేకంగా చంద్రబింబంకేసి చూస్తూ నిల్చున్నాను. ఆ బింబంలో జయ మొహం కనిపించింది చిరునవ్వులు చిందిస్తూ. నాలోని కోరిక మరింత పెరిగిపోయింది.

"ఎలాగైనా జయని కలవాలి! నా మనసంతా అతని ముందు పరచాలి. నా హృదయావేదన అతనికి నివేదించుకోవాలి. అసలు నేనేమిటో, నా మనసేమిటో అతని నోటి ద్వారా వినాలి!" అనుకున్నాను.

"కానీ ఎలా? " అంది మనసు.

నీరసంగా లోపలికొచ్చాను. తలుపులు మూసి, కిరీటిని డిస్టర్బ్ చెయ్యకుండా అతని పక్కనే పడుకున్నాను... నాలో అలజడి పెరిగిందేగానీ రెప్ప అంటుకోలేదు.

"కిరీటీ!" అన్నాను మెల్లగా.

కిరీటి గాఢనిద్రలో వుండడం వల్ల పలకలేదు.

ఆలోచించి ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చాను. "ఇదే సమయం! ఇప్పట్లో కిరీటి లేవడు. లేచినా, తను ఏ బాత్‌రూముకో వెళ్ళాననుకుంటాడు. ఈ సమయంలోనే జయని కలవాలి! కానీ ఎలా? వైదేహికి తెలిస్తే ఊరుకుంటుందా? పగలే కాకుండా రాత్రులు కూడా మా ఆయన్ని రెస్ట్ లేకుండా చేస్తున్నావే? అని తిడితే!

అది తల్చుకుంటేనే నా గుండె ఆగినంత పనయింది. నీరసంగా మంచం మీద కూలబడ్డాను.

నా మనసు తీవ్ర సంఘర్షణలో పడింది. చివరికి జయ దగ్గరికి వెళ్ళితీరాలనే నిర్ణయించుకున్నాను.

మెల్లగా లేచి షాల్ తీసి నిండుగా కప్పుకున్నాను. జయ ఇల్లు, హాస్పటలూ పక్కపక్కనే అని నాకు తెలుసు. మెల్లగా లేచి మెట్లకేసి నడిచాను.

"తప్పు చేస్తున్నానా? " అన్న భయం నా గుండె దడని పెంచింది. అయినా ఆగదల్చుకోలేదు.

తడబడుతున్న అడుగులతో మెట్లు దిగాను. కింది హాల్లో రామయ్య గుర్రుకొట్టి మరీ నిద్రపోతున్నాడు.

"థాంక్ గాడ్" అనుకుంటూ చప్పుడుకాకుండా తలుపు తీసుకుని బైటికొచ్చాను. వెన్నెల వెలుగులో, పూదోటంతా నాకేసి విస్మయంగా చూస్తున్నట్టనిపించింది.

గేటు కూడా తీసుకుని రోడ్ మీదికొచ్చాను. ఊరకుక్కలు నాలుగు గొల్లుమన్నాయి.

గుండె జల్లుమంది.

తర్వాత నన్ను నేనే తిట్టుకున్నాను. "చిన్నతనంలో తాచుపాము తోకపట్టి గిర గిర తిప్పుతూ నేలకేసి కొట్టి చంపిన యమునవేనా నువ్వు. ఊరకుక్కలు మొరిగేసరికి హడలిచస్తున్నావ్" అంటూ విసుక్కుంది మనసు.

ఎముకలు కొరికే చలిలో, ఒణుకుతున్న కాళ్ళతో, అదిరే గుండెతో ఎలాగో జయ ఇంటి దగ్గరికెళ్లాను. హాస్పిటల్లో ఎక్కడో ఒకటి రెండు లైట్లు తప్ప ఇంట్లో లైట్లు వున్నట్టు లేదు.

అవును మరి, "అర్ధరాత్రి దాటింది. హాయిగా పడుకుని తియ్యని కలలు కంటుంటారు" అనుకున్నాను భారంగా.

ఒణికే చేతులతో కాలింగ్ బెల్ ప్రెస్ చేశాను. రెస్పాన్స్ లేదు. పాపం మంచి నిద్రలో వుండివుంటారు.

క్షణం ఆగి ఏం చేయాలన్నట్టు దిక్కులు చూశాను. ఆ వీధి వీధంతా జయదే అన్నట్టు ఒకే కాంపౌండ్ వుంది. హాస్పిటల్ బోర్డుకి మాత్రం ఓ పవర్‌ఫుల్ లైటుంది.

లైట్ వెలుగులో హాస్పిటల్ బోర్డు చూసిన నేను కొయ్యబారిపోయాను.

"యమునా కార్డియాలజీ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్!" అనుంది.

"అంటే...అంటే... జయ తన హాస్పిటల్ కి నా పేరు పెట్టాడన్నమాట! ఓహ్ ఈ విషయం కిరీటి కూడా నాకు చెప్పలేదే!" అని విస్తుపోయాను. ఓ వైపు ఆనందంగా వున్నా, దీని మూలంగా జయ, వైదేహిల మధ్య ఎంత గొడవ జరిగుంటుందో వూహించుకుంటే నాకు గుండె ఆగినంత పనైంది. ఈ కోపంతోనే వైదేహి నన్ను చూడ్డానికి ఒక్కసారైనా రాలేదు.

రివ్వున చలిగాలి వీచింది. వెన్నులోంచి ఒణుకొచ్చింది. మరోసారి బెల్ ప్రెస్ చేశాను.

"ఎవరూ!" అన్న ఓ స్త్రీ గొంతు వినిపించింది.

ఆ గొంతు వైదేహిదే అనుకున్న నాకు మరింత నీరసం వచ్చేసింది. మరోసారి "ఎవరు? " అందామె.

జవాబుగా కాలింగ్ బెల్ నొక్కాను.

మేడమీద లైట్లు వెలిగాయి.

జయ గొంతు వినగానే నా ప్రాణం లేచొచ్చినట్టయింది.

"నేను మృత్యూ!" అన్నాను గట్టిగా. కానీ నా గొంతు గొణిగినట్టు నాకే తెలిసిపోయింది.

జయ కదల్లేదు. ఎవరా అన్నట్టు క్షణం నిల్చుండిపోయాడు. నా గొంతు అతనికి వినిపించలేదని అర్థమైన నేను ఈ సారి మరింత పెద్దగా అన్నాను.

"నేనే మృత్యూ! ఓ సారి లోపలికి రావచ్చా" అని.

అంతే ఒక్క అంగలో మెట్లు దిగి నన్ను చూసి నిర్ఘాంతపోయాడతను.

"మైగాడ్! ఇంత అర్ధరాత్రి! ఇంత చలిలో... ఇలా వచ్చావా? కిరీటి ఏడీ? " అన్నాడు గేటు తీస్తూ.

"కిరీటి రాలేదు. నీతో ఒంటరిగా మాట్లాడాలని నేనే వచ్చాను!" అన్నాను నిలువెల్లా ఒణికిపోతూ.

"ఎంత పని చేశావు మున్నీ!... ఇప్పుడు నువ్వు కనిపించకపోతే కిరీటి ఎంత కంగారు పడతాడు? పద! నిన్నక్కడ దించొస్తాను!" అన్నాడతను నా చెయ్యి పట్టుకుంటూ.

"ఉహూ! ఇవాళ ఏమైనాసరే... నీతో మాట్లాడాలి. నా బాధ నీకు చెప్పుకోవాలి! ప్లీజ్!..." అన్నాను.

భగవంతుడూ, భయమూ ఒక చోట నివసించవు. – విల్‌రోగెర్స్

"అలాగే! రా" అంటూ నన్ను పొదివి పట్టుకుని లోపలికి తీసికెళ్లాడు. కింది పోర్షన్‌లోనే వున్న ఓ గదిలోకి తీసికెళ్లి మంచం మీద కూర్చోపెడుతూ-

"ఇది నా పర్సనల్ రూమ్! ఇక్కడికి ఎవరూ రారు. మనం హాయిగా మాట్లాడుకోవచ్చు" అన్నాడు జయ.

నేను గదంతా కలయచూశాను. అది మామూలు గదిలా లేదు. అతని కళాహృదయానికి ప్రతిరూపంలా వుంది.

"బావుంది మృత్యూ!' అన్నాను అభినందనగా చూస్తూ.

"ఏవిటి? "

"ఈ గదీ, దీని అలంకరణ!"

"నీకు నచ్చిందా? " అన్నాడు నా చేతిని మృదువుగా నొక్కుతూ.

"చాలా!... అసలు నువ్వు దగ్గరుంటేనే నాకు లోకం తెలియదు!" అదోలాంటి తన్మయత్వంతో అన్నాను.

అతను నవ్వాడు మధురాతిమధురంగా

"నువ్వంత హాయిగా ఎలా నవ్వుతున్నావు మృత్యూ!" అన్నాను.

"మృత్యువును కాబట్టి!" మళ్ళీ నవ్వాడు జయ.

ఛ! మృత్యువు నవ్వు కాదు నీది!... ఆ అల్లరి కృష్ణుని చిలిపి నవ్వు: మైమరపించే నవ్వు... నీలా నవ్వగలగడం ఓ గొప్ప వరం!" అన్నాను మనస్ఫూర్తిగా.

"మున్నీ, నన్ను మరీ ములగ చెట్టు ఎక్కించేస్తున్నావ్. పడితే ఇంక ఇంతే సంగతులు!"

"నేను వున్న మాట చెప్పాను!"

"సరే తల్లీ.. ఇంతకీ నువ్వు..."

"నేను నేనే" నీరసంగా నవ్వాను. అతని మాటలు పూర్తి కాకుండానే.

"ఇదిగో. నువ్వు చాలా వీగ్గ వున్నావ్, రెస్ట్ తీసుకో" అన్నాడు జయ అనునయంగా.

"ఇప్పుడు రెస్ట్ కాకేమిటి. కానీ పాపం! నీకే రెస్ట్ లేదు. నీ పేషెంట్స్ బాధ చాలదని నేను కూడా నిన్ను ఇబ్బంది పెడుతున్నాను!" అన్నాను బాధగా.

జయ మొహం గంభీరంగా అయిపోయింది.

"మున్నీ, నీ మాటలు వింటుంటే పరాయివాడినని అనిపిస్తోంది. లేకపోతే నన్ను నువ్వు ఇబ్బంది పెట్టడం ఏమిటి! చెప్పు. నేన్నీకు ఆత్మీయుళ్ళా కనపడడంలేదా? " అన్నాడు సీరియస్‌గా.

"ఛ! ఛ! అదిగాదు" అతని మొహం చూసి కంగారు పడిపోయాను.

"చూడు మున్నీ! నా సాన్నిధ్యం నీకెలా వుందో, నీ సాన్నిధ్యం కూడా నాకు అలాగే వుంటుందని ఎందుకనుకోవు? " నిష్ఠూరంగా అన్నాడు జయ. నా కళ్ళు తళుక్కుమన్నాయి. ఏదో చెప్పబోతే వారించి-

"పార్వతమ్మా!" అని పిల్చాడు జయ.

వెంటనే ఓ వృద్ధురాలు వచ్చి-

"ఏమిటయ్యా? " అంది వినయంగా

"గ్లాసునిండా హార్లిక్స్ కలిపి తీసుకురా!"

"అలాగేనయ్యా!" అంటూ వెళ్ళిపోయిందామె. బహుశా ఆమే కావచ్చు ఇందాక ఎవరూ? అన్నది.

పది నిమిషాల్లో వేడి వేడి హార్లిక్స్ తీసుకొచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోయింది పార్వతమ్మ.

నామెడ చుట్టూ చేతులు వేసి, పసిపిల్లకి తాగించినట్టు ఆ హార్లిక్స్ నాచేత తాగించాడు జయ.

ఆనందంతో నా ఒళ్ళు పులకించింది.

"జయకి నేనంటే ఎంత ప్రేమ!" అనుకున్నాను.

"చెప్పు మున్నీ! నాతో ఏం మాట్లాడదామనుకున్నావ్? " అన్నాడు నా రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకుంటూ.

"నా హృదయావేదన గురించి!"

"చెప్పు!" అన్నాడతను నా తలవైపు కూర్చుని నా తలని తన భుజంమీద పెట్టు

కుంటూ.

నాకు దుఃఖం వచ్చేస్తోంది.

"నా గురించి నీ మనసులో వున్నది చెప్పు!" అన్నాను దుఃఖాన్ని ఆపుకుంటూ. అతను నవ్వాడు.

"అల్లరి, అమాయకపు నా ప్రియనేస్తం మున్నీవని!" అన్నాడు నా చేతుల్ని వదల కుండానే.

"అంతేనా? "

"అంటే? "

"అంటే నా గురించి నువ్వు ఇంకేం అను కోవడంలేదా? " అదురుతున్న గుండెతో అన్నాను.

అతను మాట్లాడలేదు.

"నేనంటే నీకిష్టం అనేవాడివి! కదూ? " అన్నాను మళ్ళీ నేనే.

"అవన్నీ తర్వాత తీరిగ్గా మాట్లాడు కుందాం. చాలా పొద్దు పోయింది. పడుకో మున్నీ!" అనునయంగా అన్నాడు జయ.

"ఉఁహూఁ! ఇప్పుడే మాట్లాడాలి! మళ్ళీ ఈ అవకాశం రాకపోవచ్చు! అందుకే థాంక్స్ చెప్తున్నాను!"

"థాంక్సా? ఎందుకు!" కళ్ళు చిట్లించాడు జయ.

"నీ హాస్పిటల్ పేరు..."

"ఓ! అదా? ఇందులో థాంక్స్ చెప్పడాని కేంవుంది. నాకిష్టమైన వాళ్ళ పేరే పెట్టుకు న్నాను!" నా మాట పూర్తికాకుండానే అన్నాడు జయ.

"నేనంటే నీకిష్టం అని తెలుసుగానీ, మరీ ఇంత ఇష్టం అని తెలియదు!" అతని చేతు లతో నా మొహాన్ని కప్పుకుంటూ అన్నాను.

"మున్నీ! ఇంక పడుకుంటావా, బలవం తంగా పడుకోపెట్టమంటావా? " కోపం నటించాడతను.

"ఉహూ! నా హృదయ భారం తీరేదాకా నేను పడుకోను! చెప్పు! నా గురించి

నామాట పూర్తికానే లేదు. మరోసారి కాలింగ్‌బెల్ మోగింది.

అంతే నాగుండె ఆగి, తిరిగి రెట్టించిన వేగంతో కొట్టుకోసాగింది.

"జయా! కిరీటేమో!" అన్నాను అతన్ని గట్టిగా పట్టుకుంటూ

"చూసొస్తానుండు!"

"ఉఁహూఁ! వచ్చింది కచ్చితంగా కిరీటే అయ్యుంటాడు. నేను లేనని చెప్పెయ్యి!" అన్నాను ఆదుర్దాగా.

"నీకు మతిపోయింది!" విసుక్కున్నాడు జయ.

"నువ్వేమన్నా సరే! నేనీరాత్రి ఇక్కడే వుంటాను. కిరీటైతే పంపెయ్యి!" మొండిగా అన్నాను.

"సరే! నువ్వు పడుకో!" అంటూ నన్ను పడుకోబెట్టి, నిండుగా బ్లాంకెట్ కప్పి మెల్లగా బైటికి నడిచాడు జయ.

అయితే వచ్చింది కిరీటి కాదు. కానీ మరో పేషెంటు. అతన్ని చూసే పన్లోపడి పోయాడు కిరీటి.

నా మనసు కాస్త కుదుట పడింది.

"ఇప్పుడు నేనిక్కడున్నట్టు వైదేహికి తెలిస్తే? " అన్న ఆలోచన వచ్చి సన్నగా నవ్వుకున్నాను.

హాస్పిటల్ పేరే నా పేరు పెట్టినప్పుడు ఏం చెయ్యలేని మనిషి ఇప్పుడు నాతో మాట్లాడితే ఏం చెయ్యగలదు? అనుకుంటే నాకెంతో గర్వంగా అనిపించింది. అంతే కాదు. "పాపం! వైదేహి!" అని కూడా అని పించింది.

నాలో నేను నవ్వుకోవడం గమనించిం దేమో-

"ఏమిటమ్మా! మీలో మీరే నవ్వుకుంటు న్నారు? " అంది పార్వతమ్మ. క్షణం తెల్ల బోయి తేరుకుని,

"వైదేహి, జయా... అదే... మీ డాక్టరూ సఖ్యతగానే వుంటారా? " అన్నాను. వైదేహిని జయ సరిగ్గా చూడ్డంలేదేమో అన్న కొత్త బెంగ నా మనసులో చోటు చేసుకుంది.

"వైదేహి! ఆవిడెవరు!" అంది పార్వతమ్మ ఆశ్చర్యంగా చూస్తూ.

"అదే... మీ డాక్టరు గారి భార్య. ఆవిణ్ని ఇతను వేరే పేరు పెట్టి పిలుస్తాడేమోగానీ, ఆమె అసలు పేరు వైదేహే!!" అన్నాను నవ్వుతూ.

ఈసారి ఆమె నవ్వింది.

"ఏంటమ్మా! జోక్స్ వెయ్యడానికి నేనే దొరికానా? వైదేహేంటి. డాక్టర్ గారి భార్యేంటి? " అంది అదోలా...

నేను తుళ్ళిపడ్డాను.

అయితే. ఆ వైదేహిని జయ పెళ్ళి చేసుకోలేదా? ఒకవేళ చేసుకుని విడిపోయారా?

మళ్ళీ నా గుండె ఆగినంత పనైంది.

"వీళ్ళు హాస్పిటల్‌కి నా పేరు పెట్టడం వల్ల విడిపోలేదు కదా!"

"అయితే ఆయన భార్య ఇక్కడ లేదా? మరి పిల్లలు? " అన్నాను. ఏం వినాల్సొస్తుందో అన్నట్టు.

"భార్యేంటి, పిల్లలేంటి! అసలు మా డాక్టరు గారికి పెళ్ళే కానిదే!"

"ఏమిటి? " తృళ్ళిపడ్డాను.

"అవునమ్మా! మా బాబుగారు పెళ్ళి చేసుకొనే లేదు. ఎప్పుడో చిన్నప్పుడూ ఓ అమ్మాయిని ప్రేమించారట. ఆమె ఈయన్ని కాదని వేరే అతన్ని చేసుకుందట. ఇంక మా డాక్టరు గారు పెళ్ళి జోలికి పోకుండా ప్రజాసేవే ధ్యేయంగా పెట్టుకున్నారు. దిక్కులేని నన్ను, మా ఆయన్ని తన దగ్గరే వుంచుకుని ప్రాణంలా చూసుకుంటున్నారు!' ' కళ్ళు తుడుచుకుంటూ అంది పార్వతమ్మ

నాకూ స్పృహ తప్పుతున్నట్టయింది.

"అంటే... జయ... తనలాకాకుండా... నిజంగానే నన్ను ప్రేమించాడన్నమాట!" చిన్ననాటి మాటలు గుర్తొచ్చి నిలువెల్లా ఒణికిపోయాను.

ఇంతలో జయ రానే వచ్చాడు.

అతన్ని చూస్తుంటే కొత్తగా అనిపించింది.

"ఏవిటలా చూస్తున్నావ్!" అన్నాడు చెదరని చిరునవ్వుతో.

"నా చిన్నారి మృత్యుని!"

"'చిన్నారి' అన్నమాట ఒక్క మున్నీకే కేటాయించాం. ఇంకేదైనా చెప్పు"

"వానపాము!" నవ్వాను.

"కానీ నేనిప్పుడు వానపాములా లేను!" పసివాడిలా అలిగాడు జయ.

"మరి! జెర్రిపోతులా ఉన్నావా? '

"ఊహుఁ! కొండచిలువలా!"

"ఛ జయ ఎప్పుడూ కొండ చిలువలా ఉండడు" నేనూ నవ్వాను.

నాకు ఏదేదో మాట్లాడాలని ఉంది. కానీ మాటరావడం లేదు. అలాగే అతని మొహంలోకి చూస్తూ పడుకున్నాను.

"ఎలా ఉంది!', అన్నాడు జయ నా చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ.

"హాయిగా ఉంది!"

"ఏమిటి!"

"నువ్వు పక్కనుంటే నాకెంతో ధైర్యంగా ఉంది. మృత్యూ!" నీ స్పర్శే నాకు కొండంత శక్తినిస్తోంది!" మనసులోని మాట నిస్సంకోచంగా చెప్పేశాను.

"మరి అలా డల్‌గా ఉన్నావేం? "

"చెప్తాను. ఇంతకీ వచ్చింది ఎవరు? " అన్నాను అనుమానంగా. దానికతను మాట్లాడలేదు.

"ఇంకేమైనా కావాలా బాబుగారు? " అంది పార్వతమ్మ. అతనేదో మెల్లగా చెప్పాడు. తర్వాత నాకేసి చూస్తూ-

"మున్నీ, రాత్రి భోంచేశావా? " అన్నాడు

"ఉఁ! కానీ సహించలేదు" పసిపిల్ల తల్లితో అన్నట్టు అన్నాను.

"ఇప్పుడేమైనా తింటావా? "

"ఊహుఁ!"

"అయితే పడుకుని నిద్రపో!"

"అమ్మో... కిరీటి..." భయంగా అన్నాను. పార్వతమ్మకేసి వెళ్ళమన్నట్టు చూశాడు జయ. పార్వతమ్మ వెళ్ళిపోయింది.



"కిరీటి కాదులే కంగారు పడకు!" నా తల దగ్గర కూర్చుని నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు జయ.

"జయా! నాకోరిక ఒకటి తీరుస్తావా? " అతని చేతిని గుండెలకానించుకుంటూ అన్నాను.

"తప్పకుండా!... చెప్పు! ఏం కావాలి!" అన్నాడు మృదువుగా.

"వైదేహి! వైదేహిని ఓసారి చూపించవూ? " అన్నాను.

"తనిక్కడెందుకుంటుంది? భర్త, పిల్లలతో బ్రిటన్‌లో ఉంది!" నవ్వాడతను.

"అంటే నువ్వు... పెళ్ళి చేసుకోలేదన్నమాట! ఈ పాపం నాదే కదూ!" నాకు ఏడుపొచ్చేసింది.

"ఛ! ఛ! అదేం కాదు. నాకు పెళ్ళి చేసుకోవాలనిపించలేదు. చేసుకుంటే నేననుకున్న ప్రజాసేవ చెయ్యలేను కదా!" అంటూ లేచాడు.

"ఎక్కడికి!" అతని చెయ్యి వదలకుండానే అన్నాను.

"ఓ పేషెంట్ పరిస్థితి బాగాలేదు. వెళ్ళి చూడాలి!"

"ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పి వెళ్ళు!"

"తొందరగా చెప్పు!" అసహనంగా కూర్చున్నాడతను.

నా హృదయ భారాన్ని గురించి, నా అనుమానాల గురించీ అతని ముందుంచాను. క్షణం అతని మొహం వెలవెలపోయింది. తర్వాత తన సహజ ధోరణిలో నవ్వేస్తూ-

"పిచ్చిపిచ్చి అనుమానాలు పెట్టుకోకు. నీకు నేనున్నాను!" అన్నాడు నమ్మకంగా. నాక్కాస్త ధైర్యం వచ్చింది.

"ఏమో మృత్యు! నా హృదయాన్ని నీ చేతుల్లో పెడుతున్నాను. దాన్నెలా చూసుకుంటావో!" అన్నాను అతని పొదివి పట్టుకుంటూ.

"పదిలంగా చూసుకుంటాను. సరేనా? ఇంక హాయిగా పడుకో!" అంటూ బలవంతంగా నన్ను పడుకోబెట్టి బైటికెళ్ళిపో

యాడు. ఎందుకో అతని మొహంలో అంతులేని ఆదుర్దా కనిపిస్తోంది.

"పాపం బైట పేషెంటేమై ఉందో!" అనుకుంటూ కళ్ళుమూసుకున్నాను. కానీ హఠాత్తుగా కిరీటి గొంతు వినిపించి తుళ్ళిపడి కళ్ళు తెరిచాను. నా గుండెల్లో మళ్ళీ ఏదో అలజడి!

మెల్లగా లేచాను. కాళ్ళు తడబడుతున్నాయి. ఒళ్ళు తూలిపోతోంది. కళ్ళు బైర్లు కమ్ముతున్నట్టున్నాయి. అయినా అతి ప్రయాసగా హాల్లోకొచ్చాను.

వచ్చింది కిరీటే!

జయ కిరీటికి ఏం చెప్పాడో అన్న కుతూహలంతో పక్కగా ఉన్న స్టూల్ మీద కూలబడ్డాను. వాళ్ళకి నేను కనిపించడం లేదు గానీ, వాళ్ళు నాకు కనిపిస్తున్నారు. మాటలూ వినిపిస్తున్నాయి.

"కిరీటీ! వచ్చావా? నీకోసమే వస్తున్నాను. మున్నీ ఇక్కడికొచ్చింది!" కిరీటిని వరండాలోకి తీసుకొస్తూ అన్నాడు జయ.

"థాంక్ గాడ్! ఏమైపోయిందో అని హడలిపోయాను. ఇప్పుడేం చేస్తోంది? " గొంతు తగ్గించి మరీ అన్నాడు కిరీటి.

"పడుకుంది. అన్నట్టు డాడీవాళ్ళు బయల్దేరారుగా!"

"ఆ. న్యూయార్క్‌లో నిన్నే ఫ్లైయిట్ ఎక్కేశారట. బాంబేలో దిగి ఫోన్ చేశారు. డాడీ, మమ్మీ, పెద్దనాన్న, పెద్దమ్మా పిల్లలూ అంతా వస్తున్నారట! తెల్లారేసరికి వచ్చేస్తారు."

"తెల్లారేసరికా? " తడారిపోతున్న గొంతుతో అన్నాడు జయ.

"ఏమిటీ? అమెరికానించి అందరూ వస్తున్నారా? ' నా గుండె వేగంగా కొట్టుకుంది.

"అవునంకుల్! నాలుగైదురోజుల కిందటే రావాల్సింది. టికెట్స్ కన్‌ఫామ్ అవలేదట. అయినా మీరేం వర్రీ అవకండి! ఆపరేషన్ మధ్యాహ్నం కదా. అప్పటికల్లా వచ్చేస్తారు!" అన్నాడు కిరీటి.

"లేదు కిరీటీ! మున్నీకి ఆపరేషన్ చెయ్యడంలేదు!"

"అంకుల్!"

"అవును కిరీటీ! మున్నీ గుండె ఆపరేషన్ స్థితి దాటిపోయింది! ఇప్పుడామె గుండె గాలి బుడగలా ఉంది. అది ఏ క్షణంలోనైనా పేలిపోవచ్చు" దుఃఖం నిండిన గొంతుతో అన్నాడు జయ.

నా గుండె నిజంగానే ఆగినట్టయింది.

"ఏమిటి! నా గుండె అంత బలహీనంగా ఉందా? అమెరికానించి నా కొడుకులూ వాళ్ళూ వస్తున్నారా? అంటే... అంటే... నా పరిస్థితి!...." నా ఒళ్ళంతా చెమటలు పట్టేసింది. కళ్ళు తిరిగిపోతున్నాయి.

"అంకుల్!" అరిచినట్టు అన్నాడు.

నేను తుళ్ళిపడ్డాను.

"అంకుల్! అంత మాటనవద్దు! ఎలాగైనా మా బామ్మని మీరే బతికించాలి. ఎన్నోఊళ్ళు తిప్పాను. ఎంతోమంది డాక్టర్లకి చూపించాను. అందరూ పెదవి విరిచారే గానీ ఎవరూ ధైర్యం చెప్పలేదు అయినా ఈ విషయం మా బామ్మకి తెలియనియ్యకుండా. అంతా నార్మల్! అన్నీ నార్మల్! యు ఆర్ క్వయిట్ నార్మల్!" అంటూ ఆవిణ్ని దారుణంగా మోసం చేశాను. చివరికి మీ గురించి తెలిసి ఇక్కడికొచ్చాను. అదృష్టవశాత్తూ మీరు బామ్మ చిన్ననాటి స్నేహితులని తెలిసి మురిసిపోయాను. నా కోరిక మేరకు మీరూ నిజాన్ని దాచి ఆమెని సంతోషంగా ఉంచాలని ప్రయత్నించారు. మీ మాటలు నాకు కొండంత బలాన్నిచ్చాయి. మా బామ్మ తిరిగి నాకు దక్కుతుందనుకుని కొండంత ఆశతో ఉన్నాను. ఇప్పుడు మీరిలా..." కిరీటికి దుఃఖం ఆగడంలేదు.

జయ కంగారు పడిపోయాడు.

"ఏయ్! ఏవిటిది? పసివాడిలా? నీ ధోరణి చూస్తుంటే అసలు విషయం

మున్నీకి తెలిసిపోయేలా చేస్తున్నట్టుందే! ఆవిడ ఎంతసేపు బతుకుతుందో చెప్పలేం. బతికున్న కొద్దికాలమైనా నిశ్చింతగా, నిర్భయంగా బతకనీ! ఈ విషయం పొరపాటున కూడా మున్నీకి తెలియనియ్యకు! అసలు, తనొచ్చిందే తన పరిస్థితి తెలుసుకోవడానికి. ఈ ప్రయత్నం ఎప్పట్నించో చేస్తోందని నాకు తెలుసు. అయినా తెలియనట్టు నటించి తప్పించుకుంటున్నాను. ఆమెని సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తున్నాను. నువ్విప్పుడు అరిచి, ఏడ్చి అసలు విషయం ఆవిడకి తెలియనీకు! ప్లీజ్!" చాలా మెల్లగా అన్నాడు జయ.

కిరీటి మొహం వెలవెలపోయింది. దుఃఖం వెల్లువలా ఉబికి వస్తోంది.

'అంకుల్! మా బామ్మంటే నాకు ప్రాణం! మా తాతయ్య హఠాత్తుగా పోయేసరికి పిచ్చిదానిలా అయిపోయిన బామ్మ నేను పుట్టాక మనుషుల్లో పడి తన భర్తే మళ్లీ మనవడిగా పుట్టాడని మురిసిపోతూ తాతయ్య పేరు నాకు పెట్టుకుని నన్ను ప్రాణంగా చూసుకుంటోంది.

నాన్న, పెద్దనాన్న అమెరికాలో స్థిరపడిపోయినా బామ్మ అక్కడుండలేక ఇండియాలో ఒంటరిగా, దిక్కులేని దానిలా ఉండటం నేను సహించలేకపోయాను. అందుకే... అమెరికా వదిలి బామ్మే లోకంగా బతుకుతూ ఆవిడ దగ్గరే ఉండి చదువుకుంటున్నాను. ఒక్క గంట ఆలస్యంగా వస్తే వీధి గుమ్మంలో నిల్చుని ఆతృతగా చూస్తుంది. తను కాస్సేపు కనిపించకపోయినా నాకు పిచ్చెక్కినట్టుంటుంది. ఎలాగైనా బామ్మని బతికించండి! అయ్ కాంట్ లివ్ వితౌట్ మై గ్రానీ!" జయ రెండు కాళ్లూ పట్టుకుని దయనీయంగా ఏడుస్తున్నాడు. నా బంగారు తండ్రి, నా ముద్దుల మనవడు అయిన కిరీటి.

నా స్థితేమిటో జయ నాతో చెప్పకపోయినా తెలిసిపోయింది. నేను నీరసంగా వెనక్కి వాలి కళ్లు మూసుకున్నాను.

"కంట్రోల్ యువర్ సెల్ఫ్ మై బాయ్! మున్నీ నీకు బామ్మైతే నాకు చిన్ననాటి ప్రియనేస్తం. ఏమాత్రం అవకాశం ఉన్నా ఆవిడ్ని కాపాడుకోవడానికి ప్రయత్నించనా? నాలో శక్తి ఉడిగిపోయినా, నాకు తెలిసిన మంచి సర్జన్లని ఎందుకు ఏర్పాటుచేశాను! ఆవిణ్ణి బతికించుకోవాలనే కదా!" కిరీటిని లేపేసి అక్కున చేర్చుకున్నాడు జయ.

"అంటే .... బామ్మకి ఆపరేషన్ చేయడానికి వీల్లేదా!" దీనంగా అన్నాడు కిరీటి.

"లేదు! ఇప్పుడావిడ వయసెంతో తెలుసా? ఎనభై అయిదేళ్లు. అయినా పిచ్చి ఆశతో ఆపరేషన్‌కి ఏర్పాటుచేశాను. కానీ ప్రస్తుత పరిస్థితి చాలా దారుణంగా ఉంది. తెల్లవారడం కూడా కష్టమే! ఏ క్షణాన్నైనా ఆమె గుండె ఆగిపోవచ్చు! ఇప్పుడు నువ్వు కోరుకోవాల్సిందల్లా మీ వాళ్లు వచ్చేవరకైనా ఆమె హృదయ చలనం ఆగిపోకూడదని. అదే ఆ దైవాన్ని వేడుకో... " గద్గద స్వరంతో అన్నాడు జయ.

కిరీటి పైకి వినిపించకుండా మళ్లీ మళ్లీ ఏడుస్తున్నాడు. ఎలాగూ బతికించలేం. కనీసం నిశ్చింతగా అయినా పోనిద్దాం. ఆమె ఎదుట కన్నీరు పెట్టకు! నేనామెను పరీక్షిస్తూనే ఉన్నాను!" అంటూ ఓదార్చాడు జయ.

"మైగాడ్! రాయిలా ఉండే నా గుండె నీటి బుడగలా అయిపోయిందా? అది ఏ క్షణాన్నైనా పేలిపోవచ్చా" తల్చుకుంటేనే గుండె ఆగినట్టుంది.

వాళ్ల మాటలు మరింత మెల్లగా ఉండి వినిపించడం మానేశాయి. నేను మెల్లగా లేచాను. కళ్లు తిరిగాయి. కాళ్లు తడబడ్డాయి. అలాగే గోడనాసరా చేసుకుని గదిలోకొచ్చి మంచంమీద పడుకుని ఎప్పటిలా బ్లాంకెట్ కప్పుకుని కళ్లు మూసుకున్నాను.

**సత్యం తెలుసుకున్నవాడు మౌని అవుతాడు. - ఎమర్సన్**

నా కళ్లముందు నా కొడుకులు, కోడళ్లు, మనమలు, మనుమరాళ్లు సినిమా రీళ్లలా కనిపిస్తున్నారు.

నాకు దుఃఖం వచ్చేస్తోంది. ఇంతలో జయ, కిరీటి నా దగ్గరికొచ్చారు. వాళ్లు వస్తున్నారని గమనించగానే నేను గభాల్ని కళ్లు మూసుకున్నాను.

"మున్నీ!" మృదువుగా తట్టి పిల్చాడు జయ నా చెయ్యి పట్టుకుంటూ. అప్పుడు గానీ అర్థం కాలేదతను నా చెయ్యి పదే పదే పట్టుకునేది నా పల్స్ చూడ్డానికని.

"ఊఁ!" అన్నాను. మాట్లాడితే దుఃఖం ఎక్కడ తన్నుకొస్తుందో అన్నట్టు.

"కిరీటి వచ్చాడు"!

"ఊఁ!" కళ్లు తెరవకుండానే అన్నాడు.

"బామ్మా!" మామూలుగా ఉండడానికి అతి ప్రయాసగా నటిస్తూ అన్నాడు కిరీటి.

నేను కళ్లు తెరిచాను.

"ఏమిటి బామ్మా! అలా చెప్పకుండా వచ్చేశావ్! నువ్వు కనిపించక నేనెంత కంగారు పడ్డానో తెలుసా?" నా జుట్టు సవరిస్తూ అన్నాడు కిరీటి. నేను నవ్వాను.

"కంగారెందుకురా! వుంటే అక్కడుంటాను. లేకపోతే ఇక్కడుంటాను." అంటూ నవ్వాను.

"నీ కలాగే వుంటుంది! అసలు నిన్ను ఇంత రాత్రప్పుడు అంత చలిలో ఎవరిక్కడికి రమ్మన్నారు. నీ కోసం ప్రాణం పెట్టేనొకణ్ని వున్నానన్న సంగతే మర్చిపోయావ్!" అలిగినట్టు అన్నాడు కిరీటి.

"సారీ నాన్నా! నీతో చెప్పకుండా రావడం నా తప్పే అని ఒప్పుకుంటున్నాను. ఇప్పుడు వెళ్దామా" అన్నాను ప్రశాంతంగా.

"ఇప్పుడా? ఒద్దులే. తెల్లారాక వెళ్దాం" అన్నాడు కిరీటి.

"అవును మున్నీ! ఇప్పటికి రెస్ట్ తీసుకో!" అన్నాడు జయ కూడా.

"కానీ ఓ కార్యం మిగిలిపోయిందే!" నవ్వుతూ అన్నాను.

"ఏమిటీ అంత రాచకార్యం!" నవ్వాలనుకున్నా జయకి నవ్వు రావడంలేదు. సదా చిరునవ్వులు చిందించే పెదవులు పేలవంగా మారిపోవడానికి కారణం నాకు తెలుసు.

"రాచకార్యమే. నీ కానుక నీకందచెయ్యాలి"

"దానికింత తొందరేమిటి?"

"తొందరేమరి! ఏ టైమ్‌కా పని చెయ్యకపోతే అవింక అలాగే మిగిలిపోతాయి".

"బామ్మా! ఇంక మాట్లాడకుండా పడుకోమని అంకుల్ చెప్పారా?" కోపం నటించాడు కిరీటి.

"అలాగే పడుకుంటాను. నా బాధ్యత పూర్తికానీ" అన్నాను నీరసంగా నవ్వుతూ.

నాకు మళ్లీ ఆయాసం మొదలైంది. వాళ్ల మాటలు ఇంక విననని అనుకున్నారేమో నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు కిరీటి, జయా కూడా.

"మృత్యుంజయా! కోపం వచ్చిందా?" అల్లరిగా అన్నాను.

"కోపం ఎందుకు? నీ ధోరణి నీదేగానీ ఎప్పుడు నా మాట విన్నావు గనక!" అన్నాడు జయ నిష్ఠూరంగా.

"ఇంక నువ్వేం చెప్పినా వింటాను. నీ వస్తువు నీకు చేర్చాక" అని కిరీటికేసి చూస్తూ.

"కిరీటీ ఓ పనిచేస్తావా?" అన్నాను ఆయాసపడుతూ.

"చెప్పుబామ్మా!" గభాల్న అన్నాడు కిరీటి.

"టేబిల్‌మీద నేను రాసిన మా బాల్య కథ ఫైల్ వుంది. కాస్త తెస్తావా?"

"అలాగే బామ్మా!" అంటూ పరిగెత్తాడు కిరీటి.

జయ నాకళ్ళల్లోకి చూస్తున్నాడు.

"ఏమిటి మృత్యూ!... కలువ రేకులంత విశాలంగా వుండి, కాంతులు చిమ్మే కళ్ళు గుంటలు పడిపోయి గాజుగోళాల్లా వున్నాయేమిటని చూస్తున్నావా? సుకుమారంగా వుండే చెంపలూ, గులాబీరేకుల్లా వుండే

పెదవులూ ముడతలు పడి అసహ్యంగా వున్నాయని చూస్తున్నావా? తుమ్మెదరెక్కల్లాంటి బారెడు జడ... పల్చని తెల్లని పీచు పరుచుకున్నట్టుందేమని ఆశ్చర్యపోతున్నావా? గుమ్మటంలా వుండే మున్నీ ఎముకల పోగైపోయిందేమిటని బాధపడుతున్నావా? ” అన్నాను అతి ప్రయాసగా మాట్లాడుతూ.

జయకి దుఃఖం వచ్చేసింది. అయినా తమాయించుకుని “మున్నీ లాగే కనిపిస్తున్నావు. కనిపిస్తావు! ఇంక నువ్వు ఎక్కువగా మాట్లాడకు” అన్నాడు అనునయంగా.

“మృత్యూ!” అన్నాను వచ్చే దగ్గుతెర నాపుకుంటూ.

“చెప్పుమున్నీ!” నా గుండెలు రాస్తూ అన్నాడు జయ. “నా హృదయాన్ని పదిలంగా చూసుకుంటానని మాట ఇచ్చావ్!”

“ఇప్పుడు మాత్రం కాదన్నానా? ” మనసులో ఏడుస్తూనే నవ్వుతూ అన్నాడు జయ.

నేను నవ్వాను.

“నాకంతా తెలుసు మృత్యూ! నా పరిస్థితి ఏమిటో నీనోటి నించే విన్నాను!”

“మున్నీ!”

“అవును మృత్యూ! నేనడిగినా చెప్పని విషయాలు నువ్వు కిరీటితో చెప్పడం విన్నాను. చూడు మృత్యూ! నాకు చచ్చిపోతానన్న భయం లేదు. ఇంకా బతికి, పిచ్చినాన్న కిరీటిని వాళ్ళ తల్లిదండ్రులకి దూరంగా వుంచాలనీ లేదు. కానీ ఒక్క కోరిక మాత్రం నాకు బలంగా వుంది మృత్యూ!” దీనంగా అన్నాను.

“ఏవిటి మున్నీ! చెప్పు!” ఒకలాంటి ఉద్వేగంగా అన్నాడు జయ.

“నేను బతకాలి!”

“మున్నీ!”

“అవును మృత్యూ! నేను బతకాలి! రేప్పొద్దున వరకూ నా గుండెని ఆగకుండా చేసే బాధ్యత నీదే! ఎందుకంటే చివరిసారిగా నేను నా బిడ్డల్ని చూడాలి. వాళ్ళూ నేను బతికుండగా నన్ను చూసుకోవాలి!... నన్ను బతికించవూ? ” అతి ప్రయాసగా చేతులెత్తి జోడించాను.

అంతే! అంతవరకూ అతిప్రయాసగా ఆపుకున్న దుఃఖం వెల్లువలా ఉబికింది.



### నమ్మకం

ప్రఖ్యాత క్రికెట్ క్రీడాకారుడు పటౌడీ ఆడుతున్న మ్యాచ్ అది. అంతలోనే ఆయనకు ఇంటి నుంచి ఫోన్ వచ్చింది.

పటౌడీ అసిస్టెంట్ ఫోన్‌తీశాడు. 'సార్ ఇప్పుడే బ్యాటింగ్‌కు వెళ్లారు మేడమ్. కాసేపాగి ఫోన్‌చేస్తారా? లేక ఆయన వచ్చాక నన్ను ఫోన్‌ఇంటికి చేయించమంటారా? ' అన్నాడతను వినయంగా.

'పర్లేదు. లైన్‌లోనే ఉంటా.. ఆయనకు వికెట్ల వద్ద ఎక్కువసేపు ఉండే అలవాటులేదులే..' అంది పటౌడీభార్య షర్మిలాఠాగూర్ చాలా నమ్మకంగా.

"మున్నీ!" అంటూ ఎండి ఎముకలగూడులా వున్న నా గుండెలమీద వాలిపోయాడు జయ.

ఇద్దరం కరువుతీరా ఏడ్చాం!

చివరికి అతనే లేచి సర్దుకుంటూ -

"నీకేం పర్లేదు. నీ పిల్లలొచ్చి నీకు చక్కగా కబుర్లు చెప్తారు. వాళ్ళతో కలిసి నవ్వుతావు. నాది హామీ!" అన్నాడు నమ్మకంగా.

అందులో ఎంత నిజంవుందో నాకు బాగా తెలుసు.

"మృత్యూ!" అన్నాను అతని చేతుల్ని నా చేతుల్లోకి తీసుకుంటూ.

"చెప్పు మున్నీ!"

"మృత్యూ! నువ్వు నా పక్కనే ఉండాలి!"

"మున్నీ!"

"అవును మృత్యూ! నువ్వు నా పక్కనే వుండాలి. నన్ను విడిచి పోవద్దు మృత్యూ!" అన్నాను ఒకలాంటి వుద్వేగంగా

"ఒద్దు మున్నీ!" నన్ను మృత్యు అనిపిలవద్దు! మృత్యు నీ దగ్గరుండకూడదు! అందుకే ఇంక నన్ను మృత్యు అని పిలవకు!" అన్నాడు పసివాడిలా ఏడుస్తూ.

పుస్తకంతో తిరిగొచ్చిన కిరీటి మా ఇద్దర్నీ వింతగా చూసి -

"ఏవిటంకుల్! నాకు చెప్పి మీరు ఏడుస్తున్నారు! బామ్మకెలా వుంది!" అన్నాడు ఆదుర్దాగా.

జయ మాట్లాడలేదుగానీ నేనే కిరీటిని దగ్గరికి రమ్మనిపిల్చాను. వాడు భయంభయంగా నా దగ్గరగా వచ్చికూర్చున్నాడు.

వాడి మొహం వాడిపోయి వుంది. కళ్లు నాకేసి దీనంగానూ, భయంభయంగానూ చూస్తున్నాయి. వుబికి వస్తున్న దుఃఖాన్ని అదుపులో వుంచుకోవాలని ప్రయత్నిస్తున్నాడని నాకర్థమైపోయింది. సన్నగా నవ్వాను.

"అంకుల్! నేనిప్పుడే వస్తాను..." అంటూ బైటికి పరిగెత్తాడు కిరీటి. అదోలా నిట్టూర్చాడు జయ.

"కిరీటి ఏడుస్తున్నాడు కదూ?" అన్నాను గొణిగినట్టు. దానికి జయ ఏం మాట్లాడలేదు.

"నాకు తెలుసు! నా పరిస్థితి ఏమిటో కిరీటికి బాగా తెలుసు. అందుకే అంతలా బాధపడుతున్నాడు" ఒణుకుతున్న గొంతుతో అన్నాను.

"అవును మా ఇద్దరికీ తెలుసు నీ స్థితి. కానీ మాకన్నా ఎక్కువ తెలిసినట్టు నువ్వు ఏవేవో మాట్లాడుతున్నావ్!' అన్నాడు జయ విసుగు నటిస్తూ.

నాకు నవ్వొచ్చింది.

ఇంత తెలిసినా, ఇంకా నన్ను మభ్యపెట్టాలని చూస్తున్నాడు జయ. జయ అనేమిటి డాక్టర్లంతా ఇంతే, ఓవైపు ప్రాణంపోతున్నా -

"నీకేం పర్లేదు. నిండునూరేళ్ళు బతుకుతావ్" అంటారు. అనుకున్నాను. ఒకప్పుడు బామ్మ అన్నమాటలు గుర్తుతెచ్చుకుంటూ.

"ఎందుకా నవ్వు! గట్టిగా అనాలనుకున్నా జయ గొంతు దాటిరానంటోంది శబ్దం. అయినా అదేం గమనించనట్టు -"

"జయా! కిరీటిని పిలవ్వా?" అన్నాను వేడికోలుగా. జయ పిలవకుండానే వచ్చాడు కిరీటి.

అసలు తను దూరంగా వెళ్తే కదా! దుఃఖాన్ని ఆపుకోవడం కోసం, బైటికి పరిగెత్తాడేగానీ నన్నొదిలి వెళ్ళాలని కాదు. కిరీటిని దగ్గరికి రమ్మన్నట్టు పిల్చాను.

కిరీటి నాదగ్గరగా వచ్చాడు. కళ్ళువాచి ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి.

నిజంగా నాకు చాలా జాలేసింది. వాణ్ని దగ్గరికి తీసుకుని -

"నేను చచ్చిపోతానని భయంగా వుందా నాన్నా" అన్నాను. వాడి జుట్టు సవరిస్తూ.

"నో! నీకేంకాదు!" నా కాళ్లమీదపడి బావురుమన్నాడు కిరీటి. నాకూ ఏడుపొచ్చింది.

"అవున్నాన్నా! మీ తాతయ్య అదృష్టవంతుడు!... వార్ధక్యపు ఛాయలు చూడకుండానే పువ్వులా రాలిపోయాడు. ఆయన ఆయుష్షు

కూడా పోసుకుని నేను రెండొందలేళ్ళు బతుకుతాను!" అనుకున్నాను మనసులో.

"బామ్మా! తెల్లారేసరికి డేడీ, మమ్మీ, పెదనాన్నా, పెద్దమ్మ, అన్న, యమునా... అందరూ వచ్చేస్తారు. ఇంక సందడే సందడి!" మనసులో దుఃఖ సముద్రాలు పొంగుతున్నా పైకి నవ్వుతూ అన్నాడు కిరీటి.

పిచ్చివాడు! నేనింకా బతుకుతాననే అనుకుంటున్నాడు. నేను నవ్వాను. ఎందుకో వాడి మొహంలో విపరీతమైన భీతి కనిపించింది.

"అలా నవ్వకు బామ్మా!... నీ నవ్వు కొత్తగా వుంది!" వాడికి మళ్లీ ఏడుపొచ్చేస్తోంది.

"ఊఁహుఁ! ఇంక నవ్వనే! ఏదీ! ఆ ఫైల్ ఇలా ఇవ్వు!" పుల్లల్లా వున్న చేతుల్ని అతి ప్రయాసగా ఎత్తాను.

నా బాల్యచరిత్ర పొందుపరచిన ఫైల్ నా చేతికిచ్చాడు కిరీటి. అయితే అది మోసే శక్తి కూడా నా చేతులకు లేదు.

ఒక్కసారిగా శరీరంలోని శక్తంతా మంత్రించినట్టు మాయమైంది. ఒంట్లో ఒక్క నెత్తురు బొట్టూ లేనంతగా నిస్సత్తువ ఆవరించింది? అనుకుని ఆశ్చర్యపోయాను.

ఇవేం పట్టించుకోని జయ స్టెత్‌తో నా గుండెల్ని పరీక్ష చెయ్యడంలో పడిపోయాడు.

"మృత్యూ!" పీలగా వుంది నా గొంతు.

"ఊఁ!" అన్నాడతను మాట్లాడితే దుఃఖం ఎక్కడ ముంచుకొస్తుందో అన్నట్టు.

"ఇదిగో... నీ కోసం... నేను రాసిన చివరి నవల! మన చిన్ననాటి చరిత్ర. మన అమాయకపు చర్యలు, అర్థంలేని వాదోపవాదాలు!... నేను లేకపోయినా ఇది శాశ్వతంగా వుంటుంది కదూ? " అన్నాను. పాలిపోయిన పెదవులతో బలవంతంగా నవ్వుతూ.

మృత్యు ఫైల్ తీసుకుని అంకితం మేటర్ చూసుకున్నాడు. ఓసారి పేజీలు అలవోకగా చూశాడు.

అతని కళ్ళల్లో వింత వెలుగు చోటు చేసుకుంది.

"మున్నీ... ఇది... ఇది నాకు అంకితం ఇచ్చావా? " అన్నాడు. గొణిగినట్టు

"మరి నీ కోసమేగా రాసింది!" జీవంలేని పెదవులతో సన్నగా నవ్వాను.

అతను పేజీలు తిప్పాడు

"నాకూ, కిరీటికీ మధ్య జరిగిన స్వీట్ నథింగ్స్ ఏం లేవందులో!" అల్లరిగా అన్నాను.

"నేను తమాషాకన్నాను. నిజంగానే కిరీటిని గురించి వివరంగా రాయలేదా? " నేరం చేసినవాడిలా అన్నాడు జయ.

"ఎందుకు రాయలేదు? ... చాలా రాశాను. మా శోభనం గురించి కూడా రాశాను. కానీ అంతకు మించి రాయలేదు. ఇంకా విపులంగా రాస్తే నువ్వే అంటావ్-

"నీకు సిగ్గులేదా! ఏమిటా రాతలు? " అని అన్నాను బలవంతంగా నవ్వుతూ

"నువ్వెలా రాసినా అమాయకంగానే ఉంటుంది. తప్ప అసభ్యంగా వుండదు!" మెచ్చుకోలుగా అన్నాడు జయ. నేను తృప్తిగా చూశాను.

"ఒకందుకు నాకు చాలా ఆనందంగానూ, ఇబ్బందిగానూ వుంది మున్నీ!" అన్నాడు జయ లోగొంతుతో.

"ఎందుకు? "

"నవల నాకు అంకితం ఇచ్చినందుకు ఆనందంగానూ, కిరీటికి ఇవ్వనందుకు ఇబ్బందిగానూ వుంది!"

"ఓ! అదా? అయితే నువ్వు చేసిందానికి నేనెంత ఇబ్బంది పడాలి? "

"నేనేం చేశాను? " అమాయకంగా అన్నాడు జయ.

"ఇంకేం చెయ్యాలి? ... నీ జీవితమంతా నా కోసం త్యాగం చేశావ్! అది చాలదని ఇంత పెద్ద హాస్పిటల్‌కి నా పేరు పెట్టావ్!

నువ్వు చేసిందానితో పోలిస్తే నేను చేసిన దెంత మృత్యూ? " మనస్ఫూర్తిగా అన్నాను.

జయ ఇబ్బందిగా కదిలాడు.

"చాలా బాగా రాశావ్ మున్నీ!... రియల్లీ అయామ్ వెరీ హేపీ!" అన్నాడు లోగొంతుతో.

"మరి దీన్ని నలుగురూ చదివేలా చేస్తావా? " ఆశగా అడిగాను.

"తప్పకుండా మున్నీ!"

నా కళ్లు తళుక్కుమన్నాయో క్షణం.

"అయితే దాన్ని భద్రంగా దాచుకో!" అన్నాను తృప్తిగా.

"థ్యాంక్స్ మున్నీ! థ్యాంక్యూ వెరీమచ్! దీన్ని ప్రింట్ చేయించి దేశమంతా పంపుతాను. మన స్నేహంలాంటి స్నేహం, మన ఊరిలాంటి ఊరు మరెక్కడా లేదని, ఉండదనీ చాటి చెప్తాను!" అన్నాడు నా చెంపలు రెండూ సున్నితంగా ఒత్తుతూ.

"మృత్యూ!" మళ్లీ నాకు ఆయాసం మొదలయింది.

"చెప్పు మున్నీ!"

"టైమెంతయింది? "

"మూడు గంటలయింది!"

"పిల్లలు రావడానికి ఇంకా ఎంత టైమ్ పడుతుందంటావ్? " నీరసంగా అన్నాను.

"వచ్చేస్తారు. తెల్లారేసరికి వచ్చేస్తారు. ఈలోగా నువ్వు హాయిగా నిద్రపో!" దుఃఖంతో నిండిన గొంతుతో అనునయంగా అన్నాడు జయ.

"అంతదాకా టైముందా? "

"టైమా? దేనికి? "

"అదే నా గుండె..."

"నీ గుండెకేం పర్లేదు. నేను దాన్ని ఆగనీను! నువ్వు నిద్రపో!" బి.పి. చూస్తూ అన్నాడు జయ.

"అలాగే! నువ్వు నన్ను వదిలి వెళ్ళకు మృత్యూ! నా మృత్యు నన్నంటిపెట్టుకునే వుండాలి!"

"మున్నీ!" మరోసారి బావురుమన్నాడు జయ.

"బామ్మా! నువ్వు కంగారుపడ్డమే కాక నన్ను, అంకుల్ని కూడా కంగారుపెడుతున్నావ్! చూడు ఎప్పుడూ నవ్వుతూ వుండే అంకుల్ పసివాడిలా ఎలా ఏడుస్తున్నాడో!" జయని గుండెలకి హత్తుకుంటూ అన్నాడు కిరీటి.

"నిజమే! జయ ఏడవకూడదు! నా జయ నిండు నూరేళ్లు నవ్వుతూనే బతకాలి!" అనుకున్నాను.

"కిరీటీ! నా పక్కన కూర్చో నాన్నా!" అన్నాను.

వాడు నా పక్కన కూర్చుని నాతల నిమురుతూ వుండిపోయాడు.

నేను కళ్ళు మూసుకున్నాను.

నా పల్స్, బి.పి. చూస్తున్న జయ కంగారుగా కిరీటికేదో చెప్పాడు.

కిరీటి బైటికి పరిగెత్తాడు.

నాకు గుండెల్లోని బాధ పెరిగిపోతోంది.

"మృత్యూ! బాధగా వుంది!" అన్నాను లోగొంతుతో

"భయంలేదు. ఇంజక్షనిస్తాను. తగ్గిపోతుంది!" అన్నాడతను.

ఈసారి అతని గొంతులో దుఃఖం లేదు. అనునయం మాత్రమే ఉంది.

అతి ప్రయాసగా ఓసారి కళ్లెత్తి జయకేసి చూశాను.

తనూ పండుటాకులా ఉన్నాడు. అయితే మంచి ఆరోగ్యంగా ఉన్నాడు.

తను ఆపరేషన్స్ మానేసి దాదాపు పదేళ్లయిందనీ, తనకిందే నలుగురు మంచి డాక్టర్లని వేసుకొని, తన ఆధ్వర్యంలో ఎంతో మందికి సర్జరీలను చేసి పునర్జన్మనిచ్చాడనీ నాకు తెలుసు. అయితే ఇంత భయంకర స్థితిలో నేనున్నానని మాత్రం అతనుగానీ, కిరీటిగానీ నాకు తెలియనివ్వలేదు.

ఏదో అనుమానంతో తెలుసుకుందామని ప్రయత్నించినా కుదరలేదు.



ఇప్పుడు నేను ధైర్యం చేసి రావడం, కిరీటి, జయ మాట్లాడుకున్న మాటలు వినడంతో నా పరిస్థితి నాకు అద్దం పట్టినట్లు కనిపించింది.

"మున్నీ!" నేను మాట్లాడక పోవడంతో కంగారుగా పిల్చాడు జయ.

"ఇంకా నాగుండె ఆగలేదు మృత్యూ!" అన్నాను పేలవంగా నవ్వుతూ.

"అలా పిచ్చిగా వాగకు!" అని రెండు చేతులకీ రెండు ఇంజక్షన్లు చేశాడు జయ. ఏం జరుగుతోందో అతను నోరు విప్పి చెప్పనక్కర్లేదు. అతని ముఖ కవళికలే చెప్తున్నాయి.

ఒక్కసారి గుండె కలుక్కుమంది.

"అబ్బా!" అన్నాను బాధగా.

"మున్నీ బాధగా ఉందా? " ఒణుకుతున్న గొంతుతో అన్నాడు జయ.

"ఉఁ!"

"తగ్గిపోతుంది! ఇంజక్షనిచ్చానుగా? "

"అంతకుముందు ఏవో వంకలు పెట్టి చాలా ఇంజక్షన్లుఇచ్చావ్. చాలా మందులు మింగించావ్. కాని మృత్యూ! నేనింతకాలం వున్నానంటే అది నీ చల్లని నీడే!" మనస్ఫూర్తిగా అన్నాను.

"మున్నీ! ఇంక మాట్లాడొద్దు!" ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు జయ.

"ఇప్పుడు మాట్లాడకపోతే ఇంక జీవితంలో మాట్లాడలేను మృత్యూ" దీనంగా అన్నాను.

"ఏం మాట్లాడతున్నావ్" అన్నాడు కుతూహలం నటిస్తూ కానీ అతని గొంతులో దుఃఖం గరగరలాడుతోంది.

"రాజన్నయ్య గురించి!"

"రాజన్నయ్య గురించా? " తుళ్లిపడ్డాడు జయ.

"గిరన్నయ్య గురించి కూడా!"

"మీ రాజన్నయ్య అమెరికా వెళ్లడం మాత్రం నాకు తెలుసు.

"మరి గిరన్నయ్య? "

"అతను అమరావతిలో వున్నాడని చెప్పాను కదా" లేని విసుగు తెచ్చుకుంటూ అన్నాడు జయ.

"మనం వెళ్దామని కూడా అన్నావ్!"

"అవును. ఇప్పుడెళతామంటావా?" బల వంతంగా నవ్వుతూ అన్నాడు జయ.

"ఉహూ! నువ్వొద్దు. నేను మాత్రం వెళ్తాను!"

ఉలిక్కిపడ్డాడు జయ. మళ్లీ తేరుకుని "అలాగే! ముందు నువ్వు కోలుకో!" అన్నాడు.

"అక్కడికెళ్లాలంటే కోలుకోనక్కర్లేదు!" నవ్వాను.

"ఏవిటా పిచ్చిమాటలు?"

"పిచ్చి మాటలు కాదు మృత్యూ! అమరావతి అంటే స్వర్గమేనని నాకప్పుడర్థం కాలేదు. గానీ ఇప్పుడు తెలిసింది!" అన్నాను ఆయాసపడుతూ.

"మున్నీ!"

"అవును మృత్యూ! గిరన్నయ్య చచ్చిపోయాడని నాకు తెలిసింది. ఎలా తెలిసింది అనడక్కు!"

"సరే అడగను! ఎంతోమంది పుడతారు. పండుటాకు రాలిపోకుండా వుంటుందా? ఇంక వాళ్లని గురించి ఆలోచించకుండా హాయిగా నిద్రపో!" అనునయంగా అన్నాడు జయ.

నేను పేలవంగా నవ్వాను.

"నిజం. పండుటాకు రాలిపోక తప్పదు! ఇప్పుడు నేను పూర్తిగా పండిపోయిన ఆకుని. అది క్షణాల్లో రాలి ధూళిలో కలిసిపోతుందని నీకూ తెలుసు?" అన్నాను ఎగిసిపడుతున్న గుండెల్ని బాధగా చూసుకుంటూ.

జయకి దుఃఖం వచ్చేస్తోందని నాకు తెలుసు. అయినా ఇంకా మాట్లాడాలని ఏదో తపన!

"టైమెంత?" అన్నాను అతి ప్రయాసగా.

"ఎంతో అంత! నిన్ను మాట్లాడ వద్దన్నానా?" పసిపిల్లని మందలించినట్లు అన్నాడు జయ.

"మాట్లాడను" అన్నాను బుద్ధిగా.

అయితే నేను మాట్లాడనన్నది అతను చెప్పడం వల్ల కాదు. నాకేదో మైకంలా వచ్చేస్తోంది. బహుశా ఇంజక్షన్ వల్ల కావచ్చు

ఇంతలో నలుగురైదుగురు డాక్టర్లు బిలబిల్లాడుతూ వచ్చారు. నాకు వాళ్లని స్పష్టంగా చూడాలని వుంది. కానీ కళ్లు తెరిపిన పడ్డం లేదు.

"మున్నీ! మున్నీ!" అని కుదిపి మరీ పిల్చాడు జయ.

"ఊ!" అనడానిక్కూడా శక్తి లేనట్టైపోతోంది. గుండెల్లోని బాధ క్షణక్షణానికీ పెరిగిపోతోంది. ఒళ్లంతా చెమటతో తడిసి ముద్దై పోయింది.

నా పరిస్థితి చూస్తున్న జయ- "ముందీ విణ్ణి థియేటర్‌లోకి తీసికెళ్లండి. హరియప్!" అన్నాడు అరిచినట్టు.

స్ట్రెక్చర్ మీద పడుకోబెట్టారో లేక జయ, కిరీటి వాళ్లంతా కలిసి మోసుకుపోయారో తెలియదు గానీ, నేను ఇక్కడ మాయమై ఆపరేషన్ థియేటర్‌లో వెలిశాను.

డాక్టర్లంతా కలిసి నన్ను బతికించాలని నానా విధాలుగా ప్రయత్నిస్తున్నారు. ఏదేదో చేస్తున్నారు.

నా గుండె వేగం పెరిగిపోతూనే ఉంది. భరించలేని బాధ! క్రమేపీ వాళ్ల మాటలు కూడా వినిపించడం మానేశాయి. జయని టైమడగాలని తెగ ఆరాటపడిపోయింది నా మనసు. కానీ శక్తి చాల్లేదు. నోట మాట రావడం లేదు.

క్రమేపీ శరీరం తేలికగా అయిపోయినట్టు ఫీలింగ్! ప్రాణాలు గాలిలో పక్షిలా ఎగిరిపోతున్న అనుభూతి! హృదయం చిత్రంగా స్పందిస్తోంది, ఎప్పుడూ లేని విధంగా.

"ఎక్కడికెళ్తున్నాను? ఏమో! కానీ ఎక్కడికో వెళ్తున్నాను. నే...ను...కా...దు... నా... ఎటో వెళ్లిపోతోం...ది...

*

# మినీ కథలు

## దేవుడు వరమందిస్తే!

"చూడు సంపాదించటంవరకే నా పని. ఇంటి బాధ్యతంతా నీదే. ఇంకెప్పుడూ నన్ను విసిగించకు" కరుగ్గా చెప్పేసి క్లబ్బుకు వెళ్లిపోయేడు శేఖర్.

నిస్సహాయంగా చూస్తుండిపోయింది మానస. శేఖర్ కాఠిన్యానికి కళ్లలో నీళ్లు






చిమ్మేయి. ఎందుకో తన మీద తనకే విపరీతమైన జాలి కలిగింది. ఏమాత్రం బాధ్యత తెలియని భర్త, నిమ్మకు నీరెత్తినట్టుగా ఉండే అత్తగారు, పిల్లల పెంపకం తలుచుకుంటున్నకొద్దీ మానసకు జీవితం ఎంతో దుర్భరంగా తోచింది రోజూ ఉండేదే అయినా ఎందుకో ఆ రోజు భర్త ప్రవర్తన చాలా బాధాకరంగా అనిపించింది. చప్పున పూజగదిలోకి వెళ్లింది. "స్వామీ! ఏమిటీ కష్టాలు? ఈ బాధలకు అంతం లేదా? ఇహ నా జీవితం ఇలా కష్టాలతో తెల్లవారిపోవల్సిందేనా? " భగవంతుడి ముందు చేతులు జోడించి దీనంగా తన గోడు వెళ్లబోసుకుంది. ఏడుకొండల వేల్పు మాత్రం చిద్విలాసంగా చిరునవ్వులు చిందిస్తూనే ఉన్నాడు.

మానసకు ఆవేశం రెట్టింపయ్యింది. "స్వామీ నీ గుండె కరిగి నా మీద దయ కలిగేవరకు నీ పాదాలు విడవను" ప్రతిజ్ఞ చేస్తున్నట్టు ప్రార్థిస్తూ అక్కడే సొమ్మసిల్లి పడిపోయింది మానస. అలాగే కొద్దిసేపు గడిచిపోయింది.

"మానసా" మృదుమధురంగా వినిపించింది స్వామి గళం.

చప్పున లేచి కూర్చుంది మానస.

"నీ ప్రార్థన నన్ను కదిలించింది. నిన్ను అనుగ్రహిస్తున్నాను. నీవు ఎరిగినవాళ్లలో ఎవరి జీవితం నీకు బాగా నచ్చిందో ఆ జీవితాన్ని కోరుకో. నీ జీవితగమనాన్ని ఆవిధంగా మార్చేస్తాను" అంటున్న స్వామి వాక్కులను విని సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది మానస.

ఎవరిలా ఉంటే జీవితం బాగుంటుంది? ఎప్పుడూ ఒంటినిండా నగలు దిగేసుకుని దర్జాగా కార్లలో తిరిగే స్నేహితురాలు ఉమ గుర్తుకొచ్చింది. 'ఉమలా జీవితం ఉంటే ఎలాగుంటుంది' వెంటనే తాగొచ్చి భార్యను చితకబాదే ఉమ భర్త గుర్తుకొచ్చాడు. 'అమ్మో వద్దు' గుండెల మీద

చెయ్యేసుకుని అనుకుంది. పోనీ అక్కలా జీవితం ఉంటే ఎలా ఉంటుంది? బావెంతో మంచివాడు. అక్కగీసిన గీటు దాటడు. కానీ అక్క గయ్యాళి అత్తగారు గుర్తొచ్చి వద్దనుకుంది. పక్కింటి పద్మలా ఉంటే ఎలాగుంటుందా అని కాసేపు ఆలోచించింది. అసమర్థుడైన పద్మ భర్త గుర్తుకొచ్చి అసలుకే మోసం వస్తుందని వద్దనుకుంది. ఆడపడుచు ఆశ గుర్తొచ్చింది కానీ ఆమె శాడిస్టు మొగుడు గుర్తొచ్చి భయంతో వణికిపోయింది. అలాగే దీర్ఘాలోచనలో మునిగిపోయింది. ఎవరి జీవితం చూసినా ఏదో ఓ సమస్య. ఒక్కసారిగా జ్ఞానోదయమయింది మానసకు. "స్వామీ సమస్యలు లేని జీవితం లేదని నాకు జ్ఞానోదయం కలిగించావు. ఇంకెన్నడూ అసంతృప్తితో నిన్ను విసిగించను" సజలనయనాలతో స్వామిని వేడుకుంది.

'ఈ జీవితమే బాగుంది' తనలో తనే ముక్తాయింపుగా అనుకుంది మానస.

– పులిపాటి కనకదుర్గ

---

# ఆసరా

"చూడు బాబాయ్... నీ పరిస్థితి బాగా లేదు... ఉండడానికి ఇల్లు లేదు, తినడానికి తిండి లేదు, నా అన్నవాళ్లెవ్వరూ లేరు. నీ బాధ నాకర్థమైంది. కానీ నేను నీకు సాయం చేసే పరిస్థితిలో లేను. నాకు లక్ష సమస్యలున్నాయి. ముఖ్యంగా నా భార్యకివన్నీ నచ్చవు. ఆమెకిష్టం లేని పని నేను చేయలేను. నువ్వెన్నైనా చెప్పు. నేనేమీ చేయలేను. ఇంక నా సమయాన్ని వ్యర్థం చేయక వెళ్లిరా. ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు!" అంటూ లోపలికెళ్లిపోయాడు భూషణం.

భద్రయ్య కండువాతో కళ్లనీళ్లు తుడుచుకుని, తన చేతి సంచీని భుజానికి వేసుకుని అక్కడనుండి బయల్దేరాడు భారంగా అడుగులు వేసుకుంటూ.

"పోయాడు వెధవ సంత... ఎక్కడో దూరపు చుట్టరికం అడ్డం పెట్టుకుని సాయం చేయమంటూ వచ్చిపడతారు. హమ్మయ్య... శని వదిలింది" అన్నాడు భూషణం. అతని భార్య మంగమ్మ "మంచి పని చేశారు" అని భర్తని మెచ్చుకుంది.

ఆ విషయం వాళ్లు అంతటితో మరచిపోయారు. సుమారు నెల రోజుల తర్వాత భూషణం, అతని భార్య ఒక పెళ్లి కార్యక్రమానికి పొరుగూరు వెళ్లారు. అక్కడ వారికి భూషణం చెల్లెలు యామిని కనిపించి ప్రేమగా పలకరించింది.

ముందు వారు ఆమెను గుర్తుపట్టలేకపోయారు. నూలు చీరలో... మెళ్ళో పుస్తెల తాడు తప్ప మరో నగ అనేదే ఎరుగని యామిని... ఇప్పుడు పట్టుచీరలో... మెళ్ళో కాసుల పేరు, చెవులకు బంగారు కమ్మలతో ఎంతో ఠీవిగా కనిపించింది.

విస్తుపోయి చూడసాగారు భూషణం, అతని భార్య. అంతలో ఆమె భర్త రాజశేఖరం కూడా అక్కడకు వచ్చాడు. అతని వేషధారణ కూడా పూర్తిగా మారిపోయింది. చేతి వేళ్లకు బంగారు ఉంగరాలు, మెళ్లో గొలుసు ధగధగా మెరిసిపోతున్నాయి.

యామిని దంపతులను ఈ స్థితిలో చూస్తుంటే భూషణం దంపతులకు కళ్ళు తిరిగిపోయాయి.

ముందు ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ, మెల్లగా అసలు విషయం కదిపాడు భూషణం. అతని మనసులో అప్పటినుండి రగులుతున్న సందేహాన్ని బయటపెట్టాడు.

"ఇంతకూ యామినీ... ఏమిటీ సంగతి? అనుకోకుండా. మీకేదో అదృష్టం పట్టినట్టుందే!" అన్నాడు అసూయగా చూస్తూ.




"అదృష్టమే పట్టిందన్నయ్యా! అదృష్టం వెతుక్కుంటూ మరీ వచ్చింది" అంది యామిని నవ్వుతూ.

"ఎలా? "

"నీకు భద్రయ్య బాబాయ్ జ్ఞాపకం ఉన్నాడుగా? "

"ఆఁ ఆఁ"

"ఆయన ఒకరోజు మా ఇంటికి వచ్చాడు. అప్పుడతని పరిస్థితి ఏమీ బాగా లేదు. చాలా కష్టాల్లో ఉన్నాడు. మమ్మల్ని సహాయం అడిగాడు. నాకతన్ని చూస్తే చెప్పలేని జాలి కలిగింది. మనం పోతూ పోతూ మనతో ఏదీ తీసుకుపోలేము కదా! ఇతరులకు ప్రాణం మీదికి వచ్చి మనల్ని ఆశ్రయించినప్పుడు, వారికి మనం చేయూత ఇవ్వగలిగీ ఏమీ చేయలేకపోవడం కన్నా దుర్మార్గం, సంకుచితత్వం ఈ లోకంలో మరొకటి వుండదు కదా! అందుకే అతనికి భోజనం పెట్టి మాతోనే ఉండనిచ్చాం. పాపం వయసుపైబడ్డవాడు. ఎవరికీ ఇబ్బంది కలిగించకుండా మాకూ పనిలో అంతో ఇంతో ఆసరా అయ్యేవాడు. అనుకోకుండా ఒక కోర్టుకేసులో తీర్పు అతని పక్షాన వచ్చింది. దానితో సుమారు పదిలక్షల విలువ చేసే స్థలానికి అతను హక్కుదారైపోయాడు. అత్యవసర సమయంలో... ఆపదలో తనని ఆదుకున్నందుకు కృతజ్ఞతగా మాకు లక్షరూపాయలు కానుకగా ఇచ్చి వెళ్లిపోయాడు. దాంతో మా బ్రతుకులు మారిపోయాయి" అంది యామిని. ఇరుకుగా ఆలోచించి, ఇంటికొచ్చిన లక్ష్మీదేవిని వెళ్లగొట్టామే అని లోలోపల కుళ్లిపోతూ, సిగ్గుతో తలవంచుకున్నారు భూషణం, మంగమ్మలు.

– కె. లక్ష్మీకాంతమ్మ

---

## మొరాలిటీ

**జ**నాన్ని నెట్టుకుంటూ బస్సులో ఎక్కి ఎలాగోలా సీటు సంపాదించి కూర్చుని 'ఉఫ్...' అని ఊపిరి పీల్చుకున్న ఆనందరావు మాస్టారి వయస్సు ఏభై. కాని బుద్ధి మాత్రం ఇరవై. 'వెధవది ఉపాధ్యాయ వృత్తిని ఎందుకు ఎంచుకున్నానా' అని ఒక్కోసారి మధన పడుతూ ఉంటాడు. ఎందుకంటే సమాజంలో ఉపాధ్యాయునికి గౌరవ స్థానం ఉంది. "టీచింగ్ ప్రొఫెషన్ ఈజ్ ది నోబ్లెస్ట్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్" అనే పేరుంది. సమాజానికి భయపడి తను చాలా బుద్ధిమంతుడిలా ఉండవలసి

వస్తోంది. తనే నీతి తప్పితే తను పిల్లలకేం చెప్తాడు? అంటారు. కాని అతని మనసులో కోరికలు మాత్రం అదుపు తప్పిన గుర్రాల్లా పరుగెడుతుంటాయి.

ఆయన సీటు ఆడవాళ్ళ వరుసకు దగ్గర్లోనే ఉండటం అతనికి తృప్తి నిచ్చింది. బస్సంతా ఒకసారి పరికించి చూశాడు. ఎవరూ తనకు తెలిసినవాళ్ళు లేరు. ఇదో ప్లస్ పాయింట్ అనుకున్నాడు. నిలుచున్న పాసింజర్ల కాళ్ల సందుల్లోంచి ఆడవాళ్ళ సీట్లను పరికించాడు. అక్కడ ఒక సీట్లో అమ్మాయి... పాలరాతి శిల్పంలా ఉంది. తననే చూపు మరల్చకుండా చూస్తోంది.

మిటి? తనోలా అనుకుంటే మరోలా జరిగింది. అతను ఆశ్చర్యం నుంచి తేరుకోకముందే "మాస్టారూ! నేను గుర్తున్నానా మాస్టారూ? మీదగ్గర సెవెన్త్ చదివాను" అందామె.

"నువ్వు... మీరు... పేరు?"

"కీర్తి! మాస్టారూ! మర్చిపోయారా? రామన్నపాలెం స్కూల్లో మీ స్టూడెంట్‌ని. ఒకసారి నేను "మోరాలిటీ" స్పెల్లింగ్ తప్పు రాశానని మీరు నా నెత్తిమీద గట్టిగా మొట్టారు."

"ఆ...ఆ... ఔనమ్మా! గుర్తొచ్చింది. ఎప్పుడో ఇరవై ఏళ్ళ కిందటి మాట!"




తననేనా ఆమె చూస్తోంది? అనుకొని అటూ ఇటూ చూశాడు. ఎవరి ధ్యాసలో వాళ్లు ఉన్నారు. అబ్బే ఎవర్నీ కాదు! తననే! ఆ అమ్మాయి తననే చూస్తోంది. తనూ చూశాడు. ఆమె చూపు మరల్చలేదు. తననే చూస్తోంది. అబ్బ! ఎంత అందమైన ముఖం! కలువ రేకుల్లాంటి కళ్ళు! సంపంగి పువ్వులాంటి ముక్కు! బస్సు రాజమండ్రికి చేరగానే ఆమె దిగింది. ఆశ్చర్యం! ఆమె దిగీ దిగగానే అతని పాదాలకు నమస్కరించింది. ఆనందరావు స్టన్ అయ్యాడు. ఇదే

"ఇప్పుడెక్కడుంటున్నారు మాస్టారూ"

"అమలాపురంలో సెటిలయ్యాను తల్లీ"

"వస్తాను మాస్టారూ" అంటూ ఆమె రిక్షా ఎక్కింది.

"గాడ్ బ్లెస్ యూ..." అంటూ వెనుతిరిగాడు ఆనందరావు.

నీకు 'మోరాలిటీ' స్పెల్లింగ్ దిద్దినవాడిని-నేనే మోరాలిటీ తప్పి ఏవేవో ఊహించుకున్నాను. అని మనసులో మధనపడుతూ వడివడిగా జనంలో కలిసిపోయాడు ఆనందరావు మాస్టారు.

– గుబ్బల సత్యనారాయణమూర్తి

★



# రచయితలకు సూచనలు

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:




'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యం కాదు.

**కూపన్**

జనవరి చతుర నవల 'ఎటో వెళ్ళి పోతోంది... మనసు...'

చిరునామా: ____________________

____________________

____________________

____________________

# 'ఇలా ఎందరో' పై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురించిన ఎ.అన్నపూర్ణ నవల "ఇలా ఎందరో"పై మా కందిన ఉత్తమ సమీక్షలు

## హెచ్చరిక

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

గత మిలీనియంలో పుట్టి... ఈ మిలీనియంలో పెరిగి పెద్దదై ప్రపంచాన్నే భయకంపితం చేస్తున్న 'దయ్యపు బిడ్డ' - ఎయిడ్స్. రాను రాను వెర్రితలలు వేస్తూ, మర్రిఊడల్లా వ్యాపిస్తూ సమాజాన్ని కూకటివ్రేళ్లతో పెకిలించడానికి ప్రయత్నిస్తున్న మహమ్మారి అది. దుర్వ్యసనాల మూలంగానైతేనేమి, ఆసుపత్రుల నిర్లక్ష్య వైఖరి వల్లనైతేనేమి, ఆధునిక జీవన సరళి కారణంగానైతేనేమి... ఎయిడ్స్ సర్వత్రా వ్యాపిస్తోంది. ఆసియా ఖండంలో - ముఖ్యంగా భారతదేశంలో ఆ వ్యాధి ప్రబలంగా ఉందన్న విషయం అందరూ ఎరిగినదే. అయితే ఆ డ్యూబియస్ డిస్టింక్షన్ మన రాష్ట్రానికి కూడా కలగడం శోచనీయం.

ఎయిడ్స్ రోగిని సమాజం వెలివేయడం అత్యంత విచారకరం. వ్యాధి కంటే తమ చుట్టూ ఉన్నవారి నిరసన, నిర్లక్ష్యం ఆ రోగిని మరింత కుంగదీస్తాయన్నది నిర్వివాదాంశం. మృత్యు గహ్వరంలో అడుగిడిన వ్యక్తికి పిసరంత సానుభూతి, చేయూత - కొండంత బలాన్ని చేకూర్చుతాయన్న సత్యం తెలిసీ... భయంతో వారికి దూరంగా ఉండే వారిని పూర్తిగా తప్పుపట్టడమూ కష్టమే. ఆ వ్యాధి అలాంటిది మరి!

చెడు తిరుగుళ్ల మూలంగా ఎయిడ్స్ సంక్రమింపజేసుకున్న మోహన్, ఆ విషయం దాచి రేఖను పెళ్లాడడం అనుచితమే అయినా - 'అలాంటి' సంఘటనలు జరిగే ప్రమాదం ఉంది సుమా!' అన్న హెచ్చరిక అంతర్లీనంగా కనిపిస్తుంది... శోభనానికి ముందే భర్తకు ఎయిడ్స్ అన్న నిజం బయటపడడమూ, మంగళ వంటి అత్తగారు లభించడమూ, అరుణ్ భర్త కావడమూ రేఖ అదృష్టం. కొడుకుల మానసిక వైకల్యాలనో, క్రానిక్ డిసీజెస్‌నో దాచిపెట్టి పెళ్లిచేసే తల్లిదండ్రులూ, ఎదురు కోడళ్లను హింసించే అత్తలూ ఉన్న నేపథ్యంలో మంగళ వంటివారు అరుదు. కనుక - వివాహాలకు ముందు హెచ్.ఐ.వి. పరీక్షలు అవసరమేమో ఆలోచించావలసిన అగత్యం ఎంతైనావుంది.

సాధారణంగా ఓ వ్యక్తికి ఎయిడ్స్ అని తెలీగానే రక్తసంబంధీకులే వారిని వదిలించుకోవడం చూస్తూంటాం. అలాంటిది, ఎట్టి సంబంధంలేని ఓ ఎయిడ్స్ రోగిపట్ల సానుభూతితో అనుబంధం పెంచుకుని, పర్సనల్ రిస్క్‌లకు వెరవకుండా, మున్ముందు ఆ వ్యాధి వ్యాప్తిని అరికట్టే ఉద్దేశ్యంతో చేసే ప్రయత్నాలకు దోహదకారిగా, ఆ ప్రయోగంలో సమిధగా స్వచ్ఛందంగా పాల్గొన్న రేణుక వంటి వారు కోటికి ఒకరుంటారేమో! ఆ పాత్ర చిత్రీకరణ - కాకుల గుంపులో నుంచి కోయిల గొంతు విన్నంత ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

ఆ వ్యాధి ఇతరులకు పాకకుండా అరికట్టేందుకు తగు మార్గాలను అన్వేషిస్తూ నిరంతరమూ వైద్యులు పడే తపనా... ఎంతో చక్కగా, కూలంకషంగా విశ్లేషించి, చర్చించి, ఎయిడ్స్ పట్ల చక్కటి అవగాహన కలిగించే ఈ నవల ఎడ్యుకేటివ్‌గానేకాక,

'ఎయిడ్స్'కి సంబంధించిన రచనలలో ప్రత్యేకంగా నిలుస్తుందని చెప్పవచ్చును. ఎయిడ్స్ వ్యాధి నివారణకు, నిర్మూలనకు వైద్యులు, విజ్ఞాన వేత్తలూ పూనిన దీక్ష, చేపట్టిన యజ్ఞంఏనాటికైనా ఫలించగలవన్న ఓ ఆశా వీచిక పఠితల హృదయాలను తాకి హాయి గొలుపుతుంది.

– పి.యస్.రామలక్ష్మి
సికింద్రాబాద్-500 003

## ఓ మనిషీ మేలుకో...

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

హద్దుమీరిన స్వేచ్ఛ యువతరాన్ని ఎటు వైపు నడిపిస్తుందో తలచుకుంటేనే భయం వేస్తోంది. భవిష్యత్తు అంధకారంలో అంతు తెలియకుండా పోతోంది. మనిషి నడవడిక అది స్త్రీ అయినా, పురుషుడైనా సభ్యసమాజంలో అందరికీ ఆమోదయోగ్యంగా ఉండాలి. స్వేచ్ఛ పేరుతో మనిషి నియమాల్ని దాటి ప్రవర్తిస్తే అది విపరీతమే అవుతుంది. ప్రకృతి దారుణంగా శిక్షిస్తుంది. పరిష్కారం లేని దొరకని సమస్య అవుతుంది. అన్నపూర్ణ గారి 'ఇలా ఎందరో' నవల నేటి పరిస్థితిని కళ్ళకు కట్టినట్లుగా చూపించింది. మోహన్ విచ్చలవిడి జీవితం చివరకు అతన్ని మానసికంగా, శారీరకంగా నిర్వీర్యుడిని చేసింది. ఇది ఒక్క మోహన్ పరిస్థితే కాదు. ప్రపంచం మొత్తాన్ని కదిలించి కుదిపివేస్తోంది. కాన్సర్ వ్యాధికన్నా వేగంగా చాపకింద నీరులా వ్యాపిస్తోంది. ఎంతోమంది మేధావులు, సైంటిస్ట్‌లు ఎన్ని ప్రయోగాలు చేస్తున్నా ఫలితం శూన్యం. ఇలా వ్యాధి బారిన పడినవారు తమ వల్ల ఇతరులకు వ్యాపింపచేయకుండా ఉంటే చాలామటుకు సమస్య పరిష్కారం అవుతుంది. ఒక్కక్షణం స్థిరచిత్తంతో ఆలోచిస్తే ఎన్నివేల జీవితాలో బాగుపడతాయి.

నవలలో చూపిన పరిష్కారం బాగుంది. రేణు లాంటి ఉన్నతమైన వ్యక్తిత్వం ఉన్న వారు చాలా అరుదు. నిస్సహాయ స్థితిలో ఉన్న మోహన్‌ని ఆదరించి, చేయూతనిచ్చి వైద్యుల ప్రయోగానికి సుముఖునిగా చేయటం మానవత్వానికి మచ్చుతునక. మోహన్‌కి తల్లి అయినా మంగళాదేవి చాలా గొప్పగా ఆలోచించి సమస్యని పరిష్కరించింది.

ప్రస్తుత సమస్యకి ప్రయోగాత్మకంగా ఒక ఆలోచనని రేకెత్తించారు రచయిత్రి. హద్దు మీరిన స్వేచ్ఛ విశృంఖలత అవుతుంది అని తెలుసుకుని 'ఇలా ఎందరో' అయినా అందులో కొంతమందికి అయినా కనువిప్పు కావాలి.

– యన్.ఇందిర
సికింద్రాబాద్-500 015

## ప్రధాన కారణం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ప్రమాదకరమైన ఒక సామాజిక సమస్యను కథావస్తువుగా తీసుకుని, వీలైనంతవరకు తాను చెప్పదలచుకున్న విషయాన్ని రచయిత్రి వివరించారు. కుటుంబ సభ్యుల ఆదరాభిమానాలతో ఎయిడ్స్ వ్యాధిగ్రస్థునికి బతుకుపై ఆశను మరింత పెంచవచ్చనే సందేశం నేటి పరిస్థితులలో అవసరం. డాక్టర్లు, మేధావులు ఎంతగా పరిశోధనలు చేసినా, ఎయిడ్స్ భూతాన్ని తరిమేయడానికి సరైన మందును కనిపెట్టలేకపోయారు. ఇటువంటి పరిస్థితులలో తోటి సహచరులే ప్రేమ, అభిమానం, ఆప్యాయతలను అందిస్తూ 'మరణానికి చేరువలో' అనే భావనను తొలగింపచేయాలి. సమంజసమైన కథావస్తువు ఎంపికకు అభినందనలు. అయితే కొన్ని సహేతుక విమర్శలు తప్పవు మరి. ఒక సందర్భంలో మోహన్ తాను విచ్చలవిడిగా తిరిగినందుకు కాక మరేదో

కారణంవలన వైరస్ సోకిందనడం తప్పుడు సంకేతాలను పంపుతుంది. ఈ వైరస్ వ్యాప్తికి ప్రధాన కారణం విచ్చలవిడితనమే.

అతడిని కంటికి రెప్పలా చూసుకోవలసిన తల్లి, అన్న వదిన (భార్య?)లు అతనిని పట్టించుకోలేదు. కాగా ఏమాత్రం సంబంధం లేని 'రేణు' అతనిపై జాలిని కురిపించింది? ఆమె తల్లిదండ్రులు ఎంత ఆదర్శవాదులైనా, ఆమె చేస్తున్న పనిని అంగీకరించి 'సమిధ'ను చేయడం సబబు కాదు. రేఖను పెళ్ళి చేసుకుని ఆమె జీవితంలో నిప్పులు కురిపించావని మోహన్‌ని నిందించిన మంగళాదేవి 'పోనీ మళ్ళీ పెళ్ళి చెయ్యమంటావా' అని అడగడమేమిటి? అప్పుడు మరో ఆడపిల్ల బ్రతుకు నాశనం కాదా? రోజా, పూజాలు కవలలనడం, కవలలకు కవలలే పుడతారనే నమ్మకమా? వారి పాత్రలెందుకు? నవల మొత్తంలో వారి ప్రమేయం అనవసరం. ప్రయోగాల పేరుతో డాక్టర్లు చేసిన టెస్టులు అసంబద్ధమైనవి. నా అభిప్రాయం ప్రకారం, పెళ్లికి ముందే వైరస్ సోకిన మోహన్‌ను, రేఖ వివాహం చేసుకున్న తరువాత ఆ విషయం తెలిసినప్పటికీ అతనికి విడాకులిచ్చి, అతని అన్నను వివాహం చేసుకోవడం కంటే, మోహన్‌కి తానే సర్వస్వం అయి చక్కని ప్రేమను అందించినట్లు, తన జీవితాన్ని త్యాగం చేసినట్లు (ఎలాగూ పరాయి స్త్రీ త్యాగాన్ని చూపారుగా!) రాస్తే మరింత చక్కని రచనగా అనిపించేది.

– సి. హెచ్.వి.యస్.వరప్రసాద్
సీతంపేట, రాజమండ్రి - 533104

## సందేశాత్మకం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ప్రపంచ మానవాళిని వణికిస్తున్న ఎయిడ్స్‌పై అవగాహన, ఆలోచన కలిగించే సందేశాత్మక నవల 'ఇలా ఎందరో!'. విషయపరంగా చూసినప్పుడు ఇది ప్రయోజనాత్మక రచన.

అనుకోని పరిణామంతో రేఖ మోహన్ని పెళ్లాడి, అతడి అన్న అరుణ్‌కు భార్యగా జీవించటం కథలోని కీలకమైన నాటకీయత. ఉన్నత ఉద్యోగం వరించినా దాన్ని వదులుకొని, ఒక బృహత్తరమైన సామాజిక ప్రయోజనం కోసం జీవితాన్ని అంకితంచేసిన రేఖ త్యాగం అందుకు పూర్తి సహాయ సహకారాలందించిన ఆమె తల్లిదండ్రుల ఔన్నత్యం మాటలకందనంత గొప్పవి. ఎయిడ్స్ పేరెత్తితేనే వణికిపోవటం ప్రస్తుత పరిస్థితి. ముందు జాగ్రత్త తప్ప నివారించ సాధ్యంకాని ప్రాణాంతక వ్యాధి ఇది. దీని వల్ల ఆరోగ్యపరంగానే కాదు, సామాజికంగానూ, కుటుంబపరంగానూ కూడా విడదీయలేనన్ని చిక్కులూ ఇబ్బందులూ తలెత్తుతాయి. ఇప్పటి పరిస్థితుల్లో ఎయిడ్స్ బారిన పడిన వ్యక్తి సామూహికంగా, సామాజికంగా వెలివేతకు, తీవ్ర నిర్లక్ష్యానికి, అసహనానికి గురవటం అనివార్య పరిణామంగా తటస్థిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఎంతో రిస్కు తీసుకొని మోహన్ సమక్షంలో ఉంటూ, అతడిలో ఏ కొంత మార్పు అయినా తీసుకురావాలని, అపరిష్కృతంగా ఉన్న ఓ భయంకర సమస్యకి పరిష్కారం చూపించాలని రేణూ పరితపిస్తుంది. తనని తాను అంకితంచేసుకొని అత్యున్నమైన మహోపకారానికి సన్నద్ధమవుతుంది. ఆఖరికి ఫలితమూ సాధించి, డాక్టర్‌సింగ్, డాక్టర్ మధుకర్‌ల పరిశోధనకి, ప్రయోగాలకు వెలుగు మార్గమూ చూపిస్తుంది. 'ఎయిడ్స్‌ని ఒక ఏహ్యకరమైన రోగంగా చూడటం కాదు, భయంతో వణికిపోవటంకాదు, ప్రేమతో, మానవత్వంతో దానిని జయించేందుకు, అధిగమించేందుకు ప్రయత్నిద్దాం' అని సందేశమిచ్చింది ఈ నవల.

అయితే, కథ చిత్రీకరణలో రచయిత్రి తొలుత చూపిన శ్రద్ధ, జాగ్రత్త తర్వాత

చూపలేకపోయారు. కొన్నిచోట్ల సన్నివేశాలు రక్తి కట్టలేదు. సంభాషణలు పొడవుగా ఉండటం కథ నడకను దెబ్బతీసింది. పాఠకుల సానుభూతి పొందిన డాక్టర్ మధుకర్ పాత్రను ఆఖర్లో 'చెడ్డ' చేయటం అవసరంలేనిది. కథలో అదేమీ కీలకమైన మలుపు కాదు కాబట్టి ఆ చిత్రీకరణ బాగుండలేదు. ఇంకొంచెం జాగ్రత్త తీసుకొని ఉంటే సందేశాత్మకమైన ఈ రచన మరింత అలరించేది.

– శాంతిమిత్ర
విశాఖపట్నం-13

## అసహజం

*ఐదవ బహుమతి రూ. 50/–*
*పొందిన సమీక్ష*

'ఇలా ఎందరో' ఎయిడ్స్ రోగి ప్రవర్తన, మానసిక పరిస్థితి గురించిన నవల. సంపన్న కుటుంబంలో పుట్టిన మోహన్‌కి ఎయిడ్స్ వచ్చింది. అటువంటి వాడు పెళ్ళిచేసుకొని ఒక యువతి గొంతు కోయాలనుకుంటాడా? మభ్యపెట్టి పెళ్ళిచేసుకున్నా విషయం తెలిసిన తర్వాత భార్య తనను విడిచి వెళ్ళిపోతుందనే ఆలోచన ఎందుకు రాలేదో మరి!

ఇక రేఖ తండ్రి ఆనందరావు పాత్ర గూడా అసహజంగా ప్రవర్తిస్తుంది. ఒక సంపన్న యువకుడు వచ్చి తమ కూతుర్ని కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటాననీ, డబ్బుతో అతని కష్టాలన్నీ తీరుస్తాననీ అంటే అనుమానం రాదా? ఆ కుటుంబంలో ఆ యువకుడు చిన్నవాడు. పెద్దవాడికి ఎందుకు పెళ్ళికాలేదని అడగకుండా ఉద్యోగం చేస్తున్న కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాడా? పెళ్ళయిన తర్వాత అల్లుడికి ఎయిడ్స్ అనగానే విడాకులు ఇప్పించి వెంటనే అదే కుటుంబంలోకి పిల్లని ఇవ్వడం దారుణం. ఇలా ఎక్కడా జరగదు.

రేఖ ఫ్రెండ్ రేణు పాత్ర గూడా అంతే. ఆమె లెక్చెరర్‌గా చేస్తూ ఐ.ఎ.ఎస్. కావాలని ప్రయత్నిస్తూ, ఆ ప్రయత్నంలోనే ఫ్రెండ్ ఇంటికి వచ్చి ఎయిడ్స్ రోగికి పరిచయమవుతుంది. తర్వాత ఐ.ఎ.ఎస్. కావాలనే ప్రయత్నం, ఉన్న ఉద్యోగం మానేసి ఢిల్లీలో మకాం పెట్టి ఎయిడ్స్ రోగికి సేవ చేస్తుంటుంది. ఆ హాస్పటల్లో ఎయిడ్స్ రోగి మీద ఏదో పరిశోధనట. అదేమిటో స్పష్టంగా అర్థం కాదు. ఆ పరిశోధనకు రేణు ఇర్వై నాలుగు గంటలు రోగి పక్కనే ఉండాలా? ఆ పరిశోధన ఫలిస్తే రేణుకు వచ్చే క్రెడిట్ ఏమిటి? ఎందుకీ అర్థంలేని త్యాగం? ముక్కూముఖం తెలియని ఎయిడ్స్ రోగి కోసం తన ఉద్యోగం వదిలి, ఐ.ఎ.ఎస్ కావాలనే ఆశయం మానేసి రేణు ఎందుకు వెళ్ళాలి? ఆ పరిశోధనకి హాస్పటల్లో సిబ్బంది సహకరించరా? ఒక బలహీనమైన క్షణంలో రోగికి లొంగిపోయి సుఖపెట్టి తనకు ఎయిడ్స్ వచ్చినా ఫరవాలేదనుకుంటుంది? ఎందుకో, ఏమిటో?

ఒక రోగి గురించి నవల చదువుతుంటే పాఠకుడికి అతని మీద సానుభూతి కలగాలి. అయ్యోపాపం అనిపించాలి. 'ఇలా ఎందరో' చదువుతుంటే అటువంటి ఫీలింగ్ కలగదు.

– సి. హెచ్. శివరామప్రసాద్
హైదరాబాద్- 500072

☆

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.



కన్నతల్లి కన్నులలో కాంతిని నేను!
బొమ్మ బుజ్జాయికి అమ్మను నేను!!

ఫొటో: వి. నిత్యానందరావు

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78

ఇట్టే కరిగిపోయే ఇడ్లీలు - ఇంకా తినాలనిపించే
దోశలు - ఇంత అద్భుతమా అనిపించే ఉప్మా...

## ... అన్నీ ఒకే ఒక్క చిటికెలో!




ఔను అద్భుతమైన ఇడ్లీ - దోశ - ఉప్మా - ఏం కావాలన్నా అరక్షణంలో మీకు అందిస్తాయి ప్రియ ఇన్స్టంట్ మిక్స్‌లు. అనుకోకుండా చుట్టాలో - స్నేహితులో వచ్చి తలుపు తట్టినా, ఆకలని పిల్లలు మారాంచేసినా, ఆయన ఆఫీస్ నుంచి త్వరగా ఇంటికి వచ్చేసినా... ఏం కంగారు పడక్కర్లేదు. అపురూపమైన ప్రియ రుచులు - ఎప్పుడుకావాలంటే అప్పుడే సిద్ధం... ఒకే ఒక్క చిటికెలో! సుతిమెత్తని ఇడ్లీలు - నోరూరించే దోశలు - రుచికే కొత్త అర్థాన్ని చెప్పే ఉప్మా.... అబ్బ... ఇంక మీరు వదిలిపెట్టలేరు.. అన్నీ ఆరగించితీరుతారు... ఒకేఒక్క చిటికెలో...!






INSTANT MIXES

www.priyafoods.com